# సురవరం ప్రతాపరెడ్డి

# వ్యాసాలు

మొదటి భాగం

సురవరం ప్రతాపరెడ్డి

ప్రచురణ :

సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

SURAVARAM PRATAPAREDDY VYASALU
Edited by Dr. S. V. RAMARAO

ప్రచురణ :
సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.



ప్రథమ ముద్రణ : 1988

ప్రతులు : 1250

**వెల : రూ. 25/-**

ప్రతులకు :
సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్‌రోడ్డు, హైదరాబాదు - 500 001.

ముద్రణ : పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదర్‌గూడ, హైదరాబాద్-500 029



శ్రీ సురవరం ప్రతాపరెడ్డి

ంననజ : 28-5-1896 అస్తమయం : 25-8-1953

# సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి

## వి జ్ఞా ప న

సురవరం ప్రతాపరెడ్డి నామ సంస్మరణ మాత్రాన ఆనాటి తెలంగాణాలోని సాంఘిక చైతన్యం గుర్తుకు వస్తుంది. గోలకొండ వ్రాతల ఫిరంగి మ్రోతలతో తెలుగు గుండెలలో వీరావేశం నింపిన ధీరుడాయన. పత్రికా సంపాదకుడుగా, పరిశోధక పండితుడుగా, సంస్థల ప్రోత్సాహకుడుగా, ఉత్తమాభిరుచిగల రచయితగా, విశాలాంధ్రోద్యమ ప్రేరకుడుగా సురవరం వారి కృషి సంస్తవనీయం. విశిష్టమైన శైలి, నిర్దిష్టమైన భావం, ఆర్జవావేశం, విషయ వైభవం వారి రచనలలోని సహజ గుణాలు.

ప్రతాపరెడ్డిగారి ముద్రితాముద్రిత రచనలు సేకరించి వాటి ముద్రణ కార్యక్రమాన్ని చేపట్టడానికి ఏర్పాటైన సంస్థ "సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి." ఈ సంస్థలోని సభ్యులు :

అధ్యక్షుడు :

**శ్రీ జస్టిస్ కొండా మాధవరెడ్డి**

ఉపాధ్యక్షుడు :

**శ్రీ దేవులపల్లి రామానుజరావు**

సభ్యులు :

**డా॥ సి. నారాయణరెడ్డి**

**డా॥ బి. రామరాజు**

**డా॥ యం. రామారెడ్డి**

శ్రీ యస్. యస్. రెడ్డి
డా॥ ఎల్లూరి శివారెడ్డి

కార్యదర్శి :

శ్రీ మామిడి రామిరెడ్డి

కోశాధికారి :

శ్రీ గోలి ఈశ్వరయ్య

సురవరం వారి సంపూర్ణ గ్రంథావళి ప్రచురితమైతే పరిశోధక లోకానికి, పరిశోధక విద్వాంసులకు ప్రయోజనకరంగా ఉంటుందని ఈ సంస్థ భావిస్తున్నది. ఈ ఆశయంతో మొదట ఆంధ్రుల సాంఘిక చరిత్రను ముద్రించటం జరిగింది. గ్రంథ ముద్రణ కార్యభారాన్ని వహించటానికి ఈ సంస్థ ప్రత్యేకంగా "సంపాదక మండలి"ని ఏర్పాటు చేసింది. ఇందులోని సభ్యులు :

అధ్యక్షుడు :

డా॥ సి. నారాయణరెడ్డి

సభ్యులు :

శ్రీ దేవులపల్లి రామానుజరావు
డా॥ బి. రామరాజు
డా॥ యం. రామారెడ్డి
శ్రీ గడియారం రామకృష్ణశర్మ
శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి
శ్రీమతి సురవరం పుష్పలత
డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి
డా॥ ఎస్ వి. రామారావు
డా॥ ఇందుర్తి ప్రభాకరరావు

కార్యదర్శి :

**డా॥ ఎల్లూరి శివారెడ్డి**

కోశాధికారి :

**శ్రీ యస్.యన్. రెడ్డి**

సంపాదక మండలి ముద్రణ కార్యక్రమాన్ని ప్రారంభించి ఈనాటికి ఏడు సంపుటాలు ముద్రించగలిగింది. సురవరం వారి ముఖ్యరచనలన్నీ అనతి కాలంలో ముద్రించాలన్నది సంపాదక మండలి నిర్ణయం. ఈ నిర్ణయానికి సహృదయులు, వదాన్యుల సహకారం తోడయితే మా ఆశయం అచిరకాలంలోనే నెరవేరుతుంది.

**డా॥ సి. నారాయణరెడ్డి**

తేది : 25-8-1988

అధ్యక్షుడు

సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి

(సంపాదక మండలి)

# వ్యాస శేముషి

తన కలం ద్వారా సుప్త తెలంగాణమును మేలుకొల్పిన వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డి. ఆయన బహుముఖ ప్రజ్ఞానిధి. పత్రికా సంపాదకుడు. పరిశోధక వతంసుడు. సంఘ చరిత్ర నిర్మాత. స్వాతంత్ర్య సమరయోధుడు. అది ఆంధ్ర మహాసభ కానీ, గ్రంథాలయోద్యమం కానీ, లిపి-భాషా సమస్య కానీ, విద్యార్థి వసతిగృహ స్థాపన కానీ - ఆయన కృషి సల్పని రంగంలేదు. అయితే ప్రతాపరెడ్డిగారు ప్రధానంగా పాత్రికేయులు. గోలకొండ పత్రికను ఆలంబనగా చేసుకొని వారు తన ఉద్యమాలను కొనసాగించారు. చెన్నపట్నంనుండి కాశీనాథుని నాగేశ్వరరావుగారి ఆంధ్రపత్రిక, మచిలీపట్నంనుండి ముట్నూరి కృష్ణారావుగారి కృష్ణాపత్రిక ఏ విధంగా తెలుగు జాతి ప్రగతికి దోహదం చేశాయో, భాగ్యనగరం నుండి గోలకొండ పత్రిక కూడా ఆ విధంగానే సమాజ చైతన్యానికి సహకరించింది.

ప్రతాపరెడ్డిగారు నిరంతర జిజ్ఞాసువు. నిశితమైన పరిశీలనా చక్షువు. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, రామాయణ విశేషములు, హిందువుల పండుగలు ఆయన పరిశోధనాశేముషికి నిదర్శనాలు. ఇవే కాక వారి ప్రతిభకు పతాకలైన వ్యాసాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. అయితే అవన్నీ ప్రాత పత్రికల పుటల్లో, వ్రాత ప్రతుల రూపంలో చెల్లా చెదరుగా ఉన్నాయి. అవి వెలుగులోనికి వచ్చిన నాడు వారి పరిశోధనా వ్యక్తిత్వం ఎంత విశిష్టమైనదో నిరూపితం కాగలదు. వారిలో ఎంత విద్వత్తు నిక్షిప్తమై ఉన్నదో వెల్లడి కాగలదు. ఆ అవసరాన్ని గుర్తించి సురవరం సాహిత్య వైజయంతి వారి వ్యాసాలను సంపుటీకరించడానికి సంకల్పించింది.

సురవరం ప్రతాపరెడ్డి వ్యాసాలు మొదటి భాగం వారి సాహిత్య వ్యాసాల నుండి ఏరిన ముత్యాల సంపుటం. ఇవి 1922-53 మధ్య 30 సం॥ల కాలంలో వివిధ పత్రికల్లో ప్రచురితమైనవి. ప్రతాపరెడ్డిగారు గోలకొండ పత్రిక (1926-47) లోనే కాక సమకాలీన పత్రికలు పెక్కింటిలో రచనలు వెలువరించారు. వానిలో పేర్కొనతగినది పి. ఎన్. శర్మ, గడియారం రామకృష్ణశర్మగారి సంపాదకత్వంలో వెలువడిన సుజాత (1927-30, 1950-53). పి. వి. రాజ మన్నార్‌గారి 'కళ' (మద్రాసు - 1922) లోనూ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి 'ప్రబుద్ధాంధ్ర' (రాజమండ్రి - 1930) లోనూ వారి రచనలు ప్రచురిత మైనాయి. ఇంకా మీజాన్ (1942), విభూతి (1940), ప్రజా బంధు (1935) మొదలగు పత్రికలలోని వ్యాసాలు కూడా ఈ సంకలనంలో ఉన్నాయి.

ఈ సంపుటిలోని కొన్ని వ్యాసాలు ధారావాహికంగా విడి భాగాలుగా ప్రచురితమైనవి. వాటిని ఒక శీర్షిక క్రింద (గాథా సప్తశతి, పల్లె పదాలు మొ॥) చేర్చటంలో పునరుక్తులకు అవకాశం లేకపోలేదు. వ్యాసాల కూర్పులో అవసరమైన స్వల్పమార్పులు తప్ప ప్రతాపరెడ్డిగారి రచనలు యథాతథంగా ఇందులో ప్రచురితమైనాయి.

ఇందలి వ్యాసాల వరుస కాలక్రమాన్ని అనుసరించి కాక విషయ విభాగాన్ని దృష్టిలో పెట్టుకొని కూర్చబడింది. సాహిత్య వీథిలోని అన్ని కోణాలపై సురవరం వారి దృష్టి ప్రసరించింది. మొదటి వ్యాసం ప్రాకృత కావ్యమైన గాథా సప్తశతిలోని సామాజిక చిత్రణను, కవితా వైశిష్ట్యాన్ని సమగ్రంగా దర్శింపజేస్తుంది. రెండు, మూడు వ్యాసాలు వివిధ యుగాలలో వెలసిన ఆంధ్ర వాఙ్మయ సంగ్రహ సమీక్షలు. తర్వాతి ఆరు వ్యాసాలు ప్రక్రియా విమర్శలు. పల్లెపదాలపై ప్రతాపరెడ్డిగారి ఆసక్తి ప్రశంసనీయమైనది. జానపద వాఙ్మయం గురించిన వారి రచనలు ప్రత్యేక సంపుటంగా రాదగినవి. పది, పదకొండు వ్యాసాలు లోకోక్తులు, శబ్దాల వ్యుత్పత్తికి సంబంధించినవి. వారి భాషా పరిజ్ఞానానికి తార్కాణాలు. తర్వాతి తొమ్మిది వ్యాసాలు నన్నెచోడుడు మొదలుకొని అనర్ఘరాఘవకర్తవరకు గల ప్రాచీనాంధ్ర కవుల, కావ్యాలపై సమాలోచనలు. కవుల దేశకాల చర్చలు, కావ్య కర్తృత్వవాదాలు, కవిత్వానుశీలనం వీనిలో చోటు చేసుకొన్నాయి.

పరిశోధన, విమర్శ సమతూకంగా సమ్మేళనం చెందిన విశిష్ట రచనలు సురవరంవారివి. కొమర్రాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి మున్నగు మహనీయుల కోవకు చెందిన పరిశోధ కాగ్రగణ్యులు వారు. ప్రతాపరెడ్డిగారి సాహిత్య వ్యాసాలను సంకలించి మీ ముందుంచటం నా భాగ్య విశేషంగా భావిస్తున్నాను. ఈ అవకాశం కలిగించిన సురవరం సాహిత్య వైజయంతి కార్యవర్గ సభ్యులకు, నాకు ప్రోత్సాహం అందించిన గురువర్యులు డా॥ సి. నారాయణరెడ్డిగారికి, గురుతుల్యులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి నమస్సులు. వ్యాసాల సేకరణలో తోడ్పడిన శ్రీ సురవరం నారాయణరెడ్డిగారికి, డా॥ ఎల్లూరి శివారెడ్డిగారికి కృతజ్ఞతలు.

**డా॥ ఎస్.వి. రామారావు**
రీడర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం

# అనుక్రమణిక

# గాథా సప్తశతి

సంస్కృతమందు కాని, ప్రాకృతమందు కాని, దేశ భాషలందు కాని గాథా సప్తశతితో సమానమగు కవితలేదు. శాలివాహన చక్రవర్తులలో నొకడగు హాలుడు తన యాస్థానమందును తనకన్న ముందు కాలమందును నుండిన కవుల యొక్కయు కవయిత్రుల యొక్కయు పాకృత పద్యముల నేర్చికూర్చి యందు తన సొంత పద్దెములను కొన్నింటిని జేర్చి 800 పద్యముల పరిమితిగా సంకలించి ప్రపంచాని కందించెను. అదే గాథా సప్తశతి. హాలుడు తనను గూర్చి యేమియు తెలుపుకొనలేదు. ప్రతి శతకానంతర మొక పద్యములో తాను సంకలన కర్తనని మాత్రము తెలుపుకొనెను.

"రసిక జన హృదయ దయతే
కవివత్సల ముఖ సుకవి సంకలితే"

అని ప్రథమ ద్వితీయ తృతీయ పంచమ షష్ఠశత కాంతములందును "నరపాల హాల రచితే పాకృత కావ్యేత్ర సప్తశతే' అని సప్తమ శతకాంతమందును "అత్ర చతుర్థం విరమతి నిసర్గ రమ్యం శతం హి గాథానాం! మధురత్వే నామృత మపినోలగతి హృదయే"* అని చతుర్థ శతకాంతమందును వ్రాసెను. ఈ పద్యములు నిసర్గ రమ్యమైనవనియు వాటి మాధుర్యము ముందర అమృతము కూడ చప్ప చప్పనిదే యనియు కవి హృదయము.

పై శ్లోకాలలో "కవివత్సల ముఖ సుకవి సంకలితే" అనునది యను మానమునకు తావిచ్చినది రాజులు మందులనియు కవి యశః కాముకులనియు,

---

* నేనీ చర్చయందు ప్రాకృత మూలమునకు మారుగా ఛాయారూపమై సంస్కృత చ్ఛందోబద్ధమైన భట్ట శ్రీ మథురానాథశాస్త్రి సంస్కృత శ్లోకాలనే యుదాహరిస్తున్నాను.

ఇతరులచే వ్రాయించిన కవితలకు పైకమిచ్చి తమపేర్ల నతికింతురనియు, మన దేశమందుకథలల్లినారు. ఆ కథలలో నీ కథయు చేరినది. హాలుని యాస్థాన మందు కవి వత్సలుడో, శ్రీపాలితుడో యొక డుండెననియు, అతడే సంకలనకర్త యనియు, హాలుని పేరు ద్రవ్యాశచే తగిలించె సనియు నందురు. కాని యది నిరాధారము. శతకాదియందే హాలు డిట్లు వ్రాసెను.

"సప్త శతకాని కోటేర్మధ్యే
కవి వత్సలేన హాలేన
గాథానాం రచితాని హి
నానాలంకార లలితానామ్'' 1,3.

హాలుడే కవివత్సలుడు, హాలుని గురించి మనకు అయిదవ శతకమందు మరికొన్ని విషయములు తెలియవచ్చినవి.

దదతా సంవాహన సుఖ
రస సంతుష్టేన తవక రేలాక్షాం
విక్రమ నరేంద్ర చరితం
చరణేన హి శిక్షితం తస్యాః. 5-64

భార్యభర్తతో నిట్లన్నది. లక్కరంగు పూసిన నా సవతి కాళ్ళ పిసికినది నీ యరచేతిలోని లక్క గుర్తులే చెప్పుచున్నవిలే.

నా సవతి విక్రమార్క చక్రవర్తి యంతటిది! విక్రమార్కుడు శత్రు సంబాధమున పేరొందిన భటుని కొక్కొక్కని కొకలక్ష యిచ్చెడివాడు. (ప్రాకృతములో లక్ష- లక్కయు సంబాధము - సంవాహము ఒకటే) విక్రమార్కుని యొక్క యొక ప్రసిద్ధ చర్యను పేర్కొనుటచే విక్రమార్కుడు హాలునికన్న ముందుండిన చక్రవర్తియనియు, అతడు కల్పిత పురుషుడు కాదనియు దీనివలన స్పష్టమైనది.

''దీనులైనవారి తేకువ దీర్చి ర
క్షింప నేర్చువార లిరువురిలను

పార్వతీశుడైన పరమేశ్వరుడు, రాజ
వల్లభుండు శాలివాహనుండు. 5-62

(గాథా సప్త శతీ సారమును శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు (లెక్చరర్, మైసూరు యూనివర్సిటీ, మైసూరు) వ్రాసిన పద్యాల నుదాహరింతును. వారు అనువదించిన వాటిని ముఖ్యమని తోచిన వాటిని సంస్కృత మూలముననే యుదాహరింతును.)

కాళ్ళు పిసుకుటకు 564 లో విక్రమార్కుడే యుపమానమును 566 లో దీనుల నుద్ధరించుటలో నీశ్వరునితో తుల్యత్వమునకు శాలివాహన నరేంద్రుని పోల్చుటలో విక్రమార్క-శాలి వాహన వంశాలకుండు పోటీ సూచితము. దీనులను టకు మూలములో అవణాయి" అని కలదు. అది ఆపన్నాని యనియు ఆపర్ణాని యనియు నగును. ఆపర్ణయన పార్వతి. ఆపర్ణులు పార్వతేయులు అనగా శైవులు. ఆకులు కట్టని ఆదిమ నగ్నజనులలో వెలసిన దేవత యనియు సూచిత మను కొందును. హాలుని కాలమందు శైవము బౌద్ధముతో పాటు ముఖ్య మత మనియు శాలివాహనులు శైవులనియు దీని నుండియే కాక.

అలుకమెయి జేవురించిన యాదిశక్తి
మోము జందురు నీడలో మొలచియుండ
పూజ తామర దాల్చిన పోల్కి బొలుచు
హరుని సంధ్యా జలాంజలి కెరగుదీరు. 1-1

అని ప్రథమ పద్యము నుండియు

సంధ్య వార్చగ దోసిట జలము పట్టి
నపుడు గౌరీ ముఖాంబుజమందు దోప
మంత్ర మంతయు నొక మాఱు మఱచి పట్టి
మోవినిగదల్చు శివునకు మ్రొక్కులిడుదు. 7-111

అని పాఠకుల శృంగార రసానందమందు ముంచి తేల్చిన తుది పద్యము నుండియు నిస్సందేహముగా వెల్లడియైనది.

"తవరణజలద సమయ భయ
చల విహ్వల పక్షకైరనుప్రియతే" 5-71

శాలివాహనుని శత్రువులు విజితులై భయ విహ్వలులై విధేయులై అనుసరించి సేవించిరని హాలుడు వ్రాసుకొనెను. సప్తశతిలో హాలుని గురించిన సూచనలివియే. శాతవాహనులాంధ్ర రాజులని పురాణాలలో పేర్కొనబడినారు. హాలుడు క్రీస్తు శక ప్రథమ శతకమందుండిన వాడని పలువురు చరిత్రకారులు నిర్ణయించినారు. ఔరంగబాదు జిల్లాలోని యిప్పటి పైఠానును అప్పటి ప్రతిష్ఠాన పురమును రాజధానిగా మధ్య దేశమంతయు నేలినన చక్రవర్తి. బహుశః ఇతడే శాలివాహనశక ప్రవర్తకుడై యుండును. ఇతనిని గూర్చి భట్ట శ్రీ మధురానాథ శాస్త్రి గారిట్లు సంస్కృత పీఠికలో వ్రాసిరి.

"కథా సరిత్సాగరములోని రాజును గూర్చిన కథ కలదు. ఇతనికి మొదట సంస్కృతము రాకుండెను. ఇతని భార్యయగు మలయవతి కది బాగుగా వచ్చి యుండెను. ఒకనాటి జలకేళిలో రాజు నీటితో రాణిని కొట్టగా ''మోదకైస్తాడయ'' యనగా కుడుములు తెప్పించి కొట్టగా నామె పరహసింప సిగ్గుపడి శర్వవర్మ బోధచే అచిరకాలమందు పండితుడయ్యెను. బాణాదు లిట్లితనిని గూర్చి వ్రాసిరి.

''అవినాశినమగ్రామ్యమకరోత్
సాతవాహనః విశుద్ధ జాతిభిః.
కోశరత్నైరివ సుభాషితైః" కాని యిది యుపచార వాక్య సూత్రమేమో? అభినంద ప్రణీతమగు రామచరిత మహా కావ్యమందు హాలేనోత్తమ పూజయాకవి వృషః శ్రీ పాలితో లాలితః। ఖ్యాతిం కామపి కాళిదాస కవియోనితాః శకారాతినాః శ్రీహర్షోనిత తార గద్యకవియే బాణాయవాణీఫలం। సద్య! సత్క్రియ యాభినందనుపిచ శ్రీహారవర్షో గ్రహత్।" అని శ్రీ పాలితుడను కవియే హాలుని పేర నీ సంకలనము చేసెనని వ్రాసినారు. దీనిని బట్టి శ్రీపాలితుడే దీని కర్త యనుట భావ్యము'' భట్టశ్రీ గారు మరల ఇట్లు వ్రాసిరి.

"కేనానన్నాఢ్య రాజన్య రాజ్యే ప్రాకృత భాషిణః
కాలేశ్రీ సహసాం కన్యకేన సంస్కృత భాషిణః"

అని భోజుడు సరస్వతీ కంఠాభరణమందు వ్రాసెను. "ఆఢ్యరాజు (హాలుని) రాజ్యమందందరు ప్రాకృతము మాట్లాడిరి. విక్రమార్కుని రాజ్య మందందరును సంస్కృతము మాట్లాడిరి అని యితడు తెలిపెను. సప్తశతి శృంగారరసభూయిష్టము. ఇది అపూర్వ ధ్వని కావ్యము. రుద్రట, మమ్మట, వాగ్భట, విశ్వనాథ, భోజాది సాహిత్యశాస్త్రకర్తలు దీని నుండి యుదాహరణ ములను గైకొనిరి."

సప్తశతి యందు 200 పద్యాలలో పాలితుని పేర నుండునవి తొమ్మిది పద్యాలు మాత్రమే. హాలుని పేరనుండు పద్యములు 47. ఈ పద్యాల నెవరు వ్రాసినట్లు? సహజముగా సంకలనకర్త తన పద్యాల నెక్కువగా చేర్చును. మరియు సంకలనము చేయుట కూడ కష్టమగు పనియా?

దానికి పాలితుడే యవసరమా? అభినందుని శ్లోకము పాలిత పక్షముగా నుండిన నంతకు చాలా ప్రాచీనుడగు "బాణాదుల" శ్లోకాలు హాలుని పక్షాన వాదించినవి కదా. రాజుల కవిత్వాలకుండు నీ అపప్రథ హాలునికిని తగిలినది. హాలుడు సంకలనకర్త కాదనుటకు ప్రబలాధారములు కానరాలేదు.

## సప్తశతి కవులు

సప్తశతి పద్యాలలో ఇంచుమించు 250 పద్యాలకు కర్తలెవరో తెలియ రాలేదు. ఇందు పలువురి స్త్రీల పద్యాలున్నవి. రేవా (1-87-90), రోహాయే (2-6-3), మాధవి (1-91), అణ్ణుల లక్ష్మి (3,28,63,74,76) పాహాయీవే (1-70,83), వద్ధవాహాయే (1-60-70-86) శశిప్రభా (4-4) అనువారు కవ యిత్రులు) ఈ విషయమాకాలపు స్త్రీల యౌన్నత్యమును సూచించును.

ఇంకను ఇట్టి పద్యముల సంకలనములనేకములుండినట్లు ప్రాచీనులన్నారు. ఈ సప్తశతీ ప్రాశస్త్యమును దీనిపై పుట్టిన 19 వ్యాఖ్యానములే చాటుచున్నవి. అందు గంగాధరభట్టు వ్యాఖ్య ప్రసిద్ధమైనది. సప్తశతిలోని పద్యాలు సాహిత్య

శాస్త్రకారులు విశేషముగా నుదాహరించుకొనిరి. భోజుడందరికన్న నెక్కుడుగా నీ పద్యాలు తన సరస్వతీ కంఠాభరణమం దుదాహరించుకొనెను. ధ్వన్యాలోకకారుడును కొన్ని (2-75) పద్యాల నుదాహరించుకొనెను. మమ్మటుడు (1-4, 7-65, 7-67, 2-82, 5-55, 2-75) కొన్ని పద్యాల నుదాహరించుకొనెను.

## భాష

సప్తశతిలోని భాష మహారాష్ట్రి ప్రాకృతము. ప్రాచీనులలో పలువురు సంస్కృత పండితులు ప్రాకృతమే సుకుమార సుందర భాషయని మెచ్చుకొనిరి. **హాలుడే**యిట్లనెను.

"అమృతం ప్రాకృత కావ్యం."
చెవుల కమృతంబు ప్రాకృత
కవనము చదువంగ వినగ గానని వారల్
పువువిల్తు శాస్త్ర మర్మము
వివరించెదరెట్లు సిగ్గువిడిచి మనమునన్" 12

కర్పూర మంజరియను ప్రాకృత నాటకములో రాజశేఖరుడిట్లు వ్రాసెను.

పరుషాః సంస్కృతబంధాః
ప్రాకృత బంధోపి భవతి సుకుమారః
పురుష మహిళానాం
యావదిహాంతరం తానదేతేషాం॥

స్త్రీపురుషులకెంత భేదమో యంత ప్రాకృత సంస్కృతాలకున్నదని భట్టశ్రీగారు వజ్జాలగ్గ అను ప్రాకృత గ్రంథమునుండి ఈ క్రింది శ్లోకమునుదాహరించిరి.

"లలితే మధురాక్షరే
యువతి జనవల్లభే సశృంగారే
సతిప్రాకృత కావ్యే
కః శక్నోతి సంస్కృతం పఠితుం.

లలిత మధురమై యువతి జనాహ్లాదియైన ప్రాకృత కావ్యాన్ని వదలి సంస్కృతము నెవడు పఠింప సహించును." పై విషయాలనుబట్టి చూచిన శాలి వాహనుల కాలమువరకు ప్రాకృత భాషలు జనుల మాతృభాషలగుటచేత వాటిపై గల యభిమానముచే సంస్కృతమును చిన్నచూపుతో జూచియుందురు. వివిధ ప్రాకృతములలో సప్తశతిలోనిది మహారాష్ట్ర ప్రాకృతమందురు. మహారాష్ట్రుల మాతృభాషలోని పదాలిందెన్ని కలవో యేమో కాని మన తెనుగులో సాధారణమై వాడుకలోనున్న బహుపదములు సప్తశతిలో కానవచ్చును. ఎట్లనగా

అత్తశబ్దము శ్వశ్రుమాతులాని శబ్దములకు మారుగా గ్రంథమందంతటను చాల మారులు వచ్చినది. అత్తా తహరమణిజ్జం (శ్వశ్రుతథా రమణీయం (4-8) మామ భార్య మాతులానికి "మామి"యని పలుమారు వాడినారు. (1-93, 99) ఇది మన మామకు సన్నిహితమగుమాట. పొట్ట (1-83, 2-71) పడి (పతిత) (5-27) వల (వలగొను) 1-25 పల్లి (పల్లె) 1-30 పాడి (పాడియావు 1-65) కంటె 1-75 కాకి (22) మడ (ఏటిమడ 2-5) దేవళ (ము) 2-9, చేట (2-69) అద్దం 3-4, సవతి 3-11, దివ్వె 3-22, కడప 3-29, అవ్వ (ఆశ్చర్యార్థకము - ఒరంగల్ ప్రాంతమందలి యాశ్చర్యార్థక ప్రయోగము) 3-73 గంజి 3-86, చిప్పెర (చిప్పెర గడ్డి అలుము) 4-30 తరము (శక్యము) 4-49, గంటు (ముడిగ్రంథి) 4-51, తుపరీ (తువ్వ తొగరి-కంది-తువ్వనేల) 4-58 ఇట్టి పదాలు లభ్యమిగుచున్నవి. గోదావరిని గోదా యనియు (1-58), గోలా యనియు (2-3) పలుమారు వాడినారు. పూర్వరూపము గోలా యని తర్వాత గోదా యనియు (అదే గోదా ఏరు-గోదారి) తర్వాత గోదావరి యనియు గ్రహింపవచ్చును. సప్తశతీ శృంగారరంగములు పల్లెలు, తటాకములు, పంటపొలాలు, గోదావరీ తీరములు, వింధ్య పరిసరాలు, దేవళములు.

## అనుకరణములు

సప్తశతి ప్రాశస్త్యమును గ్రహించి యనేక కవులు దానిననుకరించిరి. అందు ముఖ్యులు అమరుడు, గోవర్ధనాచార్యుడు, బిహారి. అమరుడు అమరశతకమును వ్రాసెను. గోవర్ధనుడు ఆర్యాసప్తశతిని రచించెను. బిహారి వ్రజ భాషలో బిహారి సత్సయి (సప్తశతి) వ్రాసెను. వీరుకాక మరికొందరు దీని భావముల గ్రహించిరి. భట్టశ్రీగారు 1-46 లోని యీ క్రింది

"రాతి మనసుతోడ నాతడు రేపూరు వదలి పోవుననెడు వార్తగలిగె వానికెపుడు దెల్లవారకయే యుండ రాత్రి తల్లి పెరిగిరావే నేడు."

అను పద్యమునకు హిందీలో నీ క్రిందిది కలదని తెలిపినారు.

సజన్ సకారై జాయగే
నైన్ మరేగే రోయ్
విధనా ఐసీరైన్ కరే
భోర్ కబ్ హినహోయ్.

మరియు 2-61 "ఊర్ధ్వాక్ష: పిబతిజలం" అను పద్యాన్ని అప్పయ దీక్షితుడు మాటలు మార్చి ఇట్లు వ్రాసెననెను.

'యదోర్ధ్వాక్షః పిబత్యంబు
పథికో విరళాంగుళిః
తథా ప్రపా పాలికాపి
ధారాం వితనుతేతనుం॥'

(క్రీడాభిరామములో 3-38)

'విక్రీణీతే మాఘే ప్రావరణం పామరోహి బలదేన నిర్ధూమ ముర్మరని భౌనూనం 'శ్యామా స్తనౌ పశ్యన్' 3-38 అను పద్యానికి 'మాఘమాసంబు పులివలె మలయుచుండ పచ్చడంబమ్మికొన్నాడు పణములకును ముదితచన్నులు పొగ లేని ముర్మరములు చలికి నొఅగోయ కేలుండు సైరికుండు'-అను పద్యము కలదు

సప్త శతిలోని (4-15)
జంఝూవాతోత్తృణితే
గృహేరుదిత్యానిస్పహ నిషణ్ణాం
దర్శయతి గతిపతికాం

విద్యుదుద్ద్యోతో జలధారాణాం అను పద్యానికి క్రీడాభిరామములో నీ క్రింది పద్యము కలదని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ పీఠికలో వ్రాసిరి.

మ. "పటు ఝంఝూ పవనోత్తృణాలయములో భద్రంబునం బట్టెకం।
కటిపై ముచ్చము డింగి నిర్భర వియోగగ్లాని శోషిల్లియ్యె।
క్కటిని ద్రించుచునున్న వాడవనితన్గర్జా వచః ప్రౌఢిమన్-
దటి దుద్ద్యోతము సూపునట్టు నడురే ధారా ధరశ్రేణికిన్॥"

శ్రీ రా. అనంత కృష్ణశర్మగారిట్లు పీఠికలో వ్రాసినారు. "వంగూరి సుబ్బారావుగారు ఎక్కడ నుండి సంపాదించిరో కాని శ్రీనాథుని శాలివాహన సప్త శతి లోనిదని యీ క్రింది పద్యముదాహరించిరి.

'వారణసేయ దావగొనవా, నవవారిజమందు తేటిక్రో।
వ్వారుచునుంట నీవెరుగవా, ప్రియవా తెరగంటి గంటికె।
వ్వారికి గెంపురాదె, తెగవా మగవారల దూర, నీ విభుం।
డారసినీనిజం బెరుగు నంతకు నంతకు నోర్వు నెచ్చెలీ॥'

కాని యిప్పటి సప్త శతిలో దీనికి మూలమైన ప్రాకృత గాథ కానరాదు."

నూనూగు మీసాల నూత్న యౌవనమున సాతవాహన సప్త శతి నొడివితి అని శ్రీనాథుడు చెప్పి యుండెను. కాని యది యింతవరకు లభ్యముకాలేదు. సప్త శతి పద్యాలను బోలిన ప్రాకృత పద్యాలను కొన్నింటిని మమ్మటాదులుదాహరించిరి. కాని యవి యెచ్చటివో తెలియదు. ఆర్యా సప్త శతికి దారి చూపినది శాలివాహన సప్త శతియే కాని ఆర్యా సప్త శతి పద్యాలు వీటి ముందర దిగదుడుపుగా నున్నవి. హాలుని గోవర్ధనుడు పూర్తిగా అనుకరించెను. ఇక అమరు కవి శ్లోకాలను గురించి విచారింతము. అమరుక కవి బహుశ క్రీ శ. 200 ప్రాంతము వాడై యుండును. అతని కసాధారణకీర్తి కలిగెను. 'అమరుకవే రేకః శ్లోకః ప్రబంధ శతాయతే' అను నా నుడి యేర్పడెను. అమరు కవి యొక్కొక్క శ్లోకము నూరు ప్రబంధాలకు సాటి యనిరి. అట్టి కవి తన పెక్కు శ్లోకాలలో పూర్ణముగ గాథా సప్త శతి భావములను దింపుకొనెను. భట్టశ్రీ మధురానాథశాస్త్రి

గారు గాథలకును అమరుని శ్లోకాలలో గల సంపూర్ణ సామ్యములను చక్కగా నిరూపించినారు. ఉభయ గ్రంథ శ్లోకాలను పూర్తిగా నుదాహరించుటకు వీలులేనందున రెంటిని మాత్రము చూపించి తక్కినవి సూచింతును.

"కృత కస్వాపనిమీలితనయన
సుభగదేహి మహ్యామవకాశం
గండ పరిచుంబ నోద్గత పులక
పునర్నైవచిరయిష్యే. 1-20

శూన్యం వాసగృహం విలోక్య శయ నాదుత్థాయ కించిచ్ఛనైః।
ర్నిద్రావ్యాజ ముపాగతస్యసుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖం।
విశ్రబ్ధం పరిచుంబ్యా జాతపులకా మాలోక్యగండస్థలిం।
లజ్జానమ్రముఖీ ప్రియేణహసతా బాలాచిరం చుంబితా॥"

అమరు శతకం-77

"దయితే ప్రసీద, కుపితా కాని
సుతనుత్వం, పరేస్తికః కోపః?
కోస్తిపరో? నాథత్వం! కిమితిహి,
మనుదురిత శక్తిరియం" 4-84.

'బాలే! నాథ! విముంచ మానిని రుషం, రోషాన్మయా కింకృతం,
ఖేదోస్మాను, నమేపరాధ్యపతి భవాన్ సర్వే పరాధామయి,
తత్కింరోదిషి గద్గదేన వచసా, కస్యాగ్ర తోరుద్యతే,
నన్వేతన్మమ, కాత వాస్మి దయితానాస్మీత్యతో రుద్యతే". అమరు. 58.

ప్రణయ కుపిత 1-27
అన్యోన్య కటాక్ష 2-99
వీటికి సాటి అమరు శ్లోకము
ఏకస్మిన్‌శయనే .. 19
స్థగయిష్యామి 4-14
దీనికి అమరుని అనుకరణము

భ్రూ భంగేర చితేపి-24
యత్పృచ్ఛసి నివాసన్మాం 7-11
దీనికి అమరుని అనుకరణము
అంగానామదితానవం-45

అమరుడు అను రాజు చావగా అతని శరీరములో పరకాయ ప్రవేశ విద్యచే ఆది శంకరాచార్యులు ప్రవేశించి అమరు రాజై అతని భార్యతో సుఖించి యీ శతకము వ్రాసెనని యొక అద్భుత కథకు విచిత్ర రూప మేర్పడినది. ఇదంతయు నవిశ్వసనీయము. శంకరుని కాలము 700-800 మధ్య కాలము. అమరుని ఆనంద వర్ధన, మమ్మటాదులు గ్రహించినందున వారిరువురు క్రీ.శ. 10-11 శతాబ్దముల వారగుటవలన అమరుకు క్రీస్తు శకము 700 ప్రాంతము వాడనిన పొరపాటుండదు. అమరుడెవ్వడో తెలియదు.

విహారి సత్సయీ వ్రాసిన విహారి కవి యెప్పటివాడో తెలియదు. అమరు గోవర్ధనుల తర్వాత వాడని మాత్రమే భట్టశ్రీగారన్నారు. సత్సయీలోని భాష యిప్పటి హిందీకి చాల దూరముగానున్నది. కబీరు, తులసీదాసుల భాష కన్న చాలా ప్రాక్తనమైనది. కావున అది క్రీ. శ. 1200 - 1300 ప్రాంతముదిగా నుండును. సత్సయీలోని చాలా దోహలు (ద్విపదలు) గాథా సప్తశతి నుండి యేర్పడినవే యని భట్టశ్రీగారెత్తి చూపినారు.

## తెనుగు సేత

శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు అసాధారణ కవి పండితులు. సంగీత సాహిత్య విద్యా నామక యుగళంబు గ్రోలినవారై బహు భాషలను ప్రాకృత మును నెరిగిన వారగుటను, తెనుగున ఉత్తమ వచన శైలిని, మధుర కవితను నల్ల గలిగినవారు. వారు గాథా సప్తశతిలోని 395 పద్యముల నేరి తెనుగించి నారు. వారి విచక్షణ సరియైనదే పచ్చి శృంగారమును, అనవసరమగు పద్యాలను, అనుత్తమమైన వాటిని పరిహరించినారు. మూలమందలి భావములను అందలి గంభీరతను చెడకుండ సుందరముగా సులభ గ్రాహ్యమగునట్లుగా చేతికందించినారు. వారే దానికి పీఠిక వ్రాయవలసియుండెను. అటులే కొంత చేసినట్లే! శ్రీనాథుని కృతియుత్సన్నమైన వ్యథను వీరు తొలగించినారు.

## నాటి ఆచారాలు

గాథా సప్తశతి యొక్క కాలమును నిర్ణయించినాను. కావున ఆ కాల మందలి సాంఘికాద్యాచార విశ్వాసము లెట్టివో సప్తశతిలోని వర్ణలనుబట్టి మనము స్పష్టముగా నిరూపింపవచ్చును. గాథలన్నియు నుద్దేశ పూర్వకముగా శృంగార భూయిష్టముగా సంకలింపబడినందున నా కాలమున జనులందరు శృంగారలంపటు లని తలపరాదు.

## మత విశ్వాసాలు - ఉత్సవములు

ఆ కాలమందు కొన్ని పురాణ దేవతలకు విశేష వ్యాప్తి యుండినట్లున్నది. రామలక్ష్మణులు (1-35) వామనుడు (5-6) రాధాకృష్ణులు (1-89) గణపతి (4-79) పేర్కొనబడినారు. అందు పాపము గణపతి పొట్టగలవాడగుటచే ఒక విలాసినికి రహస్య సంగతిలో తలగడగా పనికి వచ్చెను.

యౌవనములో సురతసమయ పరిధానీకృత గణపతి వార్ధక్య దశలో పాప పరిహర్తగా పూజితుడయ్యెను. ఎందరు పౌరాణిక దేవతలు పుట్టినను గిట్టినను నేటివలనే నాడును గ్రామ దేవతలకే ప్రాముఖ్యముండెను.

'ఈవు చేతులారా నిచ్చినదని ప్రాచి
పూలసరము తావి పోయి యున్న
నింతి దాల్చుచున్నదింకను, వ్రత పూజ
ముగియ, నూరివేల్పు బొమ్మవోలె (2-94)

(ఉదాహృతాంధ్ర పద్యములన్నియు శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారి వని యెరుగవలెను.) ఆ గ్రామ దేవర్లకు దున్నపోతుల బలి ఇచ్చుచుండిరి.

కేవల హిందూ మతమేకాక బౌద్ధమతముకూడా మంచి వ్యాప్తిలో నుండెను. అందుచేత రెండు తావులలో తత్ప్రసక్తియు వచ్చినది.

భిక్షకుండు నాభినీక్షించుచుండగా
నదియు వానిమోము నరయుచుండె

అతని చేతిచిప్ప నామె చేతుల తట్ట
కాకులేరి తినుచు గాకుచేసె (2-62)

ఇచట వీడు దొంగ సన్యాసి !

చిలుకముక్కు వన్నెచే నొప్పు మోదుగు
పూలవరపు పొలిచె నేలనెల్ల
బుద్ధ దేవు చరణములు మ్రొక్క బుడమిపై
వ్రాలియుండు భిక్షు జాలమట్లు 4-8

స్త్రీలు వాయనము లిల్లిల్లు దిరిగి యిచ్చు వాడుక యుండెను. (4-28) పండుగలలో హోలీ పండుగ (ఫల్గుణోత్సవము) చాల ముఖ్యమైనది. స్త్రీ పురుషులు రంగులు చల్లుకొనుచు వినోదించెడి వారు. (4-69) 6-35 చూత లతికా క్రీడ యనునదుండెను. ప్రియతమ నామమేమి చెప్పుమని ప్రియుల చూత లతికతో లేక నవ పలాశ లతతో కొట్టుట యీ క్రీడా విశేషమట ! (1-28; 5-56) శైవ సాంప్రదాయకములోని కాపాలికులందందుండిరి. (5-8) ప్రజలకు శకునాలపై విశ్వాసముండెను. "ఏ కోపి కృష్ణసారో నదదాతివలనన్ ప్రదక్షిణం గంతుం" (1-25)

## ధన నిక్షేపములు

నిన్న మొన్నటివరకు మనదేశమందలి ధనికులకు భూవివరములే బేంకులై యుండె ననగా ఆ కాలమందు జనులు ధనమును, వెండి, బంగారును భూమిలో పూడ్చి దాచి పెట్టుకొనుచుండిరనిన చిత్రముగాదు. గాథలందు విరివిగా నీవిషయ చర్చలు వచ్చినవి.

"తగిన చోటు గాదు దాచుట కిది; యేల
సాహసంబు జేయ జనెదు కొడుక ! 2-54

భూమిలో పాతిన ధనము పలుమారు నష్టమైనదని యిందు సూచితము.

"చరోజనులు సారె సారెకు జూతురు
భయము కోరికయును పై కొనంగ
వీరవరుని పత్ని వీగు జన్నుల; పాము
కాచు కొన్నలిబ్బి కడవలట్లు 6-72

బహు కాలము భూస్థాపితమైన ధనములపై పాములు కావలి యుండునన్న విశ్వాస మానాటికే ప్రాతదై యుండెను.

## శిక్షలు

శిరచ్ఛేద శిక్ష పొందిన వాణ్ణి వధ్య స్థానమునకు తీసుకొని పోవుచూ తప్పెట వేసి యందరికి తెలియునట్లుగా వాని తప్పును, వాని శిక్షను ప్రకటించెడి వారు.

దొంగతనం చేసిన వారికి మరణ దండనము, శ్మశానమందు చెట్టుపై వ్రేలాడ గట్టట యానాటి యాచారముగా కానవచ్చును. "శంకా శ్మశాన పాద లంబిత చోరే ఖేప ఖరేస" (6-36) అనుటయే నిదర్శనము. వ్యభిచారులను గ్రామాధికారులు శిక్షించుచుండిరి. (6-56)

## స్త్రీల వేష భూషలు

స్త్రీలు స్నానము చేయు నపుడు పసుపు రుద్దుకొను చుండిరి. (1-80) కన్యలకు తొలి సమర్త కాలమందు పసుపులో నెయ్యి కలిపి ముఖమునకు చేతులకు కాళ్లకును రుద్దుచుండిరి. (3-46) ఇచ్చట మూలమందు "వర్ణఘృత లిప్తముఖం" అను పదముపై శ్రీ మథురానాథ శాస్త్రిగా రిట్లు వ్యాఖ్యానించిరి. "హరిద్రావర్ణమిశ్ర ఘృతం వర్ణఘృతం దేశ విశేష రజస్వలా ముఖం వర్ణఘృతేన, లిప్యతి ఇతికా చిత్రపథా" ఉత్తర హిందూ స్థాన మందీయాచారము లేదనియు "ఒకానొక దేశ విశేషమందు" ఈ యాచారముండెననియు వ్యాఖ్యాత్రభిప్రాయము. ఇది ద్రావిడా చారము. సప్తశతిలో గోదావరీ తీరవాసుల యాచారాలు వర్ణించినందునను నేటికిని ఆంధ్రులలో నీయాచారముండుటవలనను దేశవిశేష నాంధ్రదేశమనుట స్పష్టము (చూడుడు 122మరియు 619). ముత్తైయిదువలు కాళ్ళకు లంకరంగు పూసుకొను చుండిరి. (2-27) టుక్క పిండిని (కర్పూరాది గంధ ద్రవ్యకృత వర్ణ చూర్ణి)

ప్రియులొండొరులపై చల్లుకొనుచుండిరి. (4-12) విలాసినుల ప్రసాదనములలో అద్దము, దువ్వెన ముఖ్యమైనవి. (3-4 మరియు 1-80) నాట్యమాడు స్త్రీలు ముఖమునకు హరిదళమును (అర్ధళము - హరితాల మండిత ముఖీనటీవ) పూసు కొనెడివారు. (1-9) పూర్వమిండ్ల పెరడులందు ఆంకోల (ఊడుగ) వృక్షములు పెంచుచుండిరి. వాటి పూల సువాసన యువతీ జనాహ్లాదకారి (5-97) ముత్తయి దువలు కొప్పు ముడిని, జడను వేసుకొను చుండిరి. (3-73) మరువము స్త్రీలకు ప్రీతికరమైయుండెను. (2-22) ధనిక యువతులు మరకతమణి పద్మరాగ సంవ లితములైన (పచ్చల కెంపుల) కంటెలను ధరించిరి. (1-25) మట్టి గాజులను తొడుగుకొను నాచారము తెనుగు ముత్తయిదువులలో నిప్పటికే రూఢమై పోయెను. (5-38) "భగ్న కరవలయాని" అనుటలో భగ్న శబ్దమును బట్టి యవి మట్టి గాజులే యనవలెను. మరియు (5-53) వ్యాఖ్యలోనవి "కాచాది నిర్మితం" అని వివరించినారు.

స్త్రీలకు చీర రవిక ప్రధాన వస్త్రములు. రంగు వస్త్రములపై వారికి ప్రీతిమెండు. కుసుమవన్నె నుత్తమమైనదిగా నీలి వన్నెను సాధారణమైనదిగా భావించిరి. రవికలు "కుసుంభరంజితములు'' (6-45) కుసుమవన్నె (చెంగావి) చీర యువతులకు ముచ్చట గొలుపు నట్టిది.

దొరకకుండ నేడు దొరికిన చెంగావి
చీరకట్టె కాపువారి కోడ
లదిగో, చిన్నదయ్యె నడగక తిరిగెడు
విరివియైన యూరి వీథులందు. (3-4)

ఆనాటి పడచుల భావములో నీలిరంగు చీర మంచిది కాదట. పట్టు చీర యయిన భేషట! (6-20) ఉత్తర హిందూ స్థానమందు స్త్రీల రవిక కట్టు వీపున నుండెడిది. దాక్షిణాత్య స్త్రీల కంచుక బంధనము ముందువైపే యుండెడిది. ముందు భాగమందు రెండు పార్శ్వములందు కొంత సందు కలిగి పొట్టపై రవిక రెండంచులను ముడివేయుట ఆనాటికే రూఢియై యుండెను. (7-20) "ద్వ్యంగుల లలిత కావాటక, పినద్ధ సవిశేష నీలకంచులికా" స్త్రీలు నూపురములు ధరించు చుండిరి. (2-88).

## జనుల యాచారములు కొన్ని

పిడుకల కాల్చుట ప్రాతకాలపు దురాచారమే (2-29). జనులు ముఖ్యముగా స్త్రీలు ఇప్పపూల నేరి సారాయి చేసుకొనుచుండిరి. ఆనాడు ఇప్ప సారాయికి లైసెన్సు లేకుండెనన్నమాట (3-3 మరియు 2-4). ప్రాత సారాయి (జీర్ణ సుర) చాలా రుచికలదై మైకమును మదనోన్మాదమును కలిగించు నట్టిదని యొక కవి యిట్లనెను.

> ''ఊరినిండ వయసువారు; ప్రాయము; ముదు
> సలి మగండు; నవవసంత వేళ;
> ప్రాతవడిన కల్లు చేతనున్నది; ఇంక
> చెడక చావగలమే; చెప్పవమ్మ. (2-97)

పండ్లు తోముకొనుటకు జనులు కానుగ పుల్లలను వాడు చుండిరి. (2-65, 6-53). స్నానము చేయునప్పుడు నలుగు పిండిని వాడు చుండిరి. ఆ పిండిని రుద్దుకొని కడుగుకొనినప్పుడు 'జంబూకషాయము' ఏర్పడు చుండెను. (2-89) పిల్లలకు అక్షరాభ్యాసము 'ఓనమాల'తో ' సీధంనమః' తో ప్రారంభమగు చుండెను. (2-9)

> 'వర్ణావళీమప్య జానంతో లోకాలోకై ర్గౌరవాఖ్యధికాః
> సువర్ణకార తులా ఇవ నిరక్షరా లిపిస్కంధై రుధ్యంతే.

ఈ శ్లోకంలో శ్లేష కలదు. దీనిపై సాహిత్యాచార్య భట్ట శ్రీ మథురానాథశాస్త్రిగారిట్లు వ్యాఖ్యానించిరి. ''జనైః ఓనమః సిద్ధం సిద్ధిరస్తు ఇత్యారభ్యాం వర్ణమాలామప్యజానంతో లోకాః గౌరవాఖ్యధికాః'' అని వ్రాసిరి. 'నమఃసిద్ధం' అని సాహిత్యాచార్యుల వారు వ్రాయుట పాణినేయులకు, పాతంజలులకు సరిపడునో లేదో? ఉత్తరములు వ్రాసుకొనునప్పుడు 'స్వస్తి' అను పదములతో ప్రారంభించుచుండిరి. పూర్వమందలి శాసనాలన్నియు స్వస్తి పదములతో ప్రారంభించుట భారతీయ చారిత్రికు లెరిగియే యున్నారు. వ్రాతకు సాధనము లేఖిని యొకటి. తాటి యాకులో భూర్జ పత్రాలో వాడి యుందురు. గాథలు దాక్షిణాత్యమువి కాన తాటాకులే వాడిరనవలెను. మరి లేఖిని యన గంట మనవలెను.

"వడకి చెమరించు వ్రేళ్ళకు వశముగాక
నిలిచి నడవక జారు నీ కలము తోడ
స్వస్తి శబ్దమె ముగియంప జాలనైతి
కమ్మనింకేమి వ్రాయంగగలను చెలియ" (3-44)

జనులిండ్ల గోడలపై చిత్తరువులు వ్రాయించుకొనువారు (3-17). ఆ యాచారము క్రీస్తుశకము 19వ శతకాంతమువరకు ప్రచలితమైయుండెను. ఇండ్ల ముందు అరుగుల గదులుండెడివి. అవి పలుమారు బాటసారులకు రాత్రులందు విశ్రమస్థానాలగుచుండెను. (3-54). ధర్మశాస్త్రోక్తి ప్రకారము పుత్రులు తండ్రుల ఋణములను తీర్చుచుండిరి. (2-13) చలివేంద్రములు పెట్టి పథికులకు నిదాఘకాలమందు ప్రపాపాలికలు ప్రచరించుచుండిరి. (2-61) రాజులు ధనికులు ధర్మకార్యములను శాసనాలద్వారా ప్రకటించుకొనుచుండిరి. (3-32) గ్రామములందు అగ్నిప్రమాదములు జరిగినపుడు స్త్రీ పురుషులు బావివద్దనుండి బారులుతీరి చేతుల యంచెలపై కడవలందించి యగ్నినార్పుచుండిరి. (3-29) జనులు మర్రియాకులను విస్తళ్లగా కుట్టి యందు భుజించుచుండిరి. బాటసారులు విశేషముగా నట్లు చేసేడివారు. కాని కాకి మున్నగు పక్షుల రెట్టకలిగిన మర్రి యాకులను వాడకుండిరి. (2-66) పెద్దవారి యాగమనమున వారి యడుగులకు మడుగులొత్తుచుండిరి. వారింటికి రాగానే రెండు కలశములతో కాలు మొగము కడుగుకొన నీరిచ్చుచుండిరి. (2-40)

## పంటలు

వరిచేలు, జనుపచేలు విరివిగా నుండెను.

"పండి తెల్లబారు వరితోటలను జూచి
యేల మొగము వంచి యేడ్చెదమ్మ
చూడు, జనుపచేను సొగసయ్యె హరిదళం
బలదుకొన్న యాటవెలదివోలె" (1-4)

(రహస్య సంకేతస్థానముగా వరికి మారు జనుపచేను సిద్ధమైనదని విలాసినికి ధైర్యము చెప్పుట)

నువ్వులుకూడా పండించుచుండిరి. (1-3) మరికొన్నితావులందు (బహుశా మహారాష్ట్రి) ప్రాంతమందు యవలు పండించుచుండిరి. వాటి కడవిపందుల బాధ యుండెను. (5-3) సెనగలు కూడా పండించుచుండిరి. (6-57) ఆముదములేక నూనెతో పత్తిని వెలిగించి దీపముగా వాడుచుండిరి. (3-64) వెలగపండ్లు, లడ్లు జనులకు ప్రీతిగా నుండెను. (7-41) ఓడిపట్టి దుర్దినములైనప్పుడు నిష్ఠా పరులు జ్యోతిశ్శాస్త్రప్రకారము గుణించుచుండిరి (5-35; పై ఈ శ్లోకమునందలి వ్యాఖ్యను జ్యోతిర్వేత్తలు చూచుకొనగలరు.) "ప్రత్తిచేను దున్నవలసి మంచి దినాన మడకపూజలుసేయ" (2-65) యనుటచే ఏరువాక పున్నమసూచితమవు చున్నది. నేటికినీ ఆంధ్రులు ఏరువాకనాడు మడకపూజ సేయుదురు. (ఏఱు = నాగలి).

## వినోదములు

ఆనాటి జనుల వేడుకలలో ముఖ్యమైనవి నాటకాలు. అవి యక్షగానాలా? లేక సంస్కృత ప్రాకృత నాటకాలా? గట్టిగా చెప్పజాలము. సంస్కృత మర్యాదలతో కూడిన ప్రాకృత నాటకాలైయుండినవో? సంస్కృతము మాతృభాష నుండి దేవభాషగా హాలుని కనేక శతాబ్దములకుముందే మారియుండెను. జనులకు వివిధ ప్రాకృతములు మాతృభాషలయ్యెను. కావున జనసామాన్యాని కాహ్లాదము నిచ్చునవి ప్రాకృత నాటకాలేయైయుండును. ఆ నాటకాలకును యక్షగానాల వాసన గోదావరీ ప్రాంతాలలో నుండియుండును. ఆనాటినుండి యీ శతాబ్దివరకు నాటకా లాడువారు ముఖములకు అర్దళము (హరిదళము — హరితాళము) పూసుకొను చుండిరి. స్త్రీల పాత్రలను భోగము పడుచులు వేయుచుండిరా యను భ్రమ "హరిదళంబలదుకొన్న యాటవెలది వోలె" యను శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి అనువాదము నుండి కలుగును. కాని మూలమందు "నటి" వలె యనియే కలదు. "సురత నాటకము మనకు పూర్వరంగము" (4-44).

అని యొకచో వర్ణించుటచేత రంగములు, పూర్వరంగము అను నాటక లక్షణములు పాటింపబడినవని యూహింప వీలుకలుగుతున్నది. మరొకతావున (4-61) నాట్యసూచన చేయబడినది.

గోడలమీద చిత్రరుపులు వ్రాయించుకొనుచుండిరని తెలిపినాను. మరొకటి కనుడు.

మలినచిత్తుడైన మరదికి నిల్లాలు
గోడమీద వ్రాసికొన్న యట్టి
రాము వెంటదరుగు సౌమిత్రచరితంబు
చిన్న నవ్వుదోప జెప్పిచూపు. (1-35)

సమిష్టి కుటుంబాలలో నందందు రావణాంశజు లుండుట చిత్రము కాదు. అందు నొక కవి మరల ఇట్లనెను

చెడ్డ మనసుకలిగి యడ్డాడు మరది బా
ధలను దెగువగల్గు దయితుతోడ
చెప్పదింటి బ్రతుకు చెడునంచు మదిలోన
యడచి నవయు కోడలార్య శీల. (1-59)

'బ్రతుకు బొంగరంబు వంటిది' (5-6) అని తెలుగుసేతలో కలదు కాని మూలమందు 'చలం జీవనం' అని కలదు. జీవనము శాశ్వతముకాదు అని యర్థమే యనుకొందును. కుండల పోత మోటకూడ నాకాలమందుండెను. దానిని సంస్కృతంలో ఘట యంత్రమనిరి. దానినే 'రహట్టఘటక' యనిరి. నేడును 'రహట్' మోట యంత్రమును గురించి ప్రకటించుటను గమనించుచున్నాము.

"రిక్తా నమంతి సుచిరం రహట్ట ఘటకా ఇవే. హకాపురుషా!" రహట్టపై భట్టశ్రీగారిట్లు వ్యాఖ్యానించినారు. "రహట్టో ఘటయంత్రం ........ ఉదకం లబ్ధ్వాయధా ఘటిగా ఊర్ధ్వముఖాభవంతి తథా దుర్జనా అపిస్వల్ప లాభ ఏవదర్పేణ మస్తకమున్నయంతి" పాచికల యాట బహు ప్రాచీనమైనది. కాయలను నడుపు నప్పుడిండ్లకు దుగ, తిగ, చౌ, పంచ, బద్రికాది సంకేత పదములుండెను. తురకలు వచ్చిన తరువాత వాటి స్థానంలో ఉర్దూ పేర్లేర్పడెను. దస్, పచ్చీస్, తీస్, బారా, చెక్కా అను సంకేతాలు మనయిండ్లలో మన స్త్రీలలో వాడుకకు వచ్చెను. ఈనాటి యాటను "పచ్చీసాట" యంటున్నారు. హాలుడిట్లు దానిని వర్ణించెను.

"శునక ప్రచురే గ్రామే భ్రామయంతి తవకృతేన సా బాలా
పాశకశారీవ గృహంగృహేణ ఖాదిష్యతే కదాప్యంగ." (2-38)

దూతి విటునితో ఇట్లనెను. ఓయీ నీకొరకా వన్నెలాడి ఊరునిండ గండు కుక్కలున్నను లెక్కపెట్టక పచ్చీసు కాయవలె ఇల్లిల్లు తిరుగుచున్నది. పాశక శారిపై భట్టశ్రీగారిట్లు వ్యాఖ్యానించిరి. "షతు ష్పటీగుటికా ద్యూత ఘటికా యథా ద్యూత పట్టస్యప్రతి గేహం భ్రామ్యతి తథాగృహేణ గృహేణ గృహం భ్రామ్యతీ సా బాలా."

ఉత్ఫుల్లికా క్రీడ నొకచో వర్ణించినారు (2-96). అదెట్టిదో యర్థముకాలేదు. "ఉత్థానంశ యానస్య పాద యోరు పవిష్టానాం బాలానాం ముహుః పతనోత్పతన రూపాక్రీడా ఉత్ఫుల్లి కేత్యాఖ్యాయతే" అని టీకాకారులన్నారు.

సుజాత. (15 ఏప్రిల్ 1951)

## కవితాప్రాశస్త్యము

గాథా సప్తశతిలోని కవిత యసాధారణమైనది. విశ్వ వాఙ్మయములో దీని యనుకరణములే కలవు కాని ఇట్టిది మరొకటి లేదు. దీనినుండి భావములను విరివిగా గ్రహించిన అమరు శ్లోకాలకు "అమరు కవేరేకః శ్లోకః ప్రబంధ శతాయతే" అన్న కీర్తి కలిగినపుడు అమరు మాతృకయగు నీగాథాసప్తశతి నేమనవలెను. గాథాసప్తశతిలోని నాయికా నాయకులు, దూతీచేటికలు, అత్త కోడండ్రు, గామణి గ్రామీణులు, జొన్న, జనుప, నువ్వు, వరి, పెరిగిన పొలాలలో చేసిన దుడుకులను, నర్మ గర్భముగా పదుగురికొక యర్థంగా తమయిద్దరికొక యర్థంగా నుండు సంకేతములను చెప్పుకొనుటలను, నదీతీరాలలోని చాటు మాటు దాటులను, వన్నెలాడుల వయ్యారపు విహారములను, విలాసినిల చూపులోని మూగ పలుకరింతను, పథిక విటులలోని ఇంగితములను గ్రహించు మితిమీరిన చురకు దనమును, సవతుల సహింపులేని తాకట్లను, మనము చిరునవ్వులతో మన్నింపవలెను. అందలి కవిత మనకెట్లాదేశించినది. ఉత్తమ టాకీలోని ప్రేమగాథలలో నటించిన వ్యక్తులను చూచి వచ్చిన తర్వాత మన భావాంబరముపైనవి పలుమారెట్లు పునర్నాట్యము చేయునో యటులే 2000 ఏండ్ల క్రిందట గోదావరీ తీరములోనూ, పల్లె ప్రాంతములందునూ, చెరువు చెట్ల దాపులందును, శృంగార విలాసములతో

కాలము గడిపిపోయిన యువతీయువకు లీనాడును నేనాడును గాథలను తిరిగ వేసినప్పుడంతయు మన మనోనాటక రంగమందు టికెటులేని నాటకములాడి మనల గిలిగింతలు పెట్టి మనకు బ్రహ్మంగారిని చూపి (ఆనందోబ్రహ్మ) వెడలి పోవుచుందురు.

గాథలోని కవిత, కవితలోని యసాధారణత, భాష, భాషలోని సౌకుమార్యము భావము, భావములో గంభీరత, ఛలోక్తులు, ఛలోక్తులలోని చందన స్పర్శ, మాయా మర్మములు లేనట్లుగా భాసించు ముగుద ముద్దుగుమ్మ ఆముచ్చట్లలో దాగిన సుందర సుకుమార నర్మగర్భితములు, ఎన్నని చెప్పవలెను, శృంగారలోకమంతయు సప్తశతీ గీతములలో పంచాక్షరిలో శివునివలె చక్కగా నిమిడి యున్నదనిన కొంతకు కొంత వక్తయొక్క యభిప్రాయము వెల్లడి కాగలిగి నట్లనవచ్చును.

700 గాథలలో అన్నియు నుత్తమములనుటయు లేదు. కాని అందలి పనికి రాని గీతాలన్నియును బహుప్రబంధాలలోని బహువర్ణనలకన్న రమ్యమైనవే యని నేననుకొందును. శ్రీ రాళ్ళపల్లి శర్మగారి భావములో 700 లో 395 గాథలుత్తమమైనవి. కాని నాయభిప్రాయములో ఇంచుమించు మరి 50-60 ఉత్తమ పద్యాలను వారు చిన్నచూపుతో చూచినారు. మొత్తముపై (500) పద్యాలు సప్తశతిలోనివి అత్యంతానందసంధాయకములు, వీటిలోని ప్రాశస్త్యమును ఎత్తి చూపవలెనన్న నన్నిటిగురించి తనివితీర వ్యాఖ్యానించుటయే సమంజసమగు కార్యము. అదికాని పని కాన మాసరకు (నమోనాకు) కొన్నింటిమాత్రమెత్తిచూపిన స్థాలీపులాక న్యాయ నిదర్శనమగును.

"బిసినీపత్రా నిశ్చల నిస్పందా పశ్య రాజతి బలాకా
నిర్మల మరకతభాజన పరిస్థితాశంఖశుక్తిరివ. (1-4)

దీనిని శ్రీ శర్మగారు తెనుగింపలేదు. పల్లవనాయికా నాయకులకొక సరస్తీరము సంకేతఘటనా ప్రదేశముగా నేర్పాటై యుండెను. కాని యందొకరు వచ్చి కాచుకొని ఇంకొకరు రానందున విసుగుకొని పోయి మరల పదిమందిలో రాని వ్యక్తిని చూచి తమబాస తమకే పూర్ణార్థమిచ్చునట్లుగా నీ గాథ బహువిధభావముల వెల్లడిస్తున్నది. ఎట్లనగా.

"చూచితివా! కమల పత్రముపై కొంగ నిశ్చలముగా చకితముకాకుండా నిలిచినది. శుభ్రమైన మరకతపు తట్టలో శంఖముంచినట్లుగా నాబలాక యున్నది."

పైగీతములో మరేమి లేకున్నను ఉత్తమోపమాన మున్నందున నంత మాత్రకే యది రమ్యమైనది. కాని యొక విశేషమున్నది. కొంగలు అందులో పెంటివి మెలకువకలవి. అచ్చట యేమైన అకులు చప్పుడుకాని మనిషి కాలుచప్పుడు కాని వినిన నిశ్చలముగా నిస్పందముగానే యుండును. కావున ఆ సంకేతస్థానము అత్యంత నిర్జనప్రదేశమని ప్రియులలో నొకరింకొకరితో తెలుపుదురు. అనగా ఆ చెరువు వద్ద ఆ కమలముల సమృద్ధికల ప్రదేశమున్నది కదా! అచ్చట మనుష్య సంచారము లేదు అది మన యేకాంతమునకద్భుత సంఘటనాస్థానము.

ఇంతేకాదు. మరొక విశేషమున్నది. ప్రియులతో నొకరిట్లనుచున్నారు. "నీవు నాకన్న ముందాగురుతుగల చోటికి పోయి నేను రాలేదని తిరిగిపోతివన్న మాట పూర్తిగా కల్ల.

నీపలుకు చొప్పున నీవే ముందుపోయి వచ్చి యుండి తర్వాత నేను పోయి నప్పుడు మనుష్యసంచారమును వినిన జూచిన బలాక అంత నిర్మల నిస్పందగా నేల యుండును. దానిలో చకితత్వలక్షణమే కానరాదు. దాని నిశ్చలతయే నీ మాటలు దబ్బరలని సాక్ష్యమిచ్చునది.

అంతేకాదు. ఇంకొక విశేషమున్నది. నీవు నాకన్న ముందుగా పోయినది కల్ల నేను ముందుగా పోయియుంటిని. అది కొంగయొక్క నిశ్చలతవల్ల తెలుస్తు న్నది'' తిరిగి వచ్చితినని సమాధానము.

ఇంతటితో కథ ముగియలేదు. ప్రియాప్రియులు సంకేతస్థానమందు కలి యనే కలిసినారు. అప్పుడు ఒకరింకొకరితో సంభోగ కాలమందిన పద్యమిది. ఎందుకనగా (మరుగునకై సంస్కృతప్రమాణమునుదాహరించి వదలుదును).

"కల్లోలినీ కాననకందరాదౌ దుఃఖాశ్రయే చార్పిత చిత్తవృత్తిః
మృదుక్రమారంభమభిన్నధైర్యః శ్లథోపిదీర్ఘం రమతే రతేషు"

ఈ చిన్నగాథలో ఈ రెండు పంక్తులలోనే ఇన్ని కథలిమిడియున్నవి. "ఏకఃశ్లోకః ప్రబంధశతాయతే'' అని యూరకే అన్నారామరి? మరొకటి చిత్రగించవలెను.

''మగని పయనమన్న మాటెవ్వడాడెనో
వానిమనసుపాడుగాను; తాను
విన్నమొదలు విసముగొన్నట్లు కోడలి
యవయవంబు లెల్ల నయవసాగె (2-11)

సవతి నిందపాలు చేయుటకో లేక యున్నంత తెలుపుటకో దాని సవతి పైవిధముగా నున్నది. సవతి జారుడు పనిపై ప్రవాసము వెళ్ళుచున్నాడని దాని కెట్లో తెలియకుండునా. తెలియనే తెలిసిన దమ్మా! ఇక చూడు, అప్పటినుండి మొగము చిట్లించుకొని రుసరుసమని ఇంటి పనులన్నియు అడ్డదిడ్డిగా చెడజేయుచున్నది. దానికావార్త విసమునాకినట్లు కసిబిసియైనది. ఇంత విచ్చలవిడి తగునమ్మా? అని సవతి పోరొకదిక్కు.

దీనికింకొక కథకూడ సాధ్యమైనది. ఏమనగా - పతిప్రవాస మందున్నందున ఆ సుందరిని నాకు కూర్పుమని యొకలంపటవిటుడు తార్పుకతైను విచారింపగా నాదూతి యిట్లంటున్నది. "వయ్యారపు అయ్యవారూ! ఆ యువతి పతి వియోగముచే దుఃఖతమై యింటిపనులే చేయనొల్లదే, అంతటి పతిదత్తమానస నీకు చిక్కునా ? అది వ్యర్థప్రయత్నము" అని మందలించుట యందు ద్యోతకమైనది.

అయితే మరొక విస్పష్టభావము పైననే కానవస్తున్నది. అత్తగారు తానెంతగా గట్టిగా కోడలి నెత్తిన మిరియాలు నూరినను, తన కొడుకు ప్రవాసమునకేగనన్నాడని కన్నకడుపు కావున తానాయసపడినదై తన కోడలి విరహతాపముపై కరుణకలిగి ఇరుగుపొరుగు అమ్మలక్కలతో వెల్లడించుకొను వరకు మనుసు పట్టలేక పోయినది. అత్తయిట్లన్నది. "నా కోడలికి దాని మగని ప్రవాసవార్త యెవరు చెప్పిరో యేమోనమ్మా విన్నప్పటినుండి మొగమింత చేసుకొని యింటిపనులన్నీ ముట్టక దుఃఖముతో భాధపడుతుందమ్మా-నా కోడలు!"

మరొక గీతమును తిలకించండి.

''ముద్దు కొడుకు మొదట మొలచిన పలుదోయి
గౌరికి కొరికి కాటు వరిచెనిదిగొ
రేగుపండు గంటిరే! యని పెండ్లాము
నగుచు దెచ్చిపెట్టె మగనిచేత. (2-100)

ఆ ముక్తమాల్యదలో పైయభిప్రాయము నిచ్చు నీక్రింద పద్యము మొదట మొదట మనకు మతికి వచ్చును.

తన యుదరంబు నంబొడమి తామ్రరుచిచ్ఛటలుల్లసిల్లగో,
ల్కొనుధరణీజ సంతతికిఁగోరక దంతము లించుకంత, ని
క్కినయది యాదిగాగ జెలగెన్ వనలక్ష్మి ; కడుంజెలంగగా
జను ప్రియుడైన మాధవుని సంగతిమీదట జాల గల్గుటన్.
ఆము. (5-116)

ప్రసవానంతరము కన్న శిశువునకు తొలిరెండు పండ్లు మొలచిన తర్వాత భార్యాభర్తల పునస్సమాగమ కాలమని హిందువులలో శిష్టాచారమైనది. ఒక యిల్లాలు తాను పతిసంభోగ సుఖానుభవ యోగ్యతను పొందినదని తన పతికి సుకుమారముగా నెచ్చరిస్తున్నది. దానికి సాక్ష్యమేమి? ఇదిగో పలుకాటులు పడిన రేగుపండు. అదెక్కడున్నది. ఇదిగో యిప్పుడే నీచేత నుంచుచున్నాను. అయితే భార్య ''ప్రహసిత వదన''గా రేగుపండును తన భర్తచేత నెందుకుంచెను? అది అనుమానానికి తావిచ్చునని సరస్వతీ కంఠాభరణమందు ''వికసితనయనా'' యని కలదు. అప్పుడు భావము సుందర తరమగును. కాని ప్రహసిత వదనయను పదముపై తృతీయ పంథగా వ్యాఖ్యలు చేయు నలవాటు పడిన గంగాధరుడిట్లం టున్నాడు. ''యువతి కుమారునికి పండ్లు వచ్చువరకు తాళజాలనిదై తానే దంత యుగళాంకి తము చేసి రేగుపంటిని భర్తకిచ్చినది. అందుచేతనే మగడు నమ్మడని ప్రహసిత వదనయైనది'' ఇదే ధోరణిలో నాలోచించిన మనమింకను నిట్లన వచ్చును. ప్రత్యక్షప్రమాణ ముండగా అనుమాన ప్రమాణమేల? చిట్టివాని కొత్త చిరుపండ్లు చూడుమాయని శిశువునోట భర్తవ్రేలిని పెట్టించి కొరికించి తాము

నవ్వవచ్చును. శిశువునూ నవ్వించవచ్చును. అట్లుచేయక పిల్లవానిపండ్లు చూపించక రేగుపండుపై కాట్లను చూపింపనవసరమేమి ? ఇది ఇట్లుండనిండు. రేగుపండునే కొరికించి చూపనీల? వేరు మెత్తని చిన్నపండు - ద్రాక్షవంటిది బాగుండదా? నాకిట్లు తోచినది. రేగుపండు వసంతాగమ కాలమందు సమృద్ధి. అందుచే కవిదానిని సూచించెనేమో. మరియు ఇతర భారతీయులలోనే యేప్రాంతమందు కలదో లేదో కాని తెనుగునాటనొక యాచారము కలదు. సంక్రాంతి పండుగనాడు ఏడాదిలోపలి శిశువులను కూర్చొన బెట్టివారి తలలపైనుండి రేగుపండ్లును దిగబోసి యాపండ్లను బీదలకు పంచి పెట్టుదురు. అందుచే కవి రేగుపండునే తనగాథలో నుంచి యుండును. ప్రతిగాథకిన్ని కథలు! అన్నియు మనోహరములగు కథలే!

రమ్యమైనరూపు: రమణుడూరను లేడు;
పేదరికము; పెద్దవీథినిల్లు;
పరువమైన వయసు; పొరుగింటిచెలిజార;
యైననౌర! చెడదుచాన; చూడు. (1-36)

స్త్రీ చెడుటకు కావలసిన అంగములన్నియు సిద్ధమేకాని "చెడదు చాన చూడు"! ఇదెవ్వరో పెద్దలన్న మాటగా భాసించును. లేదా కళంకకారణాభిశంకచే జనులు వృథాగా నన్ను నిందింతురు. నాకు చరిత్ర దోషములేదు. అని నిజదోష గోపనము చేసికొనుచు నొక కులట పలికిన పలుకులనవచ్చును.

కొండ సెలయేటి సుడికి జిక్కుకొని కలగి
తిరుగుచును కేసరంబులు విరిగిపోవ
కొంత మునుగుచు తేలుచు గొదమితేటి
వెంటనంటి, కడిమిపూవు వెల్లబోయె. 4-37

కడిమి పువ్వు నీటి సుడిలో కొట్టుకొనిపోతున్నది దాని మధువు నీటిపడిన వెంటనే క్షాళితమైనది. కాని, తుమ్మెద మాత్రము దానివెంటనే పడినది. దీనివెనుక యెంత కరుణారసము దాగినదో చూడుడు. పువ్వుపైగల తమకము తుమ్మెదకెంత గొప్పది. 'ఎన్ని పువ్వులన్ వ్రాలదుతేటి' అని తారాశశాంక కవి యన్నట్లుగా - ఆ పువ్వుకాక వేరే మంచిపూలు లేవా? ఆ తుమ్మెదకు? తేనె యేమియులేదు, పువ్వు

నలిగినది. కొన్ని రేకులు విరిగినవి, సంపూర్ణ శైథిల్యమిప్పుడో అప్పుడో! మరి దానితోనేమి పని. నీచులే ద్రోహులై యుందురు. తుమ్మెదనైన చూచి మనుష్యులు బుద్ధితెచ్చుకొనరాదా? తానను భవించినస్త్రీ బిగువు సడులగా తిరిగి చూడనిప్రియు లను గూర్చి యీసంబోధన.

వల నడుమను సాగిన పో
గులలో మీగాళ్ళ దవులు కొన సాలీడిం
పలరె, కనరాని దార
మ్ముల గూర్చిన యింటి పొగడపువు వలెగంటే! 1-63

ఉపమానము బహుసుందరము. పొగడపువ్వును చూడని వారీకాలంలో చాలామంది! చూచినవారికి దీనిని సాలెపురుగుతో నుపమించుట యానందమిచ్చును కాని మరొకకథయిందు దాగినది. ఒంటి సాలీడు. ఇంటిలో తాను తప్ప మరెవ్వరు లేరు. అందుచేతనే సాలీడింటి నిండుగా వలనల్లినాడు. 'అత ఏవ సురుచిరం రతోత్సవోఽను భూయతాం ఇత్యర్థోధ్వన్యతే'. అందుచే నిర్భయముగా ఆనదింప వచ్చునని హెచ్చరిక!

లోభివాని చేతిలో సిరియెంతగా
వెలయుచున్న సుంతఫలము లేదు
తెరువునడుచు వేళ కరకు వేసవియెండ
మాడువానికి నీడవోలె ... 2-36

ఇది మంచినీతియే! అందులోను మంచి యుపమానముతో గూడిన నీతియే! ఒకదూతి లోభివిటునికి చల్లగా మెల్లగా సూచించినది. నీవు విరివిగా ధనమును వ్యయించకున్న ఆ సుందరి లభింపదు! ఈ దూతియు ఊరక రాయబారులు జరుపజాలదు!!

ఊర గొడుకు లేక యుండగ కోడలు
వచ్చి కాళ్ళ మ్రొక్క వంగినపుడు
గాజులెల్ల జారగా జూచి కడు గోప
కత్తెయయ్యె నేడ్చి నత్తగారు. 5-93

మూలములో వలయద్వయమని కలదు. చేతికొక్కొక గాజుండ నన వలెను. కాని తెనుగు సేతలో గాజులెల్ల అన్నారు. రెండు గాజులేమి! గాజు లన్నియు జారిన జారినవని వారి యభిప్రాయమై యుండును! కృశించి కృశించి సన్నగిల్లుటవలన గాజులెప్పుడో జారిపడి పగిలిపోగా సౌభాగ్య చిహ్నముగా రెంటినా సౌభాగ్యవతి మగనిమీద ప్రాణము నిలుపుకొన్నట్టిది. ఎటులో నిలుపు కొన్నది. ఆ యవస్థను కోపగత్తెయగు నత్త యెందుకు చూచును? ఏదో నిమిత్త కారణముగా తనను మ్రొక్కవచ్చినపుడు బాగుగా సన్నగిల్లిన చేతుల చూడగలి గినది. అప్పుడైనను కోడలిపై కరుణగలిగినదో లేదో? తన కొడుకు జ్ఞాపకము వచ్చి వాని బహుకాల ప్రవాసమును తలచుకొని యేడ్చియుండును. ఒక యేకాంకి కకు కావలసినంత కరుణారసమిందున్నది.

కాని రసభంగము చేయదలచిన యొక వ్యాఖ్యాత యిట్లన్వయించినాడు. అంతటి యాప్రేమ యాకాంతకు తన ప్రియ భర్తపై నుండగా నామెను విటుడు కోరుట వ్యర్థమని దూతీ సూచనయట! లేదా యామె భర్తతో ఏమయ్యా! నీవు లేనందున కృశించి చావసిద్ధంగానున్న నీ భార్యనుగూడ కెందుకాలస్యము చేసెదవు అని యతని భార్యయొక్క దయనీయస్థితిని యతనితల్లి దుఃఖమును ఎందరో మిత్రులు తెలిపిరని వాఖ్యానింపవచ్చును.

ఇంచుమించు ప్రతి పద్యము ఆమృత ఝరియై (అమృతం ప్రాకృత కావ్యం 1-2) కామతత్వ చింతామణియై (కామస్యతత్త్వ చింతాం 1-2) స్వభావ రమణీయమై (7-101) రసిక జన హృదయ దయితై (1-101) అమృతమును కూడ నిరాకరింపజేయ మాధుర్యముకలదై (మధురత్వే నామృతమ ప్రియచ్ఛ్రి త్వానోల గతిప్రహదయే (4-101) నానాలంకార లలితమై (1-3) ధ్వని ప్రధానమై సంత తాహ్లాద కారియై, గంభీర భావ పరంపరా సంపూరితమై రస సిద్ధుల పూర్ణ చంద్రోదయ ఘుటికయై శ్లాఘాపాత్ర మైనట్టి గాథా సప్తశతి భారతీయ సాహిత్య రత్నములలో కొహెనూర్! గాథలో కూర్చిన హాలుని రాజ్యమెన్నడో పోయెను. కాని యతని కావ్య సామ్రాజ్యమునకు కొట్టుబాటు లేదు. దానికి నిత్యనూత్నత కలదు. సుకవితా యద్యస్తి రాజ్యేనకిం?

ఇట్టి గాథలలో నూరింటి నేరి వ్యాఖ్యానించిన సర్వజ్ఞ చక్రవర్తి పెద కోమటి వేమభూపాలుని వ్యాఖ్య యేది? ఇంచు మించిరవది పండితులు వ్రాసిన వ్యాఖ్యానాలేవి? ఈ గాథలకు తెలుగు వ్యాఖ్యలను వ్రాసి ఉత్తమ పీఠికను చేర్చి ముద్రించుట అవసరము. ఈ సప్తశతిని రసికులందరును చదివి యానందింతురు గాక.

సంధ్యోపాత్త జలాంజలి బింబిత గౌరీముఖాంబూరూహం
స్ఫురితాధరం ముద్దైవహి విగళిత మంత్రం హరీం నమత. 7-100.
సంధ్య వార్వగ దోసిట జలమువట్టి
నపుడు గౌరీముఖాంబుజ మందుదోప
మంత్రమంతయు నొకమారు మరచినట్టి
మోవిని గదుల్చు శివునకు మ్రొక్కులిడుదు.
శివునికి పట్టిన గతియే సప్తశతీ పాఠకు లందరికిని పట్టుగాక!

సుజాత. (15 మే 1951)

# ఆంధ్ర వాఙ్మయ చరిత్ర

ఆంధ్ర భాష, ఆంధ్ర వాఙ్మయము చాలా ప్రాచీనమైనదే కాని మనకు లభించిన మొదటి గ్రంథము 900 ఏండ్లనాటి ఆంధ్ర మహాభారతమే. ఆంధ్రుల ప్రశంస సంస్కృత మహాభారతములో, రామాయణములో, ఐతరేయ బ్రాహ్మణములో - ఇట్టి అతి ప్రాచీన గ్రంథాలలో లభించినది. ఆంధ్రులు క్రీ.పూ. 200 ఏండ్ల ప్రాంతము నుండి మహా సామ్రాజ్యాలు స్థాపించి ప్రపంచ ఖ్యాతి కాంచిన వారు. అట్టి వారి భాషలో క్రీ.పూ. 200 ఏండ్ల నాటినుండి క్రీ.శ. 1050 వరకు అనగా నన్నయ భట్టు కాలము వరకు ఇంచుమించు 1200 ఏండ్ల కాలములో వ్రాసిన ఒక గ్రంథము కూడా లభించక పోవుట చాలా ఆశ్చర్యకరము. నన్నయ భట్టుకు పూర్వము తెనుగు భాష, తెనుగు కవిత్వము లేదని కాదు. ఆ రెండున్నూ ఉండెను. కాని మనకు గ్రంథమొకటైన దొరుకలేదనుటయే విచారకరమైనది.

నన్నయ కంటె ఏడు నూరేండ్లకు పూర్వము నుండి అనగా క్రీ.శ. నాల్గవ శతాబ్దము నుండి తెనుగు రచనలు ఉండినట్లు మనకు కొన్ని నిదర్శనాలు కనిపించుచున్నవి. దినేశ చంద్ర సర్కారుగారు "శాతవాహనుల తర్వాతి వారు" అను తమ ఇంగ్లీషు గ్రంథములో ఇట్లు వ్రాసినారు.

"ఇక్ష్వాకు రాజుల ప్రాకృత శాసనాలు కొన్ని జగ్గయ్యపేటలో లభించినవి. నాగార్జున కొండలోని రికార్డుల భాషను గూర్చి 'అది ఒక విధమయిన ప్రాకృతమని బహుశా కన్నడమయి యుండునని స్టైన్ కొనోప్‌గారు అభిప్రాయపడిరి. నాగార్జున కొండలో కొన్ని ప్రాకృత శాసనాలు దొరికినవి" అయితే జగ్గయ్యపేట, నాగార్జున కొండ అను నీ రెండు స్థలాలు తెనుగు నడిగడ్డలో నున్నందున అచ్చటి ప్రాకృత భాష తెనుగు రూపమై యుండి యుండును. కాని కన్నడము కానేరదు. కన్నడమైనను క్రీ.శ. నాల్గవ శతాబ్దిలో తెనుగు నుండి అంతగా భిన్నించినట్టిది కాదు.

ఇక్ష్వాకులు, అశ్మక, ములక దేశములు రాజ్యము చేసినట్లు వాయు పురాణము చెప్పుచున్నది. ములక దేశము నిప్పటికిన్ని మొలకసీమ అని పిలుచుచున్నారు. అది యిప్పటి పాలమూరు జిల్లా. అక్కడ నుండి ములకసీమ (మురికినాడు) కర్నూలు, కడప మున్నగు ప్రాంతాల నాక్రమించుకొని యుండెను.

శాలం కాయనులు అను రాజ వంశము వారు తెనుగు దేశములో క్రీ.శ. 5 వ శతాబ్దమందు రాజ్యము చేసినారు. వారి శాసనాలలో మన కర్థమగు కొన్ని తెనుగు పదములున్నవి. ఊరు, చెరువు, మునుడు ఇట్టి పదాలు కొన్ని గలవు. క్రీ.శ. 5 వ శతాబ్దమందు అనగా నన్నయభట్టు కంటె 600 ఏండ్లకు ముందు ఆంధ్రదేశమున రాజ్యము చేసిన విష్ణుకుండిన రాజుల దాన శాసనములలో నొకదానియందు "వర్షంబుల్" అను తెనుగు పదము గలదు. ఇట్టి నిదర్శనములను బట్టి తెనుగు భాషయు, తెనుగు రచనయు (శాసనములలోనే అనుడు) క్రీ.శ. 400 నుండి యుండెననుట స్పష్టము.

విష్ణుకుండిన రాజుల వంశములోని వాడగు జయాశ్రయుడు అను బిరుదు గల మాధవ వర్మ నన్నయకు అయిదు నూరేండ్లకు ముందుండిన వాడు. అతడు జయాశ్రయచ్ఛందమను ఛందః శాస్త్రమును వ్రాసెను. అందు శీర్ష లక్షణము అనగా సీస పద్య లక్షణములను తెలిపినాడు.

నన్నయకు పూర్వము తరువోజ, సీసము, అక్కరలు విశేషముగా ఉండి యుండును. నన్నయ తరువోజలు, అక్కరలు అను కొన్ని పద్యాలను మహాభారతములో వ్రాసెను. తర్వాతి కవులు వాటిని పరిహరించిరి. నన్నయకంటె ముందు ద్విపదలోను, దాని భేదములగు వృత్తములలోను వ్రాసి జనులు పాడుకొను చుండిరి. ఇంచుమించు క్రీ.శ. 1240 నుండి 1300 వరకుండిన పాల్కురికి సోమనాథుడు తనకన్నా ముందు కాలములో నుండిన చాలా విధములైన పాటలను గూర్చి ఇట్లు తన పండితారాధ్య చరిత్రలో వ్రాసెను.

"మదినుబ్బి సంసార మాయాస్తవంబు
పదములు, తుమ్మెద పదముల్, ప్రభాత
పదములు, శంకర పదముల్, నివాళి.

పదములు, వాలేశు పదములు, గొబ్బి
పదములు, వెన్నెల పదములు- సెజ్జ
వర్ణన మరి గణ వర్ణన పదములు"

ఇట్టి వెన్నో యుండెనట !

నన్నయభట్టు రాజమహేంద్ర వరము రాజధానిగా పరిపాలించిన రాజ రాజ నరేంద్రుని ఆస్థాన కవి. అతడు క్రీ.శ. 1050 ప్రాంతమందుండిన వాడు. అతనికంటె ముందుండిన కవితలో కొన్ని పద్యాలు కొన్ని శాసనాలలో మనకు లభించినవి. గుంటూరు మండలములోని అద్దంకిలో ఒక శాసనము దొరికినది. అది క్రీ.శ. 848 ప్రాంతములోనిది. అనగా నన్నయభట్టు కంటె ఇన్నూరేండ్లకు పూర్వముది. నన్నయకంటె ముందు మనకు తెనుగు రచనలే దొరుక లేదనుట చేత మనకు దొరికిన ఈ అద్దంకి శాసనములోని ఒక పద్యము, ఒక వచనము ఎంతైనా విలువ చేయుటచేత వాటి నిందుదాహరింతును.

తరువోజ : పట్టంబుగట్టిన ప్రథమంబునేణ్డు
బలగర్వ౯ం బొప్పంగ బైవేచి సేన
పట్టంబు గట్టిఞ్చి ప్రభుబణ్డ రంగు.
బఞ్చిన సమత్త[1] పడువతో బోయ
కొట్టంబుల్వ౯ణ్డెణ్డు గొణి[2] వేంగి నాణ్డిం
గొళల్చి[3] యాత్రి భువనాంకుశ బణనిల్చి
కట్టెపుదుర్గంబు గడుబయల్చేసి
కణ్డు కూర్చెజ వాడగావిఞ్చ మెచ్చి''

వచనము : పండ రంగు పరమ మహేశ్వరుణ్డు ఆదిత్య భట్టారునికి ఇచ్చిన భూమి యెనుబొది పుడ్లఅడ్లపట్టునేల. దమ్మ పురంబున దమ్మములు. వీని రక్షిఞ్చిన వారికి అస్వమేదంబున ఫలంబు అగు"

---

1. సమత్త - సామంత;
2. వణ్డెణ్డుగొణి - పన్నెండు తీసుకొని;
3. గొళల్చి - గూర్చి అని అర్థమై యుండును.

నన్నయకంటె ముందటిదగు రెండవ శాసనము, యుద్ధ మల్లుని బెజవాడ శాసనము. అది క్రీ.శ. 898 ప్రాంతముది. అనగా నన్నయ భట్టు కంటె 150 ఏండ్ల కన్న ముందటి శాసనము. దానిలో 5 మధ్యాక్కరలు ఒక వచనము మనకు లభించినది. అందలి పద్యమొకటి యుదాహరింతును.

"జనసుత చేబ్రోల నుణ్డి బెజవాడ జాత్రకు వచ్చి
త్రినయను సుతుణ్డొణ్డు సోట మెచ్చక తివిరి యిన్నెలన
యనఘాణ్డు సేకొని యిన్డు ప్రత్యక్షబయన్న నిచ్చ
గని మల్లణ్డెత్తించె గుడియు మఠంబునుం గార్తికేయునకు"

ఈ విధముగా నన్నయ భట్టు కంటె ముందు తెనుగు రచనలుండెను. నన్నయభట్టు కంటె ముందు కాలములో కొందరు తెనుగువారు కన్నడములో కావ్యాలను రచించిరి. నన్నయకన్న ముందుండిన తెనుగు వాఙ్మయ స్థితి మన కింతకంటె యెక్కువగా తెలియదు. ఇక నన్నయ కాలమునుండి నేటివరకు ఆంధ్ర వాఙ్మయ చరిత్ర ఘట్టములను సంగ్రహముగా తెలుపుదుము. ఈ చరిత్రను ఏడు భాగాలుగా విభజింపవచ్చును.

1. ఆది యుగము (పూర్వ చాళుక్య యుగము)
2. కాకతీయ యుగము
3. రెడ్డి యుగము
4. విజయనగర యుగము
5. తంజావూరి యుగము
6. సంధి యుగము
7. ఆధునిక యుగము

ఈ యుగములను గురించి వివరించుటకు పూర్వమొక విషయమును స్మరించవలెను. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వములో అథర్వణాచార్యులను గూర్చి వ్రాయుచు ఇట్లు వ్రాసినారు.

"అథర్వణ కారికలలో పంచమ కాండమందిట్లున్నది. అథర్వణ శిఖోప నిషది. త్రిమూర్తీనాం సంస్కృతాంధ్ర ప్రాకృతాః ప్రియంకరాః"

అందు మరొక చోట ఇట్లు వ్రాసినారు.

"ప్రాకృతే షడ్విధేచాపి వాల్మీకిం వా మహేశ్వరం ధ్యాయేత్ అత్రతు మాపేవస్మరేత్ పండిత సమ్మతః" - ఆధర్వణ కారికలలో పంచమ కాండము, 8 వ కాండము, 4 వ కాండము అని యుదాహరించినారు. (కాని వావిళ్ళ ముద్రిత ప్రతిలో ఈ విభాగము లేదు. మరియు ఉదాహరింపబడిన విషయాలున్ను కానరావు) ఇంకను అందిట్లు వ్రాసినారు. ప్రాచీనాంధ్ర వేత్తలుగా నీ క్రిందివారు (ఆధర్వణ కారికలలో) పేర్కొనబడినారు. బృహస్పతి, కణ్వుడు, హేమచంద్రుడు, పుష్పదంతుడు, రావణుడు, గౌతముడు, ధర్మరాజు.... ఈ గ్రంథమందు పూర్వాంధ్ర వ్యాకర్తలుగా హరి, శ్రీకవి, విష్ణుశర్మ, ధూర్వహుడు, శృంగార భూషణుడు అనువారు కూడ పేర్కొనబడినారు. ఈ ప్రాచీనాంధ్ర వైయ్యాకరణు లను గురించి మనకేమి తెలియదు. "సర్వస్వము" వారే ఆధర్మణ కారికలనుండి పైవాటి నుదహరించిరో తెలియదు. ఇప్పటి ముద్రిత పత్రికలో ఆవేవియు కానరావు.

నన్నయ భట్టు ఆంధ్ర శబ్ద చింతామణిని వ్రాసెనందరు. కాని దానిని ఎలకూచి బాల సరస్వతియో మరెవ్వరో వ్రాసినారని కొందరి తలంపు. నన్నయ ప్రయోగాలు కొన్ని ఆంధ్ర శబ్ద చింతామణికి విరుద్ధమగుట దానికి తార్కాణ మందురు. సకల భాషా వాగనుశాసనుడు అను బిరుదను పొందిన వాడగుటచేత నన్నయ యేదో వ్యాకరణము రచించి యుండును. ఇక పైన పేర్కొనిన ఆంధ్ర సారస్వత చరిత్రలోని యేడు యుగములను వివరించుట అవసరము.

"మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్ కుండలీంద్రుండు, త
న్మహనీయస్థితి మూలమై నిలువ, శ్రీనాథుండు ప్రోవన్, మహా
మహులై సోముడు, భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించునీ
బహుళాంధ్రోక్తి మయ ప్రపంచమునఁ దత్త్రా గల్భ్య మూహించెదన్"

ఈ పద్యమును రామరాజ భూషణుడు తన వసుచరిత్రలో వ్రాసెను. అనగా వారే తనకన్న ముందుండిన మహా కవులని అతని అభిప్రాయము. ఆంధ్ర

సారస్వతమునకు మూలస్తంభములనియు అతని భావము. తనకన్న పూర్వులైన ఇతర కవులనతడు మెచ్చుకొనలేదన్న మాట.

## 1. ఆదియుగము :

నన్నయభట్టు మొదలుకొని తిక్కన సోమయాజి కాలమువరకు స్థూలముగా ఈ యుగమును విభజింపవచ్చును. నన్నయ రాజరాజ నరేంద్ర చాళుక్యరాజు యొక్క ఆస్థానకవి. క్రీ.శ. 1050 ప్రాంతమువాడు. అతడు మహాభారతములో ఆదిపర్వము, సభాపర్వము, అరణ్యపర్వములో ముప్పాతిక భాగము రచించిపోయెను. తర్వాత నెల్లూరిలో మనుమసిద్ధి రాజ్యముచేసిన కాలములో క్రీ.శ. 1250 ప్రాంతములో తిక్కన సోమయాజి విరాటపర్వము మొదలుకొని భారతము తుదివరకు తెనిగించెను. తర్వాత రెడ్ల యాస్థానమందుండిన ఎఱ్ఱాప్రగడ కవి భారతములోని అరణ్య పర్వ శేషమును పూరించెను. ఈ ముగ్గురు మహాభారత కవులను కవిత్రయము వారందురు. వారు వాడిన పదాలు, చేసిన ప్రయోగాలు అన్నియు అందరికిని ప్రమాణమైనవి. మహాభారతము మన తెనుగులో, ఆది గ్రంథమైనను, నేటికిని ఉత్తమోత్తమమని అందరిచే గౌరవింపబడుచున్నది.

నన్నయ తర్వాత ఇంచుమించు నూరేండ్లకు నన్నెచోడుడు అను రాజు కుమార సంభవము అను చక్కని తెనుగు కావ్యమును రచించెను.

## 2. కాకతీయయుగము :

ఓరుగంటిని రాజధానిగా జేసుకొని తెనుగు దేశమును కాకతీయులు క్రీ శ. 1140 నుండి 1340 వరకు రాజ్యము చేసిరి. ఈ కాలములో మొదటి ప్రతాపరుద్రుడు, మహా దేవరాజు, గణపతి దేవుడు, అతని కూతురు రుద్రమ్మ, ఆమె మనుమడు రెండవ ప్రతాపరుద్రుడు కాకతీయ వంశపు రాజులు ఢిల్లీ సుల్తానగు అల్లావుద్దీన్ ఖిల్జీ కాలములో ఓరుగంటి రాజ్యము పడిపోయెను. కాని 1320 నుండి 1440 వరకు నామకార్థముగా కొంత కాలము హిందువుల పరిపాలన ముండెను.

కాకతీయుల కాలములో అనగా 1140 నుండి 1340 మధ్యకాలములో ఉత్తమ సారస్వతము బయలుదేరెను. ఈ కాలములోనే పాల్కురికి సోమనాథుడు

(క్రీ.శ. 1250-1300 ప్రాంతమువాడు) బసవపురాణము, పండితారాధ్య చరిత్ర అను ద్విపద శైవ వాఙ్మయమును రచించెను. ఇతడు జనగామ తాలూకాలోని పాలకుర్తివాడు. కాకతీయుల సామంతుడును, రాయచూరు ప్రభువును అయిన గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణమును తన తండ్రి విఠల (రంగనాథుని) పేర ద్విపదగా రచించెను. గోనబుద్ధారెడ్డి "కవి లోక భోజుండు." మల్లికార్జున పండితారాధ్యుడు "శివతత్త్వసారము" అను మంచి శైవ గ్రంథమును రచించెను. ఈ కాలమందే నెల్లూరిలో మనుమసిద్ధి రాజు నొద్ద తిక్కన సోమయాజియుండెను. ఇతని కన్న మించిన కవి నేటివరకు పుట్టలేదు. ఇతడు నిర్వచనోత్తర రామాయణమును, మహాభారతములోని పదియేను పర్వములను రచించెను. ఇతని గొప్పతనమేమన ఇతనికే అభినవదండి అను బిరుదుగల కేతన తన దశకుమార చరిత్రమును అంకితమిచ్చి యిట్లు చెప్పుకొనెను—

"కవిత జెప్పి యుభయ కవి మిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతడు మెచ్చ
బరగ దశకుమార చరితంబు జెప్పిన
ప్రోఢ నన్ను వేరె పొగడనేల ?"

దశకుమార చరిత్ర కథలు చాలా మనోహరములైనవి. తిక్కన సోమయాజి శిష్యుడగు మారన మార్కండేయ పురాణమును రచించెను. తిక్కన శిష్యునిది కావున అది ఉత్తమమైనది. తిక్కన సోమయాజి ఉభయకవి మిత్రుడు. సకల విద్యా కళా విచక్షణుడు, కవిబ్రహ్మ, బుధజనవిరాజి. కావ్య ప్రౌఢి పాటించు శిల్పమున పారగుడు. తను కావించిన సృష్టి తక్కొరులు చేయలేదు. సాటిలేని వాడనిపించుకొన్న ఆంధ్ర కవి కుల గురువు.

క్రీ. శ. 1300 ప్రాంతముననున్న మంచన అను కవి కేయూర బాహు చరిత్రమును రచించెను. పుస్తకము చాలా చిన్నదే కాని కవిత చాలా గొప్పది.

కాకతీయ యుగములోనే శతకములారంభమయ్యెను. అందు ముఖ్యమైనవి (బద్దెన) భద్ర భూపాలుడను నతనిచే రచితమని చెప్పబడు సుమతిశతకము, నీతి శాస్త్ర ముక్తావళి, పాల్కురికి సోమనాథుని వృషాధిపశతకము, యథా వాక్కుల అన్నమయ్య "సర్వేశ్వర శతకము."

## 3. రెడ్డియుగము

అద్దంకి, కొండవీడు, కోరుకొండ, రాజమహేంద్రవరములను రాజధానులనుగా జేసుకొని రెడ్డిరాజులు తెనుగు సీమను క్రీ. శ. 1300 నుండి 1450 వరకు రాజ్యముచేసిరి. ఒక దిక్కున సామ్రాజ్య విచ్ఛిత్తి కాగా ఇంకొక దిక్కున రెడ్డిరాజులు ఆంధ్రులను రక్షించి పాలించిన వారైరి.

రెడ్డిరాజుల నాశ్రయించిన కవులలో ప్రఖ్యాతులైనవారు ఎఱ్ఱాప్రగడ, శ్రీనాథుడు, వామనభట్ట బాణుడు, వెన్నెలకంటి సూరన, నిశ్శంక కొమ్మన.

రెడ్డిరాజులు స్వయముగా సంస్కృత గ్రంథాలు, వ్యాఖ్యలు రచించిరి. కుమారగిరి వసంత రాజీయమను నాట్య శాస్త్రమును సంస్కృతమున రచించెను. పెదకోమటి వేమభూపాలునికి సర్వజ్ఞ చక్రవర్తి అను బిరుదముండెను. ఈరాజుల రసికతవలన దేశమందు కవులు బహుళమై శ్రీనాథుని హాస్యమునకు పాత్రులైరి. శ్రీనాథుడు కొండవీటి వీథిలో తిరుగు గాడిద నుద్దేశించి యిట్లు పద్యమల్లెను -

> "బూడిద బుంగలై యొడలు పోడిమి దక్కి మొగంబు వెల్లనై
> వాడల వాడలం దిరిగి వాడును వీడును చొచ్చొ చోయనన్
> గోడల గొందు లందొదిగి కూయుచు నుందువు కొండవీటిలో
> గాడిద! నీవునుం గవివి కావుగదా. యనుమాన మయ్యెడిన్."

ఈ కాలములోని ఎఱ్ఱాప్రగడ భారతములోని అరణ్య పర్వశేషమును ముగించిన కవిత్రయములోనివాడు.అతడు నృసింహపురాణమును హరివంశమును, రచించెను. ఆ రచనతో ప్రబంధ పరమేశ్వరుడను బిరుదమును పొందెను.

రెడ్ల ఆస్థాన కవియు, ఆస్థాన విద్యాధికారియునైన శ్రీనాథుడు ఆనాటి వెలమ రాజులను, విజయనగర చక్రవర్తులను, ఇతర రాజులను దర్శించి వారిచే పూజితుడై దిగ్విజయమొంది తన గొప్పదనమును చూపెను. విజయనగరములో డిండిమభట్టు అను ఉద్దండుని జయించి "నన్ను జయించేవారు లేరు" అని కంచు ఢక్కను మ్రోగించుకొనుచుండిన ఆ డిండిమభట్టు ఢక్కను పగుల గొట్టించి విజయనగర చక్రవర్తిచే ముత్యాల శాలలో బంగారు దీనారాలతో స్నాతుడై కవి

సార్వభౌమ బిరుదమందెను. ఆట్టి శ్రీనాథుడు శృంగార నైషధమును, కాశీఖండ మును, భీమ ఖండమును రచించెను. ఇంకా ఇతర కావ్యాలు వ్రాసెను. పల్నాటి వీరుల కథలను ద్విపదగా ఇతడే వ్రాసెనని యందురు. ఎవరు వ్రాసినను అది చక్కని వీరకావ్యము. శ్రీనాథుడు భోగి, బమ్మెర పోతన యోగి.

శ్రీనాథునికి సమకాలికుడగు వల్లభరాయలు అను చిన్న రాజుండెను. అతడు క్రీడాభిరామమను శృంగార ప్రధానమగు వీధి నాటకమును రచించెను. కాని అది శ్రీనాథుడే వ్రాసినట్లు శైలి తెలుపుచున్నది. ఇద్దరునూ కలిసి వ్రాసిరో యేమోకాని కాకతీయులనాటి సాంఘిక చరిత్రకు క్రీడాభిరామమే ముఖ్యాధారమగు చక్కని గ్రంథము.

వెన్నెలకంటి సూరన విష్ణు పురాణమును రచించెను. ఇది భారత భాగవత ములవలె ఆంధ్రులలో ప్రచారమైనట్టిదికాదు. అయినను ఇతనిది చక్కని కవిత.

ఈ వంశమువాడే వెన్నెలకంటి అన్నయ్య అను కవి యుండెను. అతడే కాలమువాడో తెలియదుకాని ప్రచురణకర్తలు అతడు క్రీ. శ. 13 వ శతాబ్ద్యా నంతరము వాడన్నారు బహుశః ఈ రెడ్డి యుగములోనివాడేనేమో! ఈ అన్నయ్య కవి "షోడశకుమార చరిత్రము'' ను రచించెను. ఇది చక్కని కవిత. అచ్చు పోసినట్లు ఒకే ధోరణిలో విసుగెత్తించు కవిత్వమును, కథలను వ్రాసిన ప్రబంధ కవుల రచనలను చదివినవారి కిట్టి కథలు చాలా ఆనందము నిచ్చును. ఈతని షోడశకుమార చరిత్ర కథలు మనోహరమైనవి. ఇట్టి కథలను వ్రాసిన వారిలో పేర్కొనదగినవారు వీరు.

జక్కన — విక్రమార్క చరిత్ర
అనంతామాత్యుడు — భోజరాజీయము
కదిరీపతి — శుకసప్తతి
కొరవిగోపరాజు — సింహాసన ద్వాత్రింశిక కథలు
కేతన — దశకుమారచరిత్ర
మంచన — కేయూరబాహుచరిత్ర

వెంకటనాథుడు — పంచతంత్రము

పింగళి సూరన — కళాపూర్ణోదయము

ఇవన్నియు ఉత్తమ కవితలు.

ఇంచుమించు క్రీ.శ. 1380 ప్రాంతములో నుండినవాడు రావిపాటి త్రిపురాంతకుడు. సంస్కృతములో ప్రేమాభిరామము రచించెను. అది మాయమైపోయినది. త్రిపురాంతక కవిని (తిప్పన్నను) గూర్చి క్రీడాభిరామములో ఇట్లన్నారు.

"నన్నయభట్టు తిక్కకవి నాయకులన్న హుళక్కిభాస్కరుం
డన్నను చిమ్మపూడి యమరాధిపుడన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు నింతురు జేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాడ తగునా యిటు దోసపు మాటలాడగన్?''

ఇతని తెనుగు కృతి త్రిపురాంత కోదాహరణము. ఇది ఒక్కటే మనకు లభించినది. అది ఉత్తమశైలి కల్గినట్టిది.

రెడ్డిరాజుల సమకాలికులు రాచకొండ దేవరకొండలకు ప్రభువులైన వెలమ రాజులు. అందు సర్వజ్ఞ బిరుదు వహించిన సింగమనాయకుడు సంస్కృతములో రచనలు చేసెను. అతనికాలమందే, అతని సీమ యందే కోలాచల మల్లినాథ సూరి యుండెను. జనగామ తాలుకాలో బమ్మెర అను గ్రామము కలదు. అది పాల్కురికి సోమనాథుని పాలకుర్తికి రెండు మూడు మైళ్ళదూరమున నున్నది. ఆ గ్రామము పోతనామాత్యుని జన్మదేశమై పవిత్రమైనది. పోతనామాత్యుడు ఆంధ్ర మహాభాగవతమును రచించిన మహాకవి. అతని భాగవతమును అనేకులు పారాయణము చేయుదురు. అతనికి శిష్యులైన ఏర్చూరి సింగయ్య, వెలిగందల నారయ్య, గంగయ్య అనువారు భాగవతములో కొన్ని భాగములను రచించిరి.

సర్వజ్ఞ సింగభూపాలుడు భాగవతమును తనకంకిత మీయనందున దానిని పాతిపెట్టించగా ఖిలమైన భాగాలను పోతన శిష్యులచే పూరించిరను అపవాదము కల్పితమయ్యెను. అది అబద్ధము. ఆ ముగ్గురు శిష్యులలో ఒకరు కూడ సూచన

మాత్రముగానైనను ఆ మాట వ్రాయలేదు. అట్లైతే వారెందుకు కొన్ని భాగాలను వ్రాసిరనగా పోతన తన శిష్యులను అనుగ్రహించుటకై వారిచే కొన్ని భాగాలను వ్రాయించి తనతోపాటే వారిని గూడ వందనీయులనుగాజేయ సంకల్పించి యుండేనేమో. ఆ ముగ్గురు శిష్యుల కవనము కూడా పోతనకవితకు కుడియెడమగా ప్రశంసా పాత్రముగా నున్నది.

పోతన భగవద్భక్తుడు. అతడు భక్తిరసాన్ని అద్వితీయముగా అసామాన్యముగా భాగవతమందు చిప్పిలజేసెను. భక్తిరస ఘట్టములందు అతడు కవిత్రయాన్నె కాక ఆంధ్ర కవులందరిని కూడ మించినవాడయ్యెను. ప్రహ్లాదచరిత్ర, కుచేలోపాఖ్యానము, గజేంద్రమోక్షము, ధృవచరిత్ర, అంబరీషోపాఖ్యానము, ఉత్తమమైన భక్తిరస ప్రధానఘట్టములు. అందు ప్రహ్లాదచరిత్ర అగ్రస్థానమలంకరించును.

"మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు"

అను పద్యము వంటి పద్యాలు అందు నిండుగా గలవు. క్రీ.శ. 1420 ప్రాంతములో రాచకొండ రాజుల యాశ్రమములో నుండిన కొరవి గోపరాజు అతని సింహాసన ద్వాత్రింశిక మనోహరమగు విక్రమార్క కథల కావ్యము.

## 4. విజయనగర యుగము

క్రీ.శ. 1323 లో మహ్మదీయులు ఓరుగంటిని పట్టుకొనిరి. ఆ సమయములో ఓరుగంటి నుండి సంగమ అనునతని అయిదుగురు కుమారులు హంపికిని, దాని దగ్గరనుండు కంపిలికిని వెళ్ళి అచ్చట విజయనగర దుర్గమును తుంగభద్రా తీరమందు నిర్మించి, క్రీ.శ. 1336 లో విజయనగర సామ్రాజ్య స్థాపన చేసిరి. ఆ సోదరులలో హక్క (మొదటి హరిహరరాయలు) బుక్క(రాయలు) ముఖ్యులు. క్రీ.శ. 1347 లో బహామనీ రాజ్యము స్థాపిత మయ్యెను. అది కొంత కాలానికి అయిదు చీలికలై పంచ సుల్తానులకు మూల మయ్యెను. హరిహరరాయ కాలము బహమనీ సుల్తానులతో పోరాడుటతో సరిపోయెను. అతని కొడుకు రెండవ హరిహరరాయలు క్రీ.శ. 1379 నుండి 1404 వరకు రాజ్యము చేసెను. తర్వాత

మొదటి దేవరాయలు రాజయ్యెను. అతని కాలములో బహమనీ దాడి ఎక్కువై బాధ కలిగించెను. రెండవ దేవరాయలు 1421-1448 వరకు రాజ్యము చేసెను. అతడును దుర్బలుడగురాజు. తుదకు క్రీ.శ. 1486 లో సాళువ నరసింహరాయలను చంద్రగిరి సామంతరాజు విజయనగరాన్ని ఆక్రమించుకొని రాజ్యముచేసెను. అతడు ప్రబలుడై రాజ్యమును విస్తరించి, తురక ప్రభువులనోడించి రాజ్యమును స్థిరపరచెను. అతని కొడుకు ఇమ్మడి నరసింగరాయలు. అతనిని క్రీ.శ. 1505 లో అతని సేనాని తుళు వంశము వాడగు నరస నాయకుడు చంపి రాజ్యము నాక్రమించుకొనెను. అతని కుమారుడు శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1509 నుండి 1529 వరకు దేదీప్యమానముగా, దిగ్విజయమానముగా రాజ్యము చేసెను. విజయనగరరాజ్యము గోదావరినుండి రామేశ్వరమువరకు వ్యాపించి, మహాసామ్రాజ్యమై సుల్తానుల బలమును భంగపఱచిన దయ్యెను. శ్రీకృష్ణదేవరాయల తర్వాత అతని తమ్ముడు అచ్యుతరాయలు చక్రవర్తి యయ్యెను. అతడు దుర్బలుడు, అతని తమ్ముని కొడుకగు సదాశివరాయలు క్రీ.శ. 1542 లో చక్రవర్తి యయ్యెను. అతడు నామకార్థముగా రాజుగా నుండెను. కాని శ్రీకృష్ణదేవరాయల అల్లుడగు ఆళియ రామరాజు నిజమైన చక్రవర్తిగా పరిపాలించెను. క్రీ. శ. 1565 లో అయిదుగురు దక్కన్ సుల్తానులు కలిసి తళ్ళికోట యొద్ద రామరాజుతో యుద్ధము చేసి అతనిని చంపి విజయనగరమును ధ్వంసము చేసిరి. కాని విజయనగరబలము నాశనము కాలేదు.

రామరాజు తమ్ముడు తిరుమలరాజు పెనుగొండను రాజధానిగా చేసుకొని విజయనగర సామ్రాజ్యాన్ని పాలించెను. అతని తర్వాత శ్రీరంగరాయలు చంద్రగిరిని రాజధానిగా చేసుకొని ఇంచుమించు 1650 వరకు రాజ్యము చేసెను. అటు తర్వాత విజయనగర సామ్రాజ్యము సంపూర్ణముగా నశించెను.

ఇక 1350 నుండి 1650 వరకు వాఙ్మయ స్థితి ఎట్టిదో కనుగొందము.

ఈ 300 ఏండ్లకాలమును ప్రబంధ యుగమని చెప్పవచ్చును. ఈకాలంలో అష్టాదశవర్ణనలతో సంస్కృతపద భూయిష్ఠశైలితో శబ్దాలంకార బాహుళ్యముతో గొప్ప గొప్ప ప్రబంధాలు రచింపబడెను.

మొదట బుక్కరాయల కాలంలో నాచసోమనాథుడను మహాకవి యుండెను. అతనికి గుత్తి దుర్గము క్రింద నుండు పెంచికల దిన్నెను అగ్రహారముగా బుక్కరాయలు దానము చేసినందున అతడాగ్రామము వాడనుట స్పష్టము. ఆ దాన శాసనములో కవి నిట్లు వర్ణించినాడు.

"యాజుషాణాం వరేణ్యాయ సకలాగమ వేదినే
అష్టాదశ పురాణానా మభిజ్ఞాతార్థ వేదినే
అష్ట భాషా కవిత్వశ్రీ వాణీ విజిత సంపదే
సోమాయ నాచనాం భోధేః సోమాయామిత తేజసే"

దీనినిబట్టి అతని పాండిత్య కవిత్వ మహత్వము సువ్యక్తమగుచున్నది.

తిక్కనవలె అతడు అసాధారణ కవి. అతడు ఉత్తర హరి వంశమును రచించెను. అతడు క్రీ. శ. 1340 ప్రాంతము వాడు. అతడు "సకల భాషా భూషణుడు", "సాహిత్య రస పోషణ సంవిధాన చక్రవర్తి". "అలికంబున యక్షిని దాచినట్టి సర్వజ్ఞుడు", అష్ట భాషా కవిత్వ విశారదుడు", "నవీన గుణ సనాథుడు". సీస పద్యము ఇతని చేతిలో పరిణతి నందెను.

కాహ్లార మకరంద కలిత మందాకినీ
లహరీపరీత కోలాహలంబు
బాలేందు చంద్రికా పరభాగశోభా ప
రాగ సంభావితా రగ్వధంబు
సేవాసమాసన్న సిద్ధ సీమంతినీ
తాలవృంతోత్తాల తాండవంబు
కాత్యాయినీ దత్త కర్ణావతంస క
ర్పూర ఖండామోద పూరితంబు

మారుతంబది నామీద మలసియాడ
గలుగునొకొ నాకు నొకనాడు కన్నులార
శివుని జూచు పుణ్యంబును చింతనెరయ
మొదలి వేలుపుం బొడగంటి మ్రొక్కగంటి.

ఈ నడకను శ్రీనాథుడు నేర్చుకొని తన సీసపద్యాలను తీర్చిదిద్ది యలంకరించుకొనెను. నాచనసోమనాథుడు సామెతలను ఎక్కువగా వాడిన మొదటి తెనుగు కవి. ఉత్తమ హాస్యమునకుఁగూడ నితడే మొదటివాడు.

మొదటి దేవరాయల మంత్రిగా నుండిన సిద్ధనకు జక్కన కవి తన విక్రమార్క చరిత్రను అంకితమిచ్చెను. జక్కన క్రీ. శ. 1430-1447 ప్రాంతమందుండెను. తన కవిత్వమును గూర్చి యిట్లు వ్రాసుకొనెను.

"చక్కన నీపై దుష్యము
చక్కన నీకావ్యరచన చాతుర్యంబుల్
చక్కన నీవాగ్వైఖరి
చక్కన నీవంశమహిమ జక్కన సుకవీ!"

ఇతడు చక్కని కథలు వ్రాసెను. సంస్కృతాంధ్రములందు అనర్గళధార గలవాడు.

కల్పాంత దుర్దాంత కలుషాంతక స్వాంత
దుర్వార వహ్నికి నోర్వవచ్చు
నిష్ఠుర నిర్ఘోష నిర్ఘాత సంఘాత
జాత మహీవహ్ని సైపవచ్చు
ప్రళయ కాలాభీల ఫాలలోచన ఫాల
భాగానలస్ఫూర్తి బ్రతుకవచ్చు
కాకోదరేంద్ర ఫూత్కార సంభవ తీవ్ర
కాకోల దహనంబు గదియవచ్చు

కాక సైరింపవచ్చునే లోకదహన
దర్పితంబైన యస్మత్ప్రతాప వహ్ని
తావకోత్సాహ సాహసౌదార్య ధైర్య
గతికి మెచ్చితి విక్రమార్క క్షితీంద్ర!"

అని సంస్కృతపద జటిలముగా వ్రాసెను.

"పలుకులు వేయు నేటికిక, బ్రాహ్మణసూనుడ వీవు, నీకు దో
ర్బలమున కేమి కారణము, బాపనపోటును, కప్పకాటునుం
గలదె ధరిత్రి? భట్టిమొన గట్టిగ నమ్మకు, మోసపోకు, నీ
కొలదులె రాచకార్యములు, కోమటి బుద్ధుల దీర్పదీరునే?"

అని లలితముగా గూడ రచించెను.

పిల్లలమఱ్ఱి పినవీరన సూర్యాపేట యొద్దనుండు పిల్లలమఱ్ఱివాడు యందురు. అతడు జైమినీ భారతము వ్రాసి సాళువ నరసింహరాయల కంకిత మిచ్చెను. అతని శృంగారశాకుంతలము, జైమినీభారతము ప్రసిద్ధ కావ్యములు. "వాణి నా రాణి యని యెద విరుచుకొని పలికినదీ పినవీరనయేనట ! ఈ వీర భద్రుడు "విపులచాటూక్తి నిర్నిద్రుడు".

తుళు వంశపు నరసింహరాయలకు నంది మల్లయ్య, ఘంట సింగయ అను జంటకవులు తమ వరాహపురాణము నంకితమిచ్చిరి.

శ్రీకృష్ణదేవరాయల కాలము ఆంధ్ర సారస్వతమునకు మహావైభవకాలము అతని యాస్థానములో అష్టదిగ్గజములు అను ఎనిమిది మంది కవులుండిరని ప్రతీతి.కాని యందుపేర్కొనబడిన కవులలో కొందరు అతని ఆస్థానమువారుకారు.

శ్రీకృష్ణ దేవరాయలు స్వయముగా మహాకవి. అతడు ఆముక్తమాల్యదను వ్రాసెను. దానినతడు వ్రాయలేదనీ, మను చరిత్ర వ్రాసిన అల్లసాని పెద్దన వ్రాసెననీ అందురు. కాని ఈ రెండు పుస్తకముల శైలిని చూచిన రెంటికిని ఏమిన్నీ పోలిక లేదు. ఆముక్తమాల్యద శైలి చాలా బిరుసు. మను చరిత్ర శైలి తీర్చి దిద్ది మృదువుగా, ఇంపుగా నుండునట్లు వ్రాసినది. ఆముక్త మాల్యద సాన బట్టని గనిలోని రత్నము - మను చరిత్ర మెఱుగిచ్చి వంకలు దిద్దిన వజ్రము.

"గృహ సమార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకి కా
వహనంబో, వనమాలికాకరణమో, వాల్లభ్య లభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాత పత్ర ధృతియో, బ్రాగ్దీపికారోపమో
నృహరీ-వాదములేల? లేరెయితరుల్ నీ లీలకుం బాత్రముల్"

—ఆముక్త మాల్యద

"బహుళరత్నద్యుతి మేదురోదరదరీ భాగంబులం బొల్చుని
మ్మహికాహార్యమునం జరింతు మెపుడుం బ్రేమన్ నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబులవి మత్కాంతార సంతాపముల్"
—మనుచరిత్ర

ఏ పద్యము చూచినను రెంటిలో ఇట్టి శైలి భేదముండును - కాన శ్రీకృష్ణ రాయలే ఆముక్త మాల్యదను రచించెనని విశ్వసింపవలెను. బ్రాహ్మణేతరుల కవిత్వమెంత మంచిదైనను అది కాకజుష్టంబైన హవ్యంబువోలె గ్రాహ్యంబు కాదు" అని తిట్టిన అప్ప కవి తన అప్ప కవీయములో ఆముక్తమాల్యదను ఉదాహరించినపు డంతయు అది పెద్దన్నగారిది అని వ్రాసెను. అక్కడనుండి ఈ కథకు వేళ్లు వచ్చెను. ఆముక్త మాల్యదను విష్ణు చిత్తీయమనియు నందురు. శైలి బాగుగా లేకున్నను అందలి భావములు వర్ణనలు అనితర కావ్య లభ్యములు.

కృష్ణ దేవరాయలకు ముఖ్యుడైన ఆస్థానకవి అల్లసానిపెద్దన అతనికి "ఆంధ్ర కవితా పితామహ" అను బిరుదమిచ్చి అతని కాలికి ఆ చక్రవర్తి స్వయముగా గండపెండేరమును తొడిగించెను. శ్రీకృష్ణ దేవరాయలు చని పోయిన తర్వాత అల్లసాని పెద్దన అతనిని తలచుకొని వాపోయిన పద్యమును చదువు ఆంధ్రులు కూడ ఆనాటి వైభవమును తలచుకొని దుఃఖింపక మానరు. పెద్దన రాయల గూర్చి ఇట్లు విలపించెను.

"ఎదురైనచో దన మద కరీంద్రము డిగ్గి
కేలూత యొసగి యెక్కించు కొని యె
మను చరిత్రంబందుకొను వేళ పురమేగ
పల్లకి తనకేల బట్టి యెత్తి
బిరుదైన కవి గండపెండేరమున కీవె
తగుదని తానె పాదమున దొడిగె
గోకట గ్రామాద్యనేకాగ్రహారంబు
లడగిన సీమలయందు నిచ్చె

ఆంధ్ర కవితా పితామహ యల్లసాని
పెద్దన కవీంద్రయని నన్ను బిలుచునట్టి
కృష్ణ రాయలతో దివి కేగలేక
బ్రతికి యున్నాడ జీవచ్ఛవంబ నగుచు."

శ్రీకృష్ణ దేవరాయల ఆస్థాన మండలి అష్ట దిగ్గజము లెవరనగా! 1. అల్లసాని పెద్దన, 2. నంది తిమ్మన (ముక్కు తిమ్మన), 3. అయ్యల రాజు రామభద్ర కవి 4. ధూర్జటి, 5. మల్లన (ప్రౌఢకవి), 6. పింగళి సూరన, 7. రామరాజ భూషణుడు, 8. తెనాలి రామకృష్ణుడు. తుది ముగ్గురు కృష్ణ రాయల కాలములో గ్రంథాలేవి రచింపలేదు. నంది తిమ్మనకు ముక్కు పెద్దదిగా నుండెనేమో ముక్కు తిమ్మన అనియే అతడు ప్రసిద్ధి నొందెను.

"ముక్కు తిమ్మనా ర్యు ముద్దు పలుకు"

అని నానుడి యేర్పడెను. అతడు పారిజాతాపహరణమును రచించెను. అది ఉత్తమ కావ్యాలలో చేరినట్టిది.

"జల జాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్న తండ్రి శిరమచ్చో వామ పాదంబునన్
దొలగంద్రోసె లతాంగి యట్లయగు నాథుల్ నేరముల్ సేయ పే
రలుకం జెందిన యట్టి కాంతలుచిత వ్యాపారముల్ నేర్తురే?"

ఇట్టి సుందర పద్యములను నంది తిమ్మన వ్రాసెను.

కృష్ణరాయల కాలములో యెల్ల నార్యుడు - నాదెండ్ల గోప ప్రధాని కూడా రచనలు చేసిరి. అవి అంత గొప్పవి కావు.

ధూర్జటి కవి కాళహస్తి మహాత్మ్యము అను కావ్యమును రచించెను. అది ఉత్తమ ప్రబంధాలలో చేరినట్టిది. మల్లన రాజశేఖర చరిత్రముకూడ అదే శ్రేణిలో చేరినది.

అళియ రామరాజు ఆస్థానకవి యగుటచే రామరాజ భూషణుడు అను ఖ్యాతిగాంచిన భట్టుమూర్తి కవి వసుచరిత్రను వ్రాసెను. అందు శ్లేషలు. యమకములు, ఉత్ప్రేక్షలు, విశేషముగా గలవు. అతడు వ్రాసిన పద్ధతిపై ఇతరులు వ్రాయపోయి వెల్లకిలబడిరి. అతనిని పూర్తిగా ప్రతి పద్యములో అనుకరించినవాడు కొల్లాపుర మాధవరాయలు. అతడు చంద్రికా పరిణయము రచించెనందురు.

రామరాజు కాలములో పింగళి సూరన కళాపూర్ణోదయమును రచించెను. అది అద్భుత కల్పనాకథ. అది తెనుగు సారస్వతములో అపూర్వమగు గ్రంథము. ఇతని ప్రభావతీ ప్రద్యుమ్నము కూడ చక్కని గ్రంథము. ఇతడు మొదటి ద్వ్యర్థి కావ్యమగు రాఘవ పాండవీయము రచించెను.

ఇదేకాలములో తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యమును రచించెను. అందు మారుమూల పదాలు బహుళము. కొన్ని వర్ణనలు చక్కగా ఆకర్షకములుగా నున్నవి.

విజయనగర సామ్రాజ్య కాలములో ఈక్రిందివారుకూడ రచనలు చేసిరి. మనుమంచిభట్టు, దుగ్గన, తాళ్ళపాక చిన్నన్న, సంకుసాల నృసింహకవి (కవి కర్ణ రసాయన కర్త) రామభద్రకవి ఎఱ్ఱన (శృంగార మల్హణ చరిత్రకర్త) రామరాజరంగన్న, కుమార దూర్జటి (కృష్ణరాయ విజయము), తిరువెంగళనాథుడు, మున్నగు పలువురు తమశక్తి కొలది పద్యకావ్యములు రచించిరి. కాని ఇవి ఉత్తమ శ్రేణిలోనివికావు.

విజయనగరపు తుదిరాజగు శ్రీరంగరాయలు చంద్రగిరిలో రాజ్యము చేసిన కాలముననో ఇంచుక తర్వాతి కాలముననో క్రి. శ. 1600 - 1650 ప్రాంతములో వుండినవాడు కదిరీపతి. ఇతడు అనంతపుర మండలములోని కదిరి నివాసి. ఇతడు శుకసప్తతి యను కథల పుస్తకమును రచించెను. ఈ శుకసప్తతి తెనుగు సారస్వతములో తృతీయ పంథ త్రొక్కినదనవచ్చును. ఇందు హాస్యము, తెనుగు నుడికారము, లలితమగు శైలి, లోకానుభవము, చక్కని శృంగారరసము అన్నియు నిండి ప్రతి పద్యము మనోహరముగా నుండును. ఇతని వర్ణనలు ఇతర ప్రబంధ కవులవలె అంధానుకరణములు కావు. విరహ

తాపం కలిగితే కవులందరు చంద్రుని, గాలిని, చిలుకలను, వసంతుని తిట్టిరి. ఈకవి కథలోని ఒక బ్రాహ్మణుడు విరహతాపము పొంది యిట్లు వస్థపడినాడు.

"ఒడిలోన పంచాంగ ముంచు కొన్నదిగాన
కెటుపోయె ననుచు నూరెల్ల వెదకు
పనిలేనిపని వీథి జనుచు గ్రమ్మరు నాత్మ
గృహమంచు నెంచి యిల్లిల్లు దూరు
అపుడు భుక్తి యొనర్చి యపుననే సంకటి
తింటినాయని యింటి తెలియ నడుగు
కుఱుచ దోవతి కట్టుకొని యెవ్వరోయిట్లు
గట్టిపోయిరటంచు గలవరించు
గడియలో తెల్లవాఱె, భాస్కరుడు గ్రుంకె
జాగులేలంచు సందెపై సందెవార్చు
కంతుమాయల నుమ్మెత్తకాయఁ దిన్న
పొలుపు సారెకు దెల్పునప్పుడమి వేల్పు."

వర్ణనయైనను సరే సహజాలంకారములతో స్వభావోక్తులతో చక్కని తెనుగుతో నిండియుండును.

## గోలకొండ కవులు

విజయనగర రాజుల కాలములో గోలకొండ కుతుబ్షాల కాలములో అందు ముఖ్యముగా ఇబ్రహీం కుతుబ్షా కాలములో పలువురు తెనుగు కవులుండిరి. అందు ముఖ్యులు మొదటి అచ్చ తెనుగు కావ్యమగు యయాతి చరిత్రమును వ్రాసిన పొన్నగంటి తెలగ నార్యుడు. మాలిక్ ఇబ్రాహీం కుతుబ్షా (మల్కిభరాముని) ఆస్థాన కవియైన అద్దంకి గంగాధర కవియునై యుండిరి. ఇతడు తపతీ సంవర ణోపాఖ్యానమును రచించెను. గోలకొండ ఖిల్లాలో కరణముగా నుండిన సారంగు తమ్మయ వైజయంతీ విలాసమను మంచి కావ్యమును రచించెను. ప్రౌఢ కవి మల్లా రెడ్డియు ఈ కాలము వాడే. అతడు దోమకొండ ప్రభువులకు పూర్వ పురుషుడు. అతడు షట్చక్రవర్తి మున్నగు పెక్కు గ్రంథాలను రచించెను. నిరంకుశో పాఖ్యానమును వ్రాసిన సంకుసాల రుద్రయ్యయు ఈ కాలము వాడే. ఓరుగల్లును

కొంత కాలము పాలించిన షితాబ్ ఖాన్ (సీతాపతి) కాలములో చరిగొండ ధర్మన్న చిత్ర భారతమును రచించెను.

క్రీ.శ. 1450 ప్రాంతములో రాయచూరు మండలములో కృష్ణాతీర మందుండిన అనంతామాత్యుడు భోజరాజరాజీయమను ఉత్తమ కావ్యమును రచించెను. ఇందలి శైలి సరళమే కాక విశిష్ట పాండిత్యముతో కూడినట్టి స్వభావవర్ణన లిందెక్కువ కలవు. ఇతడు గొప్పలాక్షణికుడు. రసాభరణము అను అలంకార శాస్త్రమును రచించెను. క్రీ.శ. 1600 ప్రాంతములో పాలమూరు జిల్లాలోని లేమా పిళ్ల (నవచూత పురము) అను గ్రామనివాసియగు అప్పకవి అప్పకవీయమును వ్రాసెను. తర్వాత వారికి గొప్పప్రమాణ గ్రంథమయ్యెను. కాని ఇతనినను సరించిన వారందరు చచ్చుకవిత్వమే వ్రాసిరనవలెను.

ఎలకూచి బాల సరస్వతి అనునతడు క్రీ.శ. 1600 ప్రాంతమువాడు. కొల్లాపురము రాజగు మల్ల భూపాలు నాశ్రయించి మల్ల భూపాలీయము రచించెను. ఇది భర్తృహరి శతకత్రయానికి తెనుగుసేత.

ఇంచుమించు క్రీ.శ. 1500 ప్రాంతమున సర్వజ్ఞ సింగభూపాలుని పుత్రుడగు మాధవుని వద్ద రాచకొండలో నుండినట్టి గౌరన అను కవి హరిశ్చంద్ర ద్విపదను, నవనాథ చరిత్ర ద్విపదను రచించెను. ఈ రెండును ఉత్తమ రచనలు. అందు హరిశ్చంద్ర ద్విపదయేమిన్న. ద్విపద ప్రబంధాలలోనిది పూజ్య స్థానమందినది. గౌరన కుమారుడు భైరవుడు. శ్రీరంగ మాహాత్మ్యమను ప్రబంధమును రచించెను.

## 5. తంజావూరి యుగము:

ఆంధ్ర సామ్రాజ్యము క్రమక్రమముగా దక్షిణాభి ముఖమయ్యెను. విజయ నగర సామంతులుగా. మండలాధి పతులుగా (గవర్నరులుగా) మధురను, తంజావూరును నాయకరాజులు పాలించుచుండిరి. అందులో మధుర సారస్వత పోషణకు ప్రసిద్ధికెక్కదయ్యెను. తంజావూరు రాజులు మాత్రము ఆంధ్రసారస్వతమును పోషించిన తుదిరాజులు. ఆ రాజులను గూర్చి ముందుకొంత తెలుసు కొనవలెను.

విజనగర చక్రవర్తియగు అచ్యుతదేవరాయల భార్యకుచెల్లెలి భర్తయగు చిన చెన్నప్ప నాయకుడు క్రీ.శ. 1540 ప్రాంతమందు తంజావూరికి నాయక రాజయ్యెను. అతని కుమారుడు అచ్యుత నాయకుడు క్రీ.శ. 1561 లో రాజయి, ఇంచుమించు 50 ఏండ్లురాజ్యము చేసెను. అతని తర్వాత తంజావూరు రాజ్యము క్షీణించి తుదకు శివాజీ సోదరుడైన ఏకోజీవశమై మహారాష్ట్రుల పాలనములోనికి వెళ్లి ఇంగ్లీషువారు ప్రభువులైన తర్వాత వారివశమై పోయెను.

తంజావూరి రాజులలో రఘునాధరాయల కాలమునను, విజయరాఘవుని కాలమునను ఆంధ్ర సారస్వతము ఇంచుమించు నూరేండ్లకాలము పోషింపబడిన దయ్యెను. ఈ రాజుల కాలములో పలువురు స్త్రీలు, భోగస్త్రీలు కూడా సంస్కృతాంధ్రములందు రచనలు చేసిరి. రఘునాథరాజు స్వయముగా మహాపండితుడు; ఉత్తమకవి. సంగీతములో కొత్త రాగములను కనిపెట్టి ప్రచారము చేసినాడు అప్రతిహత వీరుడు. ఈతడు రచించిన బహు సంస్కృతాంధ్ర గ్రథములు లభించినవి కావు. వాల్మీకి చరిత్ర మనునదొక్కటి ముద్రితమైనది. అది యుత్తమ శ్రేణిలో చేరిన గ్రంథము.

రఘునాథ నాయకుని ఆస్థానకవి చేమకూర వేంకటపతి, "ఈ చేమకూర చక్కెర మడిలో అమృతము పాటించి పెట్టినది" అని శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారనిరి. ఈ చేమకూర వెంకటపతి సారంగధర చరిత్రము, విజయ విలాసము అనురెండు ప్రబంధములను రచించెను. ఈ రెండును ఆంధ్ర సారస్వత మందు అమూల్యమగు రత్నములు.

విజయ రాఘవుని కాలములో ఉత్తమ కావ్యాలు వెలువడలేదు. కాని పలువురు స్త్రీ పురుషులు యక్షగానాలను, చరిత్రలను మున్నగు వాటిని రచించిరి. అందు రంగాజమ్మ మన్నారు దాస విలాసము ముఖ్యమైనది. కాళకవి, వేంకటపతి సోమయాజి యనువారును ప్రబంధాలు వ్రాసిరి.

## మధుర రాజులు

తంజావూరు రాజులెట్లు విజయనగరానికి యుండిరో అటులే మధుర నాయకులును అదే కాలములో సామంతులై తర్వాత స్వతంత్రులై యించుమించు తంజావూరు పడిపోయినప్పుడే పడిపోయిరి.

వారి కాలములో కొందరు సాధారణ ప్రబంధాలు వ్రాసిరి. అందులో ముఖ్యుడు శేషము వేంకటపతి (తారాశశాంకము). వేంకట కృష్ణప్ప నాయకుడు అహల్యా సంక్రందనమును వ్రాసెను. అతడే జైమినీ భారతమును వచనముగా వ్రాసెను. మట్ల అనంత భూపాలుడు, విజయరంగ చొక్కనాథుడును ప్రబంధాలు రచించిరి. వీరిలో శేషము వేంకటపతి తారాశశాంకము చక్కని శైలి గలది.

## 6. సంధి యుగము.

విజయనగర పతనానంతరము చిల్లర పాలెగాళ్ళను, రెడ్లను, ధనికులను ఆశ్రయించి పలువురు కవులు రచనలు చేసిరి. వారినే యుగములోను చేర్చుటకు వీలు లేనందునను వారు మన ఆధునిక యుగానికి పూర్వులయినందునను క్రీ.శ. 1700-1900 వరకుండు కాలమును సంధి యుగమని పేర్కొననైనది. ఈ కాలములో ఉత్తమ రచనలు కానవచ్చుట లేదు. అట్లున్నను సారస్వత చరిత్రలో ఆ కవులను గూడ సూచించుట అవసరము. ఈ కాలములో ముఖ్యులైన కవులను వారి రచనలను సూచింతుము.

| | | |
|---|---|---|
| శంకర కవి | — | హరిశ్చంద్రోపాఖ్యానము |
| చిత్రకవి సింగరార్యుడు | — | బిల్హణీయము |
| కిరీటి వెంకటాచార్యులు | — | అచలాత్మజా పరిణయము |
| కుమ్మరి మొల్ల | — | రామాయణము |
| ముద్దు పళని | — | రాధికా సాంత్వనము |
| అడిదము సూరకవి | — | రామలింగేశ శతకము |
| కూచిమంచి తిమ్మకవి | — | రసికజన మనోభిరామము మున్నగు బహు గ్రంథములు |

| | | |
|---|---|---|
| కూచిమంచి జగ్గకవి | — | చంద్రరేఖా విలాపము, సుభద్రా పరిణయము |
| శిష్టు కృష్ణమూర్తి | — | చాటువులు, కొన్ని వ్యాసాలు |
| బిజ్జుల తిమ్మారెడ్డి | — | అనర్ఘ రాఘవము |
| కాణాదము పెద్దన | — | ఆధ్యాత్మ రామాయణము ముకుంద విలాసము |
| తరిగొండ వెంకమ్మ | — | వెంకటాచల మాహాత్మ్యము |

ఈ సంధి యుగములో ఇద్దరిని గురించి ప్రత్యేకముగా సూచింపవలెను. ఒకరు వేమన. ఇంకొకరు త్యాగరాజు. వేమన క్రీ.శ. 1700-1750 ప్రాంతము లోని వాడు. అతడు ఆట వెలదులు వ్రాసినట్లుగా ఏతెలుగు కవియు నేటివరకు వ్రాయలేదు. అతడు మహాకవి. గొప్ప వేదాంతి అందులో సకల జనులకు అర్థమగు వేదాంతమును బోధించినాడు. అతడు అపూర్వ సంఘసంస్కర్త. సంస్కర్తలు విమర్శిస్తేనే జనులకు కోపము. వేమన లోపమున్న వారిని తిట్టి అందరిని నవ్వించి మెప్పు పొందినవాడు. అతని పద్యాలు కంఠపాఠము రాని తెనుగు విద్యా వంతుడు కానరాడు.

క్రీ.శ. 1759 నుండి 1857 వరకు తంజావూరిలోని తిరువాడిలో నివసించిన త్యాగరాజు ఆంధ్రుల చరిత్రలో అద్వితీయుడైన గాయక చక్రవర్తి. అంతేకాదు. మొత్తము ద్రావిడ భాషా కుటుంబమునకంతటికిని ఇతడే సంగీత మందు ఆశ్రయ భూతుడైనాడు. ఇతని కీర్తనలు పాడినవారే గాయకులు. ఇతని కీర్తనలు పాడలేనివారు దక్షిణ దేశమందు గాయకులనిపించుకొనరు.

ఈ యుగములోని తక్కిన కవులెవరనగా

| | | |
|---|---|---|
| కనుపర్తి అబ్బయ | — | కవి రాజ మనోరంజనము |
| నారాయణ దిట్టకవి | — | రంగరాయ చరిత |
| అయ్యలరాజు నారాయణ కవి | — | హంస వింశతి |
| చెదలువాడ మల్లయ | — | విప్ర నారాయణ చరిత్ర |

కంకంటి పాపరాజు — ఉత్తర రామాయణము
పుష్పగిరి తిమ్మన — సమీర కుమార విజయము
పిండిప్రోలు లక్ష్మణ కవి — లంకా విజయము
గోపీనాథము వేంకట కవి — గోపీనాథ రామాయణము
ఓగిరాల జగన్నాధ కవి — సుమకో మనోభి రంజనము

## 7. ఆధునిక యుగము

క్రీ.శ. 1880 ప్రాంతము నుండియే రచనలు చేసిన వారైనను వారు మన కాలములో 1900 తర్వాత గతించినవారు పలువురు రచయితలుండి నందున అట్టివారిని ఈ యుగములో చేర్చనైనది. నిజముగా ఈ యుగము అచ్చు విరివిగా ప్రారంభమైన నాటినుండి అనగా 1770-1820 లో నుండిన బ్రౌన్, అదే కాలములో అతని యొద్దనుండిన జూలూరి అప్పయ కాలము నుండియే లెక్క పెట్టవలెను. అచ్చుపద్ధతి యూరోపు నుండి మనకు లభించినది. క్రీ.శ. 1577 లోనే గోవాలో చేరిన పోర్చుగీసు వారిచే ప్రవేశపెట్టబడెను. మొదటి తమిళ నిఘంటువు క్రీ.శ. 1679 లో అచ్చయ్యెను. మొదటి అచ్చుపుస్తకాలు కైస్తవుల బైబిలు గ్రంథాలే మన తెనుగులో క్రీ.శ. 1800 ప్రాంతములో అచ్చు మొద లయ్యెను. కాని 1860 తర్వాతనే దానికి వ్యాప్తి కలిగెను. బ్రౌను అను ఇంగ్లీషు పండితుడు ఇంగ్లీషు తెనుగు నిఘంటువును రచించెను. అతడు వేమన పద్యాలను ఇంగ్లీషులోనికి అనువదించెను. తెనుగులో తాతాచార్యుల కథలు అను పుస్తకాన్ని వ్రాసెను. అతడు తెనుగు తాటాకు పుస్తకాలను తెప్పించి మద్రాసులో ప్రాచ్య లిఖిత పుస్తకాగారములో నుంచెను. మెకంజీ అను మరొక ఇంగ్లీషువాడు 1783 నుండి 1820 ప్రాంతము వఱకు మద్రాసులో ఇంజనీయరుగా నుండెను. అతడు తెనుగుదేశములోని చారిత్రక గాథలను అన్నింటిని వ్రాయించి "కైఫియత్తులు" సమకూర్చి అదే లిఖిత పుస్తకాగారములో నుంచెను. నేటికిని అవి అమూల్యమై నవి. కాని వాటిని ముద్రించు ఆలోచన ఎవ్వరున్నూ చేయనందున అవి శిథిలమై పోతున్నవి. యూరోపు నుండి మన దేశమునకు వచ్చిన మిషనరీలకు మనము చాలా ఋణపడియున్నాము. వారు మన దక్షిణ భాషలలోని ఆటవిక భాషలకు గూడ వ్యాకరణాలు వ్రాసి ఆ భాషలలో కైస్తవమత పుస్తకాలను రచించి అచ్చువేసిరి. క్రీ.శ. 1856 లో కాల్డ్వెల్ అను ఇంగ్లీషు పండితుడు తెనుగు,

తమిళము, కన్నడము, మళయాళము మున్నగు దాక్షిణాత్య ద్రావిడ భాషల కన్నింటికిని ఒక భాషాశాస్త్రమును రచించి ముద్రించెను. ''కురుఖు" అను లిపిలేని ఆటవిక భాషకు డాక్టర్ హార్ అనువాడు వ్యాకరణము వ్రాసెను. "మల్తో'' అను మరొక భాషకు డ్రోజే అనువాడు వ్యాకరణము వ్రాసెను. గొండి భాషకు విలియం సన్ వ్యాకరణము వ్రాసెను. ''కోదు" భాషకు బుషే మొదలగు ముగ్గురు పాశ్చాత్యులు వ్యాకరణములు వ్రాసి బైబిలును ఆ భాషలో ముద్రించిరి. గ్రియర్సన్ అను ఇంగ్లీషువాడు భారతీయ భాషలన్నింటిని గురించిన పుస్తకాల సంపుటముల ననేకముగా రచించి ముద్రించెను. (Linguistic survey) మన తెనుగునకు గూడ క్రీ.శ. 1850 ప్రాంతములో ఫ్రెంచి మిషనరీలు నిఘంటును, వ్యాకరణమును వ్రాసిరి. క్రీ.శ. 1607 లో తెనుగు వ్యాకరణమొకటి అచ్చయ్యెను. ఈ విధముగా ఇంగ్లీషు, ఫ్రెంచి, పోర్చుగీసువారు మన ద్రావిడ భాషలకు చేసిన సేవలో దశాంశమైనను నేటికిని మనము చేయలేదు.

ఇంగ్లీషువారు మన దేశమును జయించి మనల బానిసలనుగా చేసి రాజకీయముగా, ఆర్థికముగా పతితులనుగా జేసిరి. కాని మన సారస్వతానికి వారు అపారముగా ఉపకారము చేసినవారైరి.

ఒక వేయి యేండ్ల నుండి మనము వ్రాసిన పురాణాలనే వ్రాస్తూ వర్ణించిన శృంగారాన్నే మళ్ళీ మళ్ళీ వర్ణిస్తూ, వ్రాసిన పద్యాలనే వ్రాస్తూ ఉండిన వారము. మనలో గొప్ప మార్పును ఇంగ్లీషు వాఙ్మయము కలిగించెను. ఇంగ్లీషువిద్య దేశమందు వ్యాపించిన కొలది మనలో మార్పులు కలిగెను. తత్ఫలితముగా వచనములు, నవలలు, నాటకాలు, సైన్సులు, చరిత్రలు, భూగోళము, చిన్న కథలు, ఖండ కావ్యాలు, గేయములు, కొత్త వర్ణనలు, నూత్నవిధ విమర్శలు, వ్యాసములు, ఏకాంకికలు, హాస్య రచనలు, పరిశోధనలు, శాసనములు, భాషా శాస్త్రము, వివిధ పత్రికలు, పర భాషా సారస్వతముల భాషాంతరీకరణములు. కుప్ప తెప్పలుగా మనలో బయలుదేరెను. ఇతర దేశ భాషల పరిచయమేగాక, ప్రపంచములో అన్ని భాషల పరిచయము మనకు కలిగెను. ఈ కారణాలచేత మనవారి వేయేండ్ల కృషి

ఒక యెత్తు. 1859 నుండి నేటి వరకు జరిగిన ఈ నూరేండ్ల కృషి ఒక యెత్తు అనిన అతిశయోక్తి కానేరదు.

ఆధునిక యుగములో కలిగిన మార్పులు సూక్ష్మముగా తెలుపనైనది. ఆ మార్పులకు కారకులైన కవి పండితుల పట్టికలను ఇచ్చుటకు సాధ్యము కాని పని. అందువల్ల క్రీ.శ. 1900 నుండి ఇంతవరకు భాషా సేవ చేసినవారి పేరులు సూచించుటకు వీలులేదు.

ఆంధ్ర వాఙ్మయ చరిత్ర అతి సంగ్రహముగా ఇందు సూచితమైనది. ఇందు ఉత్తమ కృతులని సూచించిన వన్నియు సారస్వత ప్రియులు చదువవలెను.

# ఖుతుబు షాహీల ఆంధ్ర భాషా పోషణము

గోలకొండ రాజ్యము నేలిన ఖుతుబుషాహీ ప్రభువులు గాఢమైన స్వమతాభిమానులే కాని బహమనీ సుల్తానులవలె పరమత ధ్వంసకులు కారు. రాజ్యకాంక్ష బాగా కలిగిన వారే కాని బహమనీలవలె రక్త పిపాసులు కారు. స్వభాషను మాత్రమే వీరు బహమనీలవలె ప్రేమించిన వారు. దక్షిణ దేశమందు శిశుప్రాయమై యున్న ఉర్దూకు వీరు అవలంబన మిచ్చి పోషించిరి. ఈ ఖుతుబు షాహీలు స్వయముగా ఉర్దూ కవనమల్లిరి. పైగా తాము విశేషముగా తెలుగు దేశమును పాలించిన వారగుటచేత తెలుగును కూడా పోషించిరి. తమ సనదులను పార్శీలో వ్రాయించి యిచ్చుచు ఆ విషయములనే తెలుగులో వ్రాయించి ఇచ్చిరి. తెనుగు మండలములలో తెనుగు ద్వారానే రాజ్య వ్యవహారములను సాగించిరి.

మొదటి ఖుతుబుషా చిన్న కుమారుడును మూడవ గోల్కొండ సుల్తాను అగు ఇబ్రహీం ఖుతుబుషా ఏడేండ్లపాటు విజయనగరమందుండి తెనుగు బాగా నేర్చుకొనెను. తాను గోలకొండ సుల్తాను అయిన తరువాత విజయనగరమును నాశనము చేయుటకు ముఖ్య కారకుడయ్యెను. విజయనగర చక్రవర్తి యగు అళియ రామరాజుకు దత్తపుత్రుడుగా స్వయముగా ఏర్పడిన అహమద్‌నగర్ సుల్తాను అగు అలీ ఆదిల్షాయును రామరాజుచే ఏడేండ్లు స్వపుత్రునివలె రక్షింప బడిన గోలకొండ ఇబ్రహీమును రామరాజును తళ్ళికోట యుద్ధములో చంపి విజయనగరమును భస్మము చేసి తుంగభద్రలో కడిగి వేసిరి. ప్రపంచంలో కని వినీ ఎరుగని ఉపకారమంటే ఇదొక్కటే యుండవచ్చును. ఈ విధముగా ఇబ్రహీము ఆంధ్రులకు క్షమింపరాని అపకారము చేసినను అతని కొద్దిపాటి తిరిపపు ఆదరణమును మాత్రము ఆంధ్రులు మరువలేక పోయిరి. ఇదింకొక విచిత్రమగు కృతజ్ఞత. ఇబ్రహీం పేరునే మార్చి ఇభరామును చేసిరి. అతడు ఆంధ్రుల కందరికీ అభిరాముడయ్యెను.

“మల్కిభరాముడు ’ ఆంధ్రమును బాగా ఎరిగి యుండెను. సలక్షణముగా మాట్లాడు చుండెను. కవుల శ్రావ్యమగు కవితా ధారా సుధారసమును కుతూహలక

బంటిగా గ్రోలెను. తన్మయుడై తల ఆడించెను. ఆవేశపరుడై అడ్డా దిడ్డగా తెనుగు కవనమును స్వయముగా అల్లెను. రమ్మి పొమ్మని కవులతో సరస మాడెను. అద్దంకి గంగాధర కవిని పిలిపించి తపతీ సంవరణోపాఖ్యానమును వ్రాయించి కృతినందెను. అల్లాకానీ రసుంల్లా కాని ఇబ్రహీం సుల్తానును రక్షించి పోషించుగాక అని అద్దంకి దీవించలేదు. "శౌరి ఘనుడై కరుణారసవృష్టిచే నిరాయాసత బ్రోచుగావుత నృపాగ్ర .... మాల్కిభరాము శాందిపున్ అని దీవించెను. ఇబ్రహీము అందులకు సంశసించి గంగాధరునితో నిట్లనెను.

''పెక్కు కృతుల్ చమత్కృతులు పెంపుగ నందితిగాని స
మ్యక్కృతి కన్యపైగల మమత్వము ........ వర్తిలదు"

ఇట్లని తపతీ సంవరణోపాఖ్యానమను పౌరాణిక గాథను కృతిపొందెను. సుల్తాను ఆంధ్రభాషను పోషించినదిచూచి అతనిసేనలో గొప్పయధికారియై యుండిన అమీన్‌ఖాన్‌గూడ ఒక కృతిని అందెను.

పొన్నగంటి తెలగనార్యుడు యయాతి చరిత్రము అను అచ్చతెనుగు కావ్యమును రచించి అమీన్‌ఖానున కంకితమిచ్చెను. తెనుగు వాఙ్మయములో ఇదే మొదటి అచ్చు తెనుగుకృతి. అమీన్‌ఖాను కూడ మంచి సరసుడు. ఎన్నియో తరాలనుండి గోలకొండకు 20 మైళ్ళదూరములోనున్న పొట్లచెరువులో అతని పూర్వీకులు నివసించియుండిరి. అతనికుటుంబము హిందువులను ప్రేమించి ఆదరించుచుండెను. అతడు చిన్నదర్బారు చేసి ''దీవులేలు బలియులు రౌతుల్ మొదల్గాదను గొలువన్ సంతసమంది కబ్బములు పేర్కొవించు'' ఆనందిచుచుండెడివాడు. అతనికి ముఖ్య సచివుడు మరింగంటి అప్పన్న అను ఆంధ్రుడు. అమీన్‌ఖాను ఏమాత్రమున్నూ మతద్వేషమేకోశములోను లేనివాడు. పైగా హిందువులను తనవారివలె ప్రేమించు వాడు.

''కడక నమీనుఖానుడు జగంబుతనుం బొగడంగ వేడ్కతో
విడువక యెప్పుడుం బుధమి వేల్పుల బిడ్డల పెండ్లిచేయు.''

అమీనుఖానునికి ముగ్గురు భార్యలు. అందరును ఉత్తమ పతివ్రతలు. పొట్లచెరువులోని జనులందరికిని చల్లని తల్లులు. అందు బడేబీబీ అను పెద్దభార్య సాక్షాత్తు అన్నపూర్ణాదేవియే!

"అత్తవారిండ్లకు నరుగు కన్నియలకు
కట్నంబు లిచ్చుచు గారవించు,
ప్రొద్దు ప్రొద్దుననె యెప్పుడు లేచి వాడల
పసి బిడ్డలకునెల్ల పాలుబోయు,
ఆ కొన్నవారల కద్దమి రేయైన
అరగించబెట్టు నరసి యరసి
పాలునీరెనసినబాగుగా పెనిమిటి
తలపులో మెలకువ మెలగనేర్చు
ఔరతన పుట్టినింటికి నత్తవారి
యింటికిని వన్నెదెచ్చిన తుంటవిల్తు
తల్లివంటి బడేబీబి దరమె పొగడ
తమ్మి పూమీద నెలకొన్న దంటకైన"

ఒక ముసల్మాన్ స్త్రీ ఆ కాలములో హిందువులపై అంతటి, ఇంతటి అభిమానము చూపుట అసామాన్యమైన విశిష్టగుణమనవలెను.

అంతకు నూరేండ్ల క్రిందటనే బహమనీ సుల్తాను ఒక్క ముసల్మాను ప్రాణానికి ఒక లక్ష హిందువుల ప్రాణాలను తీనుకుంటాను, ఇదే మా మతాచారము అని చెప్పి యుండెను. మహమూదుషా బహమనీ ఒక లక్ష హిందువులను చంపే వరకు అన్నము తినక పోయెను. అట్టి కాలములో అమీన్‌ఖాన్, అతని భార్యయు హిందువులను ప్రేమించినారంటే అది చాల గొప్ప విషయము. అమీన్‌ఖాను బహుభాషా వేత్త, అతని తమ్ముడు.

"అరబీ, పారసీ, గుజరాతీ, ఆరే, అచ్చ తెలుగు, కన్నోజి మొదలుగా గలవి తెలిసి వ్రాయదారి కన్నట్టి బాడు గతాత ఖాను" ఇతడు,

"యిభరాము శాహుచేపట్టె యనుంగుగా
నడుప బాయక మూడు తరాలనుండి కన్పట్టు అమీనుఖానుడు"

ఖుతుబుషా వంశము వారు తెనుగు దేశములో చెరువులు కట్టించిరి. అనేక గ్రామాలను నిర్మించిరి. ఇతర ప్రాంతాలనుండి సమర్థులను పిలిపించి, వారికి జాగీరులిచ్చి క్రొత్త గ్రామాలను స్థాపింప చేసిరి. అట్టివారిలో దోమకొండ ప్రభువుల పూర్వీకులు ముఖ్యులు. రాజా మల్లారెడ్డి తన 'శివ ధర్మోత్తరమున' నిట్లు వ్రాసుకొనెను.

''ఘనుడా కాచనృపాల శేఖరుడు మున్ కర్ణాట రాజ్యంబు నం
దున దుర్గాధిపతిత్వ వైభవముతోడ్తో కాంచి సుల్తాను పి
ల్పున కృష్ణానది దాటియా, మెదకు, బల్ దుర్గంబు క్రిందన్ జిరం
తనమౌ బిక్కనవోలునుండెనవి యాత్మస్థాన రాజంబుగన్."

ఈ సంఘటన ఇబ్రహీం తర్వాతివాడగు మహమ్మద్ ఖుతుబుషా కాలంలో అనగా 1612 క్రీ శ.లోని మాట. ఆ మహమ్మద్ ఖుతుబుషా దోమకొండ పూర్వ ప్రభువులను చాలా గౌరవించెను.

''భవ్య సులతాను మహమదు పాదుషాహా
లబ్ధ భూషణ లలిత పల్యంకికాత
పత్ర చామర సామ్రాజ్య భరిత విభవ
రమ్య గుణశాలి శ్రీ కామరడ్డి మౌళి."

రాజా మల్లారెడ్డి గొప్ప కవి. సంస్కృతాంధ్రములందు అద్వితీయ పాండితీ ప్రతిభను తన కవనమందు ప్రకాశింపజేసినాడు. అతడొక చాటువులో తాను ఖుతుబుషా ప్రభువుల కాస్థాన కవినని చెప్పుకొనెను. మల్లారెడ్డి సమకాలికుడైన గణనాథ కవి యను నతడు గొప్ప "సత్కవి" యనియు, అతని తండ్రి పండిత వరేణ్యుడనియు మల్లారెడ్డి తన పద్మ పురాణములో వ్రాసినాడు. అట్టి గణనాథ కవి ఖుతుబుషా (అనగా 1617 లో) ఆస్థాన కవిగా నుండెననియు తెలిపియున్నాడు.

"ధీనిధి, సాహితీయుతు, ప్రతీతయశున్ కుతు పావనీశ్వరా
స్థాన మహాకవీంద్రు, నిజ దర్శన కౌతుక వైభవాగతున్

శ్రీ నరసింహ పండిత వరేణ్యకుమారు గణేశధీరు స
మ్మానముతో నెదుర్కొని నమస్కృతి జేసి వసింప జేయుచున్"

ఇట్టి "మహా కవీంద్రుడైన" గణనాథ కవిని గురించి మనకింతకంటే ఎక్కువగా తెలియకపోవుట సంతాపకరము. అతడు "కుతుపావనీశ్వరాస్థాన కవీంద్రుడు". కాని అతని గురించి మనమేమియు నెరుగజాలకున్నాము. మల్లారెడ్డి పుణ్యాన అతని పేరైన మనకు తెలిసినది. ఇదే మహమ్మద్ ఖుతుబుషా కాలములో గోలకొండ దుర్గములోనే సారంగుతమ్మయ అను గొప్ప కవియుండెను. అతడు సుల్తాన్ ఆశ్రయము కల్గినవాడేయని తానే తన పై జయంతీ విలాసములో ఇట్లు వ్రాసుకొనెను.

"ఇన సమతేజుతా నృపులనెల్ల మహమ్మదు షాహి యేలు నీ
యెనుబది నాల్గు దుర్గముల నేలిన యేలిక గోలకొండ, త
ద్ఘన నగరస్థలిన్ కరణికంబొనరించెడు తమ్మమంత్రి, యా
జనపతి రమ్ము పొమ్మన ప్రజల్ జయవెట్ట గృహస్థు తాననన్"

గోలకొండ నగరానికి సారంగుతమ్మయ్య కరణము కావున పాదుషా కీతనితో పనిబడుచుండెను. అట్లున్నను తమ్మయ్య తన దైవభక్తిచే తన కావ్యాన్ని శ్రీరామార్పణము చేసెను.

కందుకూరి రుద్రకవి వంశములో చాలామంది రుద్రకవి నాములుండిరని అందొక రుద్రకవి మల్కిభరాము (ఖుతుబుషా)చే 1480 శా.శ.లో రెంట చింతల పాలెము అను నగ్రహారమును పొందెననియు వంగూరు సుబ్బారావుగారు శతక కవుల చరిత్రలో వ్రాసినారు. శ్రీ వంగూరి సుబ్బారావుగారు అదే చరిత్రలో మరొక చోట నిట్లు వ్రాసినారు -

ఏనుగు పెద లక్ష్మణ కవి తన తుల్యా మాహాత్మ్యములో తన కృతిపతియగు వత్సవాయి తిమ్మరాజు పుత్రుడగు రాయ జగపతిరాజును గూర్చి యిట్లు వ్రాసెను.

"సుల్తానబ్దుల్ హసన్ కోటీశ్వరుని చేత మాటిమాటికి బహుమానమందె మరియు పింగలి మాదన్న ఖానుజీ మంత్రజ్ఞువలన సన్మానమందె అక్కన్న మొదలైన యట్టి పెద్దలచేత మేలు భూషణములు మెప్పులందె"

అక్కన్న మాదన్నలు సేవించినది అబ్దుల్ హసన్ పాదుషాను కాదు. వారు సేవించినది అబుల్ హసన్ తానీషాను. దీనిని బట్టి కుతుబుషాల సామంతులును తెనుగును బాగుగా పోషించినట్లు నిదర్శనములు కనబడుచున్నవి.

కంచెర్ల గోపన్న అక్కన మాదన్నల మేనల్లుడని ప్రతీతి. భద్రాచల ప్రాంత మందలి నేలకొండపల్లి గ్రామనివాసి. అతడే ప్రసిద్ధ రామదాసు. అతడు గొప్ప కవి. రామభక్తుడు. భద్రాచల తహసీల్దారుగా నియుక్తుడై వసూలైన పన్నును దేవాలయానికి వినియోగించి బందీకృతుడయ్యెను.

అబుల్ హసన్ తానీషాకు మంత్రి అక్కన్న. అతడే ఈ దక్కన్ రాజ్యములోని తుది ఆంధ్ర మంత్రి. నాటి నేటివరకు మరల ఆంధ్రులు తలయెత్తలేదు. అక్కన్న మాదన్నలు తెనాలి రామలింగడు అను కమసాలి వ్రాసిన ధీరజనమనో విరాజితము అను తెనుగు కృతికి కృతిపతులైరి. ఆ గ్రంథ మందలి మొదటి రెండు పద్యాలిట్లున్నవి.

శ్రీరమ్యార్థి కళావతంస పద రాజీవార్చనా సక్తులు
ర్వీరామాధిప కార్య సంఘటన ప్రావీణ్యాధి కారుల్ మహా
పారావార గభీరు లాశ్రిత జన వ్రాతావనుల్ సంతతో
దారుల్ యక్కన మాదనా హ్వయులు తత్త్వజ్ఞాన సంపూర్ణులై

అందనుజన్ముడు మాదన

చందన మందార కీర్తి సంశోభితుడై పొందున నగ్రజుతో నిం
పొందగ తగురీతి పల్కెనురు వాక్యములన్

ఈ విధముగా మనకు కుతుబుషా కాలములో సుల్తానుల ఆదరములో వెల సిన ఆంధ్ర కృతులను గురించి కొంతవరకు తెలియ వచ్చినది. ఇబ్రహీం కాలము

నుండి తానీషా కాలమువరకును గోలకొండ నేలిన సుల్తానులు తెలుగువారిని ఆదరించిరి. తెనుగుభాషను పోషించి, తెనుగు స్త్రీలను పెండ్లాడిరి. తెనుగు స్త్రీలలో ఉంపుడుగత్తెల నుంచుకొనిరి. వారిలో భాగ్యమతి, ప్రేమావతి, తారామతి అనువారు ప్రసిద్ధులు. భాగీరథి అను స్త్రీ ఒక సుల్తాను పట్టపు భార్యయై యుండెను.

కుతుబ్షాకాలమునకు ముందు దేశభాషలపై ముసల్మాను ప్రభువుల కాదరణ లేకుండెను. వారి తరువాత ఏర్పడిన ఆసఫ్‌జాహి వంశము వారును "ముల్కీ" భాషలకు ఏ మాత్రమును ప్రోత్సాహమును కలిగించిన వారుకారు. తెనుగు మంత్రులు, తెనుగు సుబేదారులు, తెనుగు సేనానులు కూడా కుతుబ్షాల అనంతరము ఎక్కడ కూడా లేకపోయిరి. ఇప్పుడు నిజాము రాష్ట్రములోని విద్యావిధానములో తెనుగు దిక్కులేనిదై క్షయమందుచున్నది. ఇది పూర్వాపర సంబంధములతో పరికించిన కుతుబుషాలకు ఈ విషయములో ధన్యవాదములు సమర్పించుకొనుట కృతజ్ఞతా విధియై యున్నది.

# తెనుగు వాఙ్మయంలో హాస్యరసము

నవరసములలో హాస్యరస మొకటి యని భరతుని కాలమునుండియు ఆ అలంకారికులందరున్నూ అంగీకరించినారు. హాస్యమన నేమియో అందరెఱుగుదురు.

"సచ వికృతపరవేషాలంకార ధార్ష్ట్య లౌల్య కుహకాసత్ప్రలాప వ్యంగ్య దర్శన దోషోదాహరణాది భిర్విభావైరుత్పద్యతే" అది ఆరు విధాలు. 1. స్మితం, 2. హసితం, 3. విహసితం, 4. ఉపహసితం, 5. అపహసితం, 6. అతిహసితం అని ఇతరులను అనుసరించుట, వికృతముగా నాచరించుట, వ్యంగ్యముగా సంభాషించుట, పరదోషముల హేళనము చేయుట ఇట్టివన్నియు హాస్యమనబడును.

సంస్కృత వాఙ్మయములోనే హాస్యరసము తక్కువ. అది కావ్యాలలో పరిశోధించితే కాని కనబడదు. నాటకాలలో హాస్యానికిగాను విదూషకుని ప్రత్యేకముగా సృష్టించిరి. కాని వాడెల్లప్పుడును తిండిపోతు బాపడై యుండెను భాణములలో హాస్యమును ప్రధానముగా పోషించదలచిరి. కాని యదంతయు పచ్చి బూతుల పంచాంగముగా పరిణమించెను. చాటువులలోను బూతులను వదలితే మిగిలిన హాస్యము తక్కువే.

ఇదే మర్యాద తెనుగునకునూ వర్తించునని స్థూలముగా చెప్పవచ్చును. తెనుగు ప్రబంధాలలోను పురాణాలలోను హాస్యము చాలా తక్కువ. నాటకాలు నిన్న మొన్నటివరకు లేకపోయెను. వాటికి బదులుకా శతకాలు వ్రాసిరి. అందులో కొన్నిటియందు హాస్యరసము కనబడుచున్నది. చాటువులలోనే యెక్కువగా హాస్యరసము నిండియున్నది.

హాస్యానికి తెనుగువారు ప్రసిద్ధి. తెనాలి రామలింగడు జగద్విఖ్యాతుడు. మర్యాద రామన్న కూడా తెనుగువాడేమో? అక్బరు చక్రవర్తి విదూషకుడై యుండిన వీరబలుడు (బీర్బల్) గోదావరీ డెల్టాలో పుట్టి పెరిగిన తెనుగువాడని చాలా మందికి తెలియనే తెలియదు. ఇట్లుండినను తెలుగు సాహిత్యములో హాస్యరసము

విరివిగా కానరాకుండుట యెందులకు? పలువురు తెనుగు విద్వాంసులు హాస్యమంటే పచ్చి శృంగారమని భాణములను చూచి భ్రమపడిరి. అందుచేతనే తెనుగు సాహిత్యములో శృంగారాతిశయ వర్ణనలందును, జుగుప్సా వర్ణనలందును హాస్యమును సాధింపజూచినారు.

శతక వాఙ్మయములో హాస్యము కొంతవరకు కనబడుచున్నది. చంద్రశేఖర శతకము ముఖ్యముగ పేర్కొనదగినది. కాని దాని కర్త యెవరో తెలియదు. భాష నెల్లూరి యాస. రామలింగేశ శతకములోను, కుక్కుటేశ్వర శతకములోను కొన్ని మంచి భాగాలు కలవు. వేణుగోపాల శతకము బాగున్నది. కాని తత్కర్త తిట్టనిది నవ్వింపలేడు. కవి చౌడప్ప సరేసరి. పుస్తకమంతా బూతుల బుంగయే. భాషీయ దండకము 200 ఏండ్ల నాటిది. కర్నూలు జిల్లా భాష అందు కలదు. అది బాగానే యున్నది.

ఇక పురాణ ప్రబంధాలను గురించి విచారింతము పురాణాలు సంస్కృతము నుండి పరివర్తనము చేయబడినట్టి ఇతిహాసాదికములు. అందు హాస్య రసమునకు తావులేదు. ఆయినను మన తెనుగు భారతములో అందందు మూలములో లేనట్టి హాస్య రసమును తిక్కన సోమయాజిగారు పోషించినారు. కీచకుని చంపుటకై ద్రౌపదికి మారుగా నర్తనశాలలో చీకటిలో భీముడు కాచుకొని యున్నాడు. కీచకుడు కామావేశముతో ద్రౌపదియే అందు కలదని తన కామ వికారమును ప్రకటించుకొనును. అప్పుడు భీముడిట్లనును.

ఇట్టివాడవు కావున నీవు నిన్ను
బొగడికొనదగు నకట నా పోల్కియాడు
దాని వెదకియు నెయ్యడనైన నీకు
బడయ వచ్చునె యెఱుగక పలికితిట్లు.

నా యొడలు సేర్చి నప్పుడ
నీ యొడ లెట్లగునొ దాని నీ వెరిగెదు న
న్నే యబలల తోడిదిగా
జేయదలంచితివి తప్పు సేసితి గంటే.

నను ముట్టి నీవు వెండియు
వనితల సంగతికి బోవు వాడవె యైనం
దను వేఁ జడసిన ఫలమే
కని యెద విదె చిత్తభవ వికారములెల్లన్.

కీచకుని దౌర్జన్యమును విరాటుని సభలో ద్రౌపతి చెప్పుకొనినను ఎవ్వరున్నూ వినలేదు. ధర్మరాజు ఆమెతో నీవేమి నాట్య కత్తెవా? ఇకపో అని మందలింపగా ద్రౌపది సర్మోక్తిగా నిట్లు పలికెను.

"నాదు వల్లభుండు నటుడింత నిక్కంబు
పెద్దవారి యట్ల పిన్న వారు
గాన పతుల విధమకాక యేశైలూషి
గాననంగ రాదు కంకభట్ట.

అట్లగుటం జేసి నాకు నాట్యంబులునుం బరిచి తంబ, మత్పతిశైలూషుండ కాడు, కితవుఁడునుం గావున జూదరియాలికి గరువతనం బెక్కుడిది".

ఇదంతయూ గూడ మూలములో లేనట్టిది. శ్రీకృష్ణరాయభారమప్పుడు కృష్ణుడు భీమునితో సరసమాడుట, ద్రోణుని భీముడాక్షేపించుట, కర్ణుడు భీముని నిందించుట, ఇట్టి ఘట్టములు భారతములో పలుతావుల కాననగును. నాచన సోముఁడు ఊర్వశీ నరకాసురుల సంభాషణమందును, హంస డింభకోపాఖ్యాన మందును హాస్యరసమును చాలా యుత్కృష్టముగా పోషించినాడు. తెనాలి రామకృష్ణుని నిగమ శర్మోపాఖ్యానములో హాస్యపుజాడ కానవచ్చును. గౌరన తన హరిశ్చంద్రలో కాల కౌశికుడు, వీరబాహువు, నక్షత్రకుడు అను పాత్రల పోషించు నప్పుడు హాస్యమును ప్రదర్శించినాడు. హరిశ్చంద్రుని వీరబాహు విట్లు వెక్కిరించెను.

"............... ఈ రాజు
సుకవాసి, పని పంద, చూపు గుజ్జంబు
మామిడి క్రింది సోమరి, మేదకుండు
బూమె తుంటరి, ఎనుబోతుపైన వాన,
మొండరి, చల్లచప్పుడు, గోడ చేర్పు
చండిపోతను నట్టి జాడనున్నాడు —

ఇట్టి శబ్ద చిత్రములు కొంతవఱకు పాలకుర్కి సోమనాథునిలో కూడ కనబడు చున్నవి. చేమకూర వెంకటకవి రెండు కావ్యాలలోను కొంతవరకు హాస్యము స్ఫురించు చున్నది. కదిరీపతి తన శుక సప్తతిలో తేలికయగు హాస్యమును గ్రంథమంతటను నింపియుండుటచేత దానికి తెనుగు సాహిత్యములో ఒక విశిష్టత యేర్పడుచున్నది. రంకు కథలు కాకుండినచో శుకసప్తతి తెనుగు వాఙ్మయములో అగ్రస్థానము వహించి యుండెడిది. శ్రీనాథునిలో అందందు హాస్యము కానవచ్చును. కాని విశేష భాగము పచ్చి శృంగారమే. బువ్వపు బంతి మున్నగు శృంగార నైషధ ఘట్టము లట్టివే, వల్లభరాయని క్రీడాభిరామములోను ఇదే అవస్థ, కోళ్ళ పందెములోను, పొట్టేళ్ళ పందెములోను చచ్చినవాటికై కవి విలపించి శ్రోతల నవ్వించిన భాగాలు అందముగా నున్నవి.

జగ్గకవి తన చంద్రరేఖా విలాపమును హాస్యరస ప్రబంధరాజము అని వర్ణించుకొనెను. కాని గ్రంథమంతయు పచ్చిబూతులతో నిండినది,

నీతులకేమి యొకించుక
బూతాడక దొరకునవ్వు పుట్టదు ధరలో

అన్న కవిచౌడప్ప ఇతని కాదర్శకవిగా కనబడుచున్నాడు. కాని

పదినీతులు పదిబూతులు
పది శృంగారములు గల్గు పద్యములు

చౌడప్ప వ్రాసెను. ఇందునీతులే లేవు. అందుచేత అచ్చన బుచ్చనలోపల అచ్చనయే మేలు అన్నట్లు చౌడప్పయే మేలు రకమువాడు.

ఇక మరొక్కని గూర్చి ప్రశంసింపవలసి యున్నది. అతడు వేమన. అతని పద్యాలలో నీతులును, హాస్యమున్నూ మేళవించి యున్నవి. అతని పద్యాలలోనూ కొన్ని బూతుపద్యాలు ఉన్నవి. అట్టివి అతని పేరుతో స్వార్థులు రచించి నట్లున్నది. చాటువులలో మంచి హాస్యమున్నది. హాస్యరసమును గ్రోలదలచిన వారు చాటువులను చదువవలయును కొన్ని యుదహరింతును —

లంక పొగాకును తెచ్చియు
పొంకముగా సున్నమేసి పొడిచేసిరయా
పంకజనాభుడు నూరెను
శంకరుడది పీల్చిపీల్చి శాభాస్ అనియెన్॥,

మంచిదినమునాడు మంగలి దొరకక
చంద్రశేఖరుండు జడలు దాల్చె
కొండియేమొ కట్టె గోపాల దేవుండు
బ్రహ్మదేవుడెన్ని పాట్లు పడెనొ!

శివుడద్రిని శయనించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపై
పవళించుట నల్లిబాధపడలేక సుమీ.॥

చాకివానిచేత జగడాలు పడలేక
సిరిగలాడు పట్టుచీరకట్టె
శివుడు తోలుకప్పె సీ! యని మదిరోసి
భైరవుండు చీర పారవైచె.

అన్యాదేశ పదములను చేర్చి చమత్కరించుట ఒక హాస్యము. హైద్రాబాదు అగ్రహారికుడు తన అగ్రహారస్థితిని జంగలాత్ అధికారికి తౌరక్యాంధ్ర సంస్కృత భాషల సమ్మేళనముతో కూడిన శ్లోకాలతో ఇట్లు మనవి చేసుకొనెను.

ఫలంలేదు మజ్కూర్ కలం బందుహోల్ సాల్
అలంమోదగాకుల్ క్వచిత్ చేకుమాకుల్
అవుర్ కోయ కొంపల్ మరీమాల కొంపల్
హయేముళ్ళ కంపల్ హమారే గ్రహారే.

తుమారా జవానుల్ హమారే గ్రహారే
కదాపీహిదంగా సజా చేయకుండన్
హుకుందీయతాం నౌహకం చాపిదద్యాత్
ఖుదాతే ముదేస్తాత్ సదాజంగలేశ॥

ఆధునిక వాఙ్మయములో వచనములోను నాటకాలలోను హాస్యరసమును ప్రధానముగ పోషించినవారు పలువురు కలరు. వీరేశలింగంగారి ప్రహసనాలు సాధారణమైనవే. చిలకమర్తివారు తమవి ప్రహసనాలని చెప్పినందున తెలియవచ్చినవి. పానుగంటి వారి సాక్షి ఒక భాగము చదివితే వారి రచనలన్నీ చదివినట్లే. బారిష్టర్ పార్వతీశం ఉత్తమోత్తమ హాస్యరస గ్రంథరాజము. కాని అది నేటికి అసంపూర్తిగానే ఉన్నది మునిమాణిక్యంగారొక్కరే గృహజీవనమును లలిత హాస్యముతో వర్ణించినారు. వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయము అద్భుత హాస్యరస ప్రపూరితము. ధర్మవరం కృష్ణమాచార్యులు అందందు హాస్యరంగములను రచించిరి. ఇటీవల మల్లాది అవధానిగారు హాస్యరచనల రచించిరి. కాని తల్లితో వసంత మాడినట్లు వారు గుడిపాటివారివలె పురాణ పురుషులను అవహేళనము చేయజూచిరి. భమిడిపాటి కామేశ్వరరావుగారి రచనలలో హాస్యమున్నది. వ్యావహారిక భాషా మకుటమగు కన్యాశుల్కాన్ని ఎవరున్నూ మరువకూడదు - కాని ఇంగ్లీషు డొక్కశుద్ధి కలవారేదాన్ని ఆనందించగలుగుతారు. గిరీశాన్ని, పేరిగానిని, యెంకిని, కాంతమ్మను, జంఘాలశాస్త్రిని, పార్వతీశాన్ని, కిన్నెరసానిని సృష్టించి ఆంధ్రులను ఆనందసాగర తరంగములపై ఓలలాడించిన కవి కుమారులు అపారమగు భాషాసేవ చేసినట్టి సిద్ధహస్తులు; అయినను ఆధునికాంధ్ర వాఙ్మయములో హాస్యరము ఇంకా ప్రారంభదశలోనే యున్నదని చెప్పవలెను.

# బాల వాఙ్మయం

నేడు అన్ని దేశములలో బాల వాఙ్మయమునకు ప్రాధాన్య మియ్యబడు తున్నది. 'బాల వాఙ్మయమే దేశాభివృద్ధికి పునాది' అని గ్రహించినారు. కొన్ని దేశములీవిషయమున చాలా వెనుకబడి యున్నవి. అట్టి దేశాలలో మన ఇండియా చేరినదనవలెను.

ప్రాచీనకాలములో హిందువులు, బౌద్ధులు బాల వాఙ్మయముపై కృషి బాగా చేసినట్లు కానవస్తున్నది. పిల్లలకు ముఖ్యమైనవి కథలు, బొమ్మలు. బొమ్మలతో కథలు చూపించి నిరూపించుట అత్యంత శ్రేష్టమగు పద్ధతి. మన ప్రాచీన శిల్ప ములన్నియు ఈ విధానమునకు తోడ్పడుచుండిన ప్రతి దేవతా స్థానములో స్తంభ ముల మీద, గోడల మీద, కప్పుపైన, గోపురములలోన పౌరాణిక కథలు బొమ్మ లుగా చెక్కబడు చుండెను. కొన్ని తావులలో రంగులతో చిత్రింపబడు చుండిన చదువురాని వారు సహితము ఆ బొమ్మలను చూచి ఇవి బౌద్ధుల కథలు, ఇవి కృష్ణ లీలలు, ఇవి పాండవుల కథలు, ఇవి రామాయణ ఘట్టములు అని ఒకరికొకరు చూపుకొని, చెప్పుకొని ఆనందించెడి వారు. బౌద్ధ మత వ్యాప్తి కాలములో బౌద్ధ జాతక కథలలో శిల్పములలో నిరూపించిరి. అజంతా, ఎల్లోరా, అమరావతి, మధురా, తంజావూరు, లేపాక్షి, శుచీంద్రము వంటి నూర్ల కొలది దేవస్థానములలో పౌరాణిక గాథలను శిలలపై చెక్కిరి; గచ్చుతో చేసిరి, చిత్రించిరి.

ఆంధ్ర కర్ణాటక దేశాలలో ''తోలు బొమ్మలాటలు'' అనునవి ఇంచుమించు 1000 ఏండ్ల నుండి ప్రచారములో నుండినట్లు మన కాధారాలు కానవస్తున్నవి. అంతకన్న పూర్వ మెప్పుడు ప్రారంభమయ్యెనో తెలియదు. తోలు బొమ్మల మూలాన కూడ పురాణ కథలను చక్కగా గ్రహించుచుండిరి.

మన పురాణాలలో జంతువుల కథలు, బాలుర కథలు బహు సుందరముగా వ్రాయబడినవి. ధృవచరిత్ర, ప్రహ్లాద చరిత్ర, చిరకారి చరిత్ర మొదలైన వానిని మన బాలురెందరెరుగుదురు. జంతువులు మాట్లాడినట్లు, మనష్యులవలె

వర్తించునట్లు నీతి కథలు వ్రాయుటకు ప్రారంభించినవారు హిందువులేనని ప్రాశ్చాత్య పరిశోధకులంగీకరిస్తూన్నారు. అట్టి కథలలో పంచతంత్రము జగద్విఖ్యాతి కాంచినది. దానిని ఇంచుమించు ప్రాశ్చాత్య భాషలన్నింటిలో అనువదించినారు. క్రీస్తుశకము ఆరవ శతకమందే దానిని పార్శిలోనికి "అన్వారస్సు హేలి" అను పేరుతో తర్జుమా చేసిరి. మన కరటకదమనకులే పార్శిలోని కలీలా దమాగ్‌లు. హితోపదేశము, బేతాళ పంచవింశతి, కథా సరిత్ సాగరము, దశకుమార చరిత్ర, సాలభంజిక కథలు, ఇట్టివి కొల్లలుగా మన దేశమందు రచించిరి. ప్రజలలో ఉండి పోయిన కథలు వేలో లక్షలో చెప్పజాలము. పిట్టమ్మా కాకమ్మ కథలు, అవ్వ కథలు విశేషమయ్యెను. అనగనగా ఒక ఊరు, ఒక రాజు అని ప్రారంభించి కథ కంచికి మనమింటికి అని ముగించుట దాక్షిణాత్యుల పరిపాటి.

"పిల్లల పాటలు" అను విభాగము కూడ మనలో సమృద్ధిగా నుండెను. ఆ పాటలలో పెద్దలు కూడ పేర్కొనదగిన విశేషము లిమిడియుండెను. ఏమో అర్థము కాని ప్రాసల మాటలను.................. ..........యర్థమే కానవస్తున్నది.

"కొంగ రాజు - కాలు విరిగే
దానికేమి మందు—
వెల్లుల్లిగడ్డ నూనెమ్మ బొడ్డు
నూటొక్క ధర

అనుదానిలో కాలు చేతులు విరిగినప్పుడు చేయవలసిన చికిత్స కలదు.

చెమ్మ చెక్క - చారడేసి బొక్క

అనువాటిలో మాచకమ్మలకు తగిన మందు తెలపబడినది. ఇటులే చాలా పాటలలో వైద్యపు చిట్కాలిమిడియున్నవి. ఈ వాఙ్మయ భాగము అనాదృతమై విస్మృతమైపోయినది. పునరుద్ధరణము జరుగుతున్నది.

ప్రాశ్చాత్య దేశములలో గ్రిమ్సు ఫెయిరీ కథలు, అండర్సన్ కథలు ప్రసిద్ధములు. ఇంగ్లీషులో ఛార్లస్ డిక్కన్స్ అను నతడు పిల్లల కథలను రమ్యముగా వ్రాసిన వారిలో ప్రథముడు.

అచ్చుయంత్రము లభివృద్ధిమై, ఫోటో బ్లాకులు చేయుట వృద్ధియైన తర్వాత పాశ్చాత్య దేశములలో పిల్లల వాఙ్మయము అపారముగా వృద్ధియయ్యెను. సచిత్రమైన చరిత్రలు భూగోళములు, కథలు, పాటలు, విశేషములు, విచిత్రములు మున్నగు విషయములు అతి సుందరముగా ఆకర్షణీయముగా అతి సులభభాషలో, అర్థమగునట్లు విజ్ఞానమును ప్రసాదించునట్లు రచించి ముద్రించిన గ్రంథములు వేలకొలదిగా పెరిగిపోయినవి. యూరపు, అమెరికా బాలురీవిషయములో ధన్యులైనారు. అందు పెద్ద నగరాలలో ప్రత్యేకముగా బాలుర గ్రంథాలయములు, బాలుర పత్రికలు కలవు. అనేక గ్రంథ ప్రకాశక సంస్థలు బయలుదేరి బాలురకు చరిత్ర, భూగోళము, ఖగోళము సైన్సులు, పరిశ్రమలు దేశదేశజనులు, వారి యాచార వ్యవహార విశేషములు, మున్నగు సహస్ర విషయములను తెలుపు ముచ్చటగు గ్రంథములను ప్రచురించారు.

మన పిల్లలకు చరిత్ర భూగోళ ఖగోళములన్న తలనొప్పికాని ఆ దేశాలలోని గ్రంథములను చూచిన వాటిపై అత్యంత ఆసక్తి ఆనందము జనించును. చరిత్ర తేదీల పంచాంగము కాదనియు భూగోళము పేరుల వరుసకాదనియు, స్పష్టమగును.

పట్టు, ప్రత్తి మున్నగునవి ఆదిలో ఏ దేశము వారు కనిపెట్టిరి? అవెట్లు సంఘమునకు పరికరించునట్లు చేసిరి. అన్న విషయాలు బొమ్మలతో చినచిన్న గ్రంథాలు రచించినారు. మన పట్టభద్రులు ముప్పాతిక మందికి తెలియని విషయాలు కూడ ఆ చిట్టి పొత్తములలో గోచరించును. మన దేశములో సాధారణమైనట్టి బత్తాయ, పప్పాయ, సపోటా వంటి ఫలములు, వేరుశనగవంటి నూనె గింజలు, మిరపవంటి ఘాటైనవి, పొగాకువంటి విషవస్తువులు, మన దేశములోనివి కావనియు అవి అమెరికావంటి దేశాలనుండి మన దేశములో 300 ఏండ్లనుండి ప్రవేశపెట్టబడినవని ఎందరెరుగుదురు. అట్టి సహస్రాధిక విషయాలను.......... సచిత్ర గ్రంథముల నుండి పాశ్చాత్య బాలురు గ్రహించగలుగుచున్నారు.

దీనినిబట్టి తేలిన విషయమేమనగా మనము ఆదిలో బాల వాఙ్మయానికి ప్రపంచానికి దారి చూపినవారము. తుదిలో పాశ్చాత్యుల నుండి మరల నూతనముగా గుణపాఠం నేర్చుకోవలసిన వారమైనాము. పాశ్చాత్య దేశములలో

నూటి కించుమించు నూరు మంది చదువుకొన్నవారు. మనము నూటికి 15 మందియే చదువుకొన్నవారము. కావున మన మొదటి పని నూటికి నూరు మంది విద్యావంతు లగునట్లు కృషిచేయుట పాశ్చాత్య దేశాలలో ధనికులు తమ ద్రవ్యమును విద్యాభి వృద్ధికై వినియోగింతురు. అమెరికాలో ఒక్క హెన్రీ కార్నెజీ అను కోటీశ్వరుడు 5000 గ్రంథాలయములకు భవనములు నిర్మించి వాటి నిండుగా గ్రంథములుంచి అవి చక్కగా నిరంతరాయముగా సాగునేర్పాట్లు చేసెను. అతడొక గ్రంథాలయము నకు మాత్రమే ఇంచుమించు ఏడుకోట్లు రూపాయలిచ్చెను. మన దేశములో ధనికులీవిధముగా సహాయము చేయుట కానరాదు. అందందు కొందరు కొన్ని లక్షలిచ్చినది అతిస్వల్పమగు సేవయే. మూడవది మన జనులలోని భావములు, రుచులు మారవలెను. మంచిదేది చెడ్డదేది గ్రహింపవలెను. ఈనాడు చెత్త-పత్రికల కెక్కువ ప్రచారమున్నది. మంచి పత్రికలు బిచ్చమెత్తుకొనుచున్నవి. సినిమా తారల మూడురంగుల బొమ్మలు చూచి తబ్బిబ్బై ఆనంద సాగరములో మునిగి ఉక్కిరిబిక్కిరియై ఆ చెత్తను కొనువారే బహుళము. వెర్రి మొర్రి కథలు, దొంగ కథలు వ్రాస్తే వాటికి ప్రచార మెక్కువ.

మన తెలుగులో ఈనాడు బాల, చందమామ వంటి పత్రికలున్నవి. వాటి అనుకరణలు బయలుదేరి అపచారమే చేయుచున్నవి. పై రెండు పత్రికలలో కూడా విజ్ఞాన ప్రదమైన విషయాలు తక్కువగా కానవస్తున్నవి.

విద్యాశాఖవారు బాల వాఙ్మయము సిద్ధము చేయించి సచిత్రముగా ప్రచు రించుటకు కొంత ధనము ప్రత్యేకించి దారిచూపవలెను. మన కేంద్ర ప్రభుత్వ మీ విషయమున శ్రద్ధకనబరచుచున్నది. కాని ద్రవ్యము మాత్రము ప్రత్యేకించి నట్లుగా కానరాదు. హైదరాబాదు ప్రభుత్వము కూడ కేంద్ర ప్రభుత్వాదేశముపై బాల వాఙ్మయ సమితి నేర్పాటుచేసినది. కాని యింతవరకా వాఙ్మయమునకై ఏమియు ద్రవ్యమును ప్రత్యేకించలేదు.

ఈ అనాదృత వాఙ్మయముపై విద్యావంతుల దృష్టి కేంద్రీకృతము కావలెను.

# గేయ వాఙ్మయము

## 16 మేహర్ 1346 గోలకొండ

### దేశికవిత :

పూర్వములో దేశికవిత ప్రాముఖ్యత వహించి యుండెను. కాని నన్నయ భట్టునుండి మార్గకవిత స్థిరపడిపోయి దేశికవిత పల్లెలలో పామర జనులలో దాగి పోయెను. మార్గకవిత సంస్కృత మర్యాదలతో రాజుల ఆస్థానములలో మురిసి పోయినది. దానిని పల్లెటూరివారు నేటివరకుకూడ ఆదరింపక శిష్టం మన్యులచే అనాదృతమైన ఆదేశి కవితకే ప్రాముఖ్యతనిచ్చిరి. ఈ దేశికవిత పల్లెటూరివారి పాటలలో నేటివరకును నిలిచియున్నది.

### అప్పకవి విభజన :

అప్పకవి కావ్యములను ద్వివిధములుగా — ప్రబంధములనియు, చాటు ప్రబంధములనియు—విభజించెను. చాటు ప్రబంధములు మరల రెండు విధము లట. (1) సంఖ్యా బద్ధములనియు, (2) అసంఖ్యా బద్ధములనియు. సంఖ్యా బద్ధములలో ఉదాహరణములు. ముక్తకాదులు చేరినవి. ఆసంఖ్యా బద్ధములో గద్య, రగడ, ద్విపద, దండకము, మంజరి చేరినవి. ఈ రెండవ భాగమందే గేయ వాఙ్మయ మిమిడియున్నది.

అప్పకవి ఛందస్సును విభజించుచు దానినికూడ రెండు భాగములు చేసెను.

> "పాద నియమంబుగల యట్టి పద్యసమితి
> వృత్తములు, జాతులను అన ద్వివిధమయ్యె
> నిట నిసర్గగణంబులు వృత్తములగు
> జాతులుపగణ మాత్రల జరుగుచుండు."

ఈ రెండింటిలో మన చర్చకు సంబంధించినది "జాతులు," ఈ జాతులు రెండు విధాలట.

జాతి - ఉపజాతి అని. అందు జాతిలో షడ్విధ కందములు, ఉత్సాహ, తరువోజ, అక్కరలు, మంజరి, ద్విపద, త్రిపద, చతుష్పద, పంచపది, షట్పద, నవవిధరగడలు, కళికలు చేరినవి. ఉపజాతిలో నవ విధ గీతములు. సప్తవిధ సీసములు చేరినవి.

అప్ప కవి తన ఛందోభాగములో లాలి, పెండ్లి పాట, శ్రీ ధవళము, సువ్వాలె, సువ్వి, యక్షగానము, అను పాటలకు ఛందస్సు నిచ్చి యున్నాడు.

## గేయ వాఙ్మయ నిరసనము :

పూర్వము సంస్కృతములో నారితేరిన పండితులు అచ్చ తెనుగు గూడిన పల్లె పాటలను నిరసించిరి. ఈ పల్లె పాటలు విశేషముగా ద్విపదలోను, రగడ లోను నుండెడివి. ఈ పాటలను "పదములు" అనియు వ్యవహరించుచుండిరి. శ్రీనాథుడు యొక చాటువున.

"ముది విటులు విధవ లంజలు
పద కవితలు మారు బాప జూపని వారల్."

అని పాటలను వ్రాయు కవులను పద దిట్టె నందురు.
మరియు వేణుగోపాల శతక కారుడు

"ద్విపద కావ్యంబు ముదిలంజ
దిడ్డి కంతి"

అని చెడ దిట్టెను.

అయినను శ్రీకృష్ణ దేవరాయల కాలములో సహితము కొందరు గొప్ప పండితులు ద్విపదలను, పదములను వ్రాసి సంస్కృత పండితుల చేత సహితము మెప్పొందిరి.

"చిన్నన్న ద్విపద కెరగును
బన్నుగ పెద తిరుమలయ్య పదమున కెరగున్
మిన్నంది మొరసె నర సిం
గన్న కవిత్వంబు పద్య గద్య శ్రేణిన్"

అని తెనాలి రామలింగడు చెప్పెను.

## పాటల వివరములు :

తెనుగు వారు పల్లెలలో పాడుకొను పాటలు నానా విధములై యున్నవి. వారి నిత్య జీవనముతో అవి సంబంధించినవై యున్నవి. అందు కొన్ని భేదములివి.

(1) ఏల పాటలు, (2) ఉయ్యాల పాటలు, (3) పెండ్లి పాటలు, (4) దసర పాటలు, (5) మేలుకొలుపులు, (6) ధవళాలు, (7) సువ్వాల (8) దంపుడు, విసురుడు పాటలు, (9) మోట పాటలు, (10) బిక్షగాండ్ల పాటలు (11) జంగం పాటలు, (12) తత్త్వాలు, (13) రాటము పాటలు, (14) వినోదాలు, (15) స్తోత్రాలు, (16) కోలన్న పాటలు, (17) రల్లు పాటలు మున్నగునవి.

## ద్విపదలు :

ద్విపదలను గురించి ముఖ్యముగా చెప్పవలసినదే మన పల్లె పాటలలో ముప్పాతిక భాగము ద్విపద వాఙ్మయమే. రాగభేదములచే ద్విపదను పది పదియేను విధములుగా పాడుకొన వీలున్నది. అదేవిధముగా నేటికిని జనులు పాడుకొను చున్నారు. ఎట్లనగా :-

(1) దసరా పాటలు.

"శ్రీగణాధీశాయ శివకుమారాయ"

ఇత్యాది చరణము లన్నియు ద్విపదలే.

(2) జంగం కథ అనబడు తందాన కథలు విశేషముగా ద్విపదలయొక్క రూపమే.

శ్రీనాథుని వంటివాడు "పల్నాటి వీరుల సుద్దులను" ద్విపదలో వ్రాసెను. ఈ సుద్దులన్నియు ద్విపదలో వ్రాసినవే. తాళ, లయ యుక్తముగా పూర్వము నుండియు పాడుచుండిన వనుటకు క్రీడాభిరామములోని ఈ పద్యమే నిదర్శనము.

ద్రుత తాళంబున వీర గుంఫిత
కథుం ధుం ధుం కటాత్కారసం.
గతి వాయించుచు నాంత రాళిక యతి
గ్రామాభి రామంబుగా

యతి గూడన్ ద్విపద ప్రబంధమున
వీరానీక ముంబాడె నొ
క్కత ప్రత్యేకముగా గుమారకులు
ఫీట్కా రంబునం దూలగన్.

బాలనాగమ్మ కథలో ప్రారంభమిట్లున్నది.

"కాశికి పడమట మున్నూ రామల
ఆ భూమికి ఒక చక్ర పట్నమేమి
పట్నము బేలు సహ భోజరాజా"

ఇదంతయు ద్విపదయే.

(3) రాటపు పాటలు కూడ ద్విపదలోనే యున్నట్లున్నవి. శుక సప్తతిలో రాటముల వర్ణించు కదిరీపతి యిట్లు వ్రాసెను.

"ప్రాయంపు పడుచుల పనిగొంటివే దూది"
"అనెడు తేనీయ పాట చినుకు లీన"

ఇందు ఉదాహృత మొదటి భాగము ఒక మాత్రా భేదముతో ద్విపదగా నున్నది.

(4) ధవళాలు, సువ్వాలలు అనునవి పల్లెలలో ముఖ్యముగా వివాహములలో పాడుకొనుచుందురు. కదిరీపతి కాలములో సహితమివి చాల ప్రాధాన్యత వహించి నట్లు కనబడుచున్నది.

"ఆ లలనా మణి కౌ గ
య్యాళి యొకా నొక్కవేళ నక్కర తోసు
వ్వాలున్ శోభనములు ధవళాలున్
మొదలైన పాట లందగనేర్పు"

అని తన శుకసప్తతిలో వర్ణించినాడు.

## మేలుకొలుపులు :

ఇది చాల మనోహరమైన గానము. నిన్న మొన్నటివరకు పల్లెటూరి బళ్లలో తెల్లవారు జాముననే బాలురు బళ్లలో

"తెల్లవారెను మేలుకొలుపులు
అల్లనల్లన వికసె కుముదము
.... .... .... .... .... ....
కృష్ణా మేలుకోరా........"

అని శ్రావ్యముగా భూపాళరాగయుక్తముగా పాడుచుండెడివారు. ఈ మేలుకొలుపుల ధాటిలోనే డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు "ఉమర్ ఖయ్యాము" నురచించినారు.

## శృంగారము :

నగరవాసులకు కృతకశృంగారము మెండు. పల్లెటూరివారిది నిజమైన శృంగారము. పూర్వము వ్రాసిన శృంగార గేయములలో ముఖ్యమైనది. "క్షేత్రయ్య పదములు" ఇవి క్షేత్రయ్యకవిచే తంజావూరి రఘునాథరాయల కాలములో రచింపబడిన పాటలు. ఇప్పుడు కొన్ని పాటలు ముద్రితములు. "సారంగపాణి పదములు" అనునవి కూడ చాల వ్యాప్తిలో నున్నవి. నావద్ద నున్న ప్రతి 1899 క్రీ. శ. బరూరు త్యాగరాయ శాస్త్రిలవారి కంపెనీలో ముద్రితమైనట్టిది. ఈ పదములను నాలుగు భాగములుగా విభజించినారు. అందొక భాగముతో గ్రామ్య భాషలో పాటలు కలవు. తెలంగాణాలో చాలా ప్రాంతములలో "చంద్రమ్మ-వెంకయ్య" పాటలు ప్రచారములో నున్నవి. కాని అవి పామరులలో బడిమార్పులు చెంది బూతులతో నిండిపోయినవి.

## యక్షగానాలు - తోలుబొమ్మలు :

ఈ వాఙ్మయమును గురించి తందాన కథవలె ప్రత్యేకముగా చెప్పవలసి యుండును. యక్షగానాలు పూర్వములో గొప్పగొప్ప కవులచేత వ్రాయబడెను. అప్పకవి, కంకంటి పాపరాజువంటి గొప్ప కవులు యక్షగానాలు వ్రాసిరి. అయినను మనము చూచునట్టి యక్షగానాలలోను, విశేషించి తోలుబొమ్మల పాటల లోను, ప్రదర్శనములలోను తుచ్ఛ శృంగారము, బూతులు కనబడుచున్నవి.

**తత్వాలు :**

పాటలలో తత్వాలు విశేషముగా ఇమిడియున్నవి. తెనుగువారిలో చాలా తత్వాలు రచించి అనేక శిష్యులను ఆకర్షించిన గురువులు చాలమంది కలరు. అందు పేర్కొనదగిన వారెవరనగా :—

(1) పోతులూరి వీరబ్రహ్మం - వీరు కర్నూలు ప్రాంతము వారుగా కనిపింతురు. వీరు గొప్ప సంఘ సంస్కారులు.

ఏకులమని నన్నెవరడిగిన
నేమని తెల్పుదు నీ లోకులకూ
పలుగాకులకూ - దుష్టాత్ములకూ

అని కులాలను తిరస్కరించిన మహానుభావులు.

(2) దూదేకుల సిద్దప్ప - (పింజారి) మెదకు మండలవాసుడేమో.

(3) ఏ గంటప్ప - పోతులూరివారి తర్వాత దేశమంతటను ఖ్యాతిగాంచినవాడు.

(4) తోట గజేంద్రకవి – వైష్ణవ మతప్రచారకుడు. ఇతని గురించి మద్రాసు "కళ" పత్రికలో పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిలవారు వ్రాసియుండిరి. పాటలు మనోహరముగా నుండును.

"పుట్టుట యెల్లను గిట్టుట కొరకే
పుణ్యమేమి రా దొరన్నా !
చావక పుట్టుట జన్మదేశమున
జరుగుచు నుండుర వోరన్నా !

ఈ ప్రకారముగా బోధించినాడు.

(5) అనిమ పాపయ్య, (6) జ్ఞాన బ్రహ్మానందయోగి, (7) వీరలింగ గురులు, (8) కంబగిరి, (9) ఇంద్రపీఠ భీమన్న, (10) వరనారాయణదాసు,

(11) ఆదికేశవులు, (12) చిత్తూరు నరసింహదాసు, (13) పరశురామ నరసింహదాసు, (14) వీరస్వామి, (15) మహమ్మదు హుసేను.

ఈ మహమ్మదు హుసేను శైలి కుదాహరణము.

"ఒకటి మొదలూ వృక్షము
లెక్కకు మిక్కిలి కొమ్మలురా
ఎక్కి చూచితే ఎంతో పొడవునా
కాశమంటినదిరా
రెండు త్రోవలూ కూడిన చోట
రేపు ఒక్కటేరా
రెండు రేకులా పద్మములోపలి
అఖండ తేజమురా''

(16) బాలకృష్ణదాసు, (17) శివయోగీంద్రులు, (18) తరికొండ వెంకమ్మ, (19) అంగప్ప, (20) చండూతు చెన్నుదాసు, (21) పోకల శేషాచలం, (22) నాసిర్ మహమ్మద్ ఇతని శైలి కుదాహరణము.

"మేలుకొనుమీ తత్పదంబున
మేలుకొను మీ త్వంపదంబున

మేలుకొని మీ అసిపదంబున
మేదినిలో వెలిసీ —

ఆత్మా — మేలుకొనవే.
వాదులాడుచు వారు వీరని
భేదముననే మోదమెరుగక
లేదు జననము లేదు మరణము
లేదు నీకెపుడూ - ఆత్మా,
చాలుపుష్పము మేలు కొమ్మని

గాలమార్యుల మూలమెరిగిన
ఫాల లోచనను విష్ణుకమలము
బోల జాలుదురే - ఆత్మా
ఇట్టియాత్మకు నిద్రమెలుకువ
పుట్టబోదని గుట్టుదెలిపిన
గురుడు గాలిబు కరుణనాసరు
గట్టిమాటలను - ఆత్మా

ఈ తత్వాల చర్చను ముగించుటకు పూర్వమింకొక్కరి విషయము చెప్ప వలసి యున్నది. రాయలసీమలోని సుప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమగు "కదిరి"లోని నృసింహస్వామిని పూర్వమొక హరిజనుడు దర్శింపగోరగా పూజారులు నిరాకరించి తలుపులు తాళమేసుకొని పోగా ఆ హరిజనుడు వీరావేశము పొంది యిట్లు పాడెనట.

"బేట్రాయి సామి దేవుడా
కదిరీ నరసింహరాయుడా
కాటామ రాయుడా
నన్నేలీనవాడ - బేట్రాయి"

ఈ ప్రకారముగా శ్రీ విష్ణువు యొక్క దశావతారములు వర్ణించి పాడెననియు తలుపులు విరిగిపడి దేవునిదర్శన మతనికి లభించెననియు జనులు చెప్పుకొందురు.

## వివిధములు :

పల్లెటూరివారు వినోదార్థము ఎన్నియో పాటలు పాడుకొందురు. అవన్నియు సమకూర్చుట చాల అవసరము.

''ధీరుడా జమదారుడా
మళ్లెన్నడొస్తవు నాయుడా''

అని యుల్లాసమును ప్రకటించిన పాటలు

"బండిరా పొగ బండిరా
దొరలెక్కు రైలుబండిరా
వంగిదండం పెట్టువరకు
మంగపట్నం చేరెరా"

అని రైళ్లను గురించిన పాటలును

"దిగు దిగురా నాగా
దివ్యసుందరి నాగా"

అనునట్టి పాటలును "పెరుమాళ్ల చిన్నని"

పాటలు "బాలబాలికల" పాటలు ఇంకను నిట్టివి వేనవేలు. జానపదులలో నిలిచియున్నవి. భావకవులమని చెప్పుకొనువారు భాషాసేవ చేయదలచిన ఈఅనాదృతమైన వాఙ్మయమును పునరుద్ధరించి సంస్కరించి ఉన్నత స్థానమలంకరింప జేతురుగాక.

# పల్లె పదాలు

## 1

నన్నయభట్టు కాలమునుండియు ఆంధ్రులు సంస్కృత ప్రాబంధిక కవితా పద్ధతికే ప్రాధాన్యత నిచ్చిరి. నన్నెచోడుడు తన కుమార సంభవములో నిట్లు వ్రాసెను.

"మును మార్గ కవిత లోకం
బున వెలయగ దేశికవితబుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బున జనజాళుక్య రాజు మొదలుగ పలువుర్."

అనగా చాళుక్య రాజుల కాలములో (మార్గ కవిత) సంస్కృత కవితా పద్ధతి దేశాన్ని ముంచివేసిందట, అప్పటికే (దేశి కవిత) సంస్కృత మర్యాదకు భిన్నమైన తెనుగు కవిత్వము ప్రచారములో నుండినది. మరల అట్టి దానినే చాళుక్యుల తర్వాత శివకవులు తెలుగుదనాన్ని నిలబెట్టే ప్రయత్నంచేసి పుణ్యం కట్టుకున్నారు. బసవ పురాణములో పాల్కురికి సోమనాధకవినాథుడిట్లు వ్రాసినాడు :

"ఉరుతర గద్యపద్యోక్తుల కంటె
సరసమై పరగిన జాను దెనుంగు
చర్చింపగా సర్వ సామాన్య మగుట
గూర్చెద ద్విపదలు కోర్కెదై వార
తెలుగు మాటలనంగ వలదు వేదముల
కొలదియ కాజూడుడిలనెట్టులనిన.

ఇదే సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో తన కాలమందుండిన నానావిధ పదములను (పాటల భేదములను) గురించి యిట్లు పేర్కొన్నాడు.

"మదినుబ్బి సంసార మాయాస్తవంబు
పదములు "తుమ్మెద పదముల్" "ప్రభాత
పదములు" "పర్వత పదము" "లానంద
పదములు" "శంకర పదముల్" "నివాళి
పదములు" "వాలేశు పదములు" "గొబ్బి
పదములు" "వెన్నెల పదములు" సెజ్జ
వర్ణన, మరి "గణ వర్ణన పదము"
ఆర్ణవ ఘోషణ ఘూర్ణిల్లుచుండ
బాడుచు నాడుచు పరమహర్షమున...."

జానుతెనుగులోనేమి విశేషము ? అనిన సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో మరలనిట్లు పల్కినాడు.

"ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన,
మానుగా సర్వసామాన్యంబుగామి,
జానుతెనుగు విశేషము ప్రసన్నతకు"

సోమనాథుడు పేర్కొన్న తుమ్మెదపదాలు, ప్రొద్దు పొడుపు పాటలు, నివాళిపాటలు, వాలేశు పాటలు, గొబ్బిళ్లు, వెన్నెలపాటలు ఇవన్ని యెందరికి తెలియును? ఇందులో చాల భాగము నశించినట్లేకదా?

తెనుగువారు సంస్కృత కవులననుసరింపబోయి అటు పూర్తిగా సంస్కృతాన్ని సాధించలేకపోయిరి. ఇటు తమ జాతీయతను పోగొట్టుకొనిరి. పైగా తమ స్వచ్ఛతను నిలబెట్టేదానికి ప్రయత్నం చేసిన మహానుభావులను బాగా వెక్కిరించినారు.

"ఇవేం పాటలోయ్, పిచ్చికుంట్లపాటలు, ముసలితనాన మిండరికమువలె మొగడు పోయిన పిదప జేసే లంజరికము వలెనే ఉందే" అని కొక్కిరించినాడట

శ్రీనాథకవి సార్వభౌముడు. అతని ఆసరాచూచుకొని వేణుగోపాల శతకం వ్రాసి నాతడు "ఇదేటి ద్విపదనోయ్. ముసలితనాన లంజరికం చేసేదాని సరసంగా ఉందే" అని వెక్కిరించినాడు. విజయనగర రాజులు, రెడ్డిరాజులు మరీ విజృంభించి పూర్తిగా దేశికవితను అణగద్రొక్కిరి.

ధనికులు కృతక లోకంలో సంచారం చేసినారు. బీదవారు దిక్కు లేక వెర్రిచూపులతో చూచినారు. పండితులు రాణివాసాల ముచ్చట్లు వ్రాసినారు. గిరికాదేవి, వరూధిని, యామినీ పూర్ణ తిలక వంటివారు విరహతాపాలు పొంది చిగురుటాకులు కలువలు తెప్పించుకొని వాటిపై పండుకున్నారు. ఉస్సురంచూ బుస కొట్టినారు. చంద్రుణ్ణి ఏడుతరాలటూ ఏడుతరాలిటూ ఎగదీసి దిగతీసి చెడ తిట్టి నారు. మన్మథుణ్ణి మరీ తూర్పారబట్టినారు. కోయిలలను ఒక చెట్టు మీదనైనా ఒక క్షణమైనా కూర్చోనిచ్చిన వారు కారు. ఇట్లు నానా భీభత్సపడినారు. చదువు రాని వారికి కీలకాలన్నీ తెలియక పోయెను. చంద్రమ్మ యెంకయ్యలు తమకు వచ్చినట్లు వినోదం చేసుకున్నారు. బుద్ధులు చెప్పేవారు లేనందున ఇచ్ఛావిహా రంగా ప్రవర్తించుకున్నారు. లేకపోతేనా చంద్రమ్మ ముందర గిరికాదేవి నాల్గు గిరాట్లు కొట్టి యుండేది. పామరజనులు తమకు తోచిన భావాలను దేశీయగానము లలో ద్విపదలలో రగడలలో పాడుకున్నారు. అవియే వారి కానందము కలిగించి వారి జీవితాలను తరింపజేసినవి. పల్లెటూరి వేదాంతులు తమకు తోచిన తత్వాలు పాడినారు. జనులు గుంపులు గుంపులుగా మూగినారు. వారికి దాసానుదాసులైనారు. పీఠాధిపతులు అప్పుడప్పుడు తమ ప్రాంతాలకు ఏనుగునెక్కి భేరీభాంకారములతో పంచమహాధ్వనులతో సకలాట్ట హాసములతో వచ్చేవారు. పెద్ద పెద్ద సిద్ధాంత చర్చలు చేస్తే పల్లెటూరివారు మనకేమి తెలుస్తుంది పదరా అని వెళ్ళిపొయ్యేవారు. ఉగాది దాటిందంటే జంగం కథవారు వచ్చి తాంబూరా ఢక్కా తీసుకొని తాండ్ర పాపారాయుని కథనో, బాలనాగమ్మకథనో, కాంభోజరాజుకథనో, స్థానిక వీరుల సుద్దులనో తందాన తాన లయ యుక్తముగా రాత్రుల్లంతా పాడినప్పుడు పిల్లలూ తల్లులూ ముసలివారు, కాపులూ, గొల్లలూ, మాలలూ, మాదిగలూ మున్నగు జాతుల వారంతా ముచ్చటగా వినిపొయ్యేవారు. బయలు నాటకాలో తోలుబొమ్మలో వస్తే మునిమాపే జనులు ఊరి ముందటి బయలంతా నిండిపోయి గొంగళ్ళను వేసుకొని ముచ్చటగా కూర్చునేవారు. ఈ విధంగా రాజాదరణ లేకున్నా పండితులు

నిరసించినా, కవులు వెక్కిరించినా, బీదజనులు మాత్రం తమ నిజమైన ''దేశి కవిత''ను పోషించుతూ వచ్చినారు.

"ఈ దేశికవితలో ఏమైనా పొగడదగిన విషయ ముందా ? ఎందుకింత ఆర్భాటం చేస్తారు. ఏదీ ! ఏమీ విశేషమో చూపించండీ" అని భాషా సనాతను లెవరైనా హుంకరించవచ్చును. మనవి చేసుకుంటాను వినండి. సవాలుకు సవాలు చేస్తే అదే మంచి జవాబు. "మీ ప్రాబంధిక కవిత్వంలో మీరేమి గొప్ప తనం చూపించుతారయ్యా" అని ప్రశ్న వేయుచున్నాను. ఎంత సేపు చెప్పినా పంచ కావ్యాల మాటే. అందు అస్వాభావికము, కృతకము ఎంత కలదో చెప్పండి. పదాడంబరము కవిత్వమేనా ? నోరుబట్టని సంస్కృత దీర్ఘసమాసాలు తెనుగేనా ? వర్ణనలన్నీ సహజమేనా? కథలలో నవ్యతయున్నదా? లేక "ఉండంగా ఉండంగా ఒక రాజుండె, ఆయన వేటకు పోయెను, ఒక సుందరాంగిని చూచెను. మన్మథుడు నాయికా నాయకులపై బాణాలు వేసెను. ఇద్దరున్నూ పొర్లి పొర్లి చచ్చే అంత విరహతాపం అనుభవించి, ఎట్లో భేటీ అయినారు. తర్వాత పెండ్లి, శోభనం, పుత్ర జననం, కథకంచికి మనమింటికి" ఇంతకు మించిందింకేమైనా ఉన్నదా ? కొన్ని ఉత్తమ గ్రంథాలున్నవి లెండి, అవి వ్రేళ్ళమీద లెక్కకు వచ్చేవిగా నున్నవి.

మరి తందాన కథలలో, పాటలలో, జానపదుల గేయాలలో, స్త్రీల పాటలలో నిజమైన కవిత ఉంది. ఉత్ప్రేక్షాతిశయోక్తులను, శాస్త్రోక్తముగా సరి చూచి వీరు వ్రాయించుకోలేదు. ద్వ్యర్థిత్ర్యర్థిచతుర్థి అను వ్యర్థములను గాని, చక్ర, నాగ, ఖడ్గాది బంధాలను గాని చెక్కించుకోలేదు. వీరి భాషను మనమింకా నేర్చుకోవలసి యున్నది. వీరి పాటలలో నిజమైన తెనుగు నుడికారమున్నది. సూటిగా మనకు తగిలే భావాలున్నాయి. వీరి కథలకు భాష్యకారులతో, పౌరాణికులతో, వ్యాఖ్యాన కర్తలతో అవసరము లేదు.

"అయితే వీటివలన నేమి లాభమయ్యా" అని ఒక గడ్డు పండితుడు నిల దీసి అడుగవచ్చును. మాటకు మాట. "మీ ప్రబంధాలవల్ల ఏమి లాభమయ్యా" అంతకంటే ఎక్కువ లాభకారి కాకున్నా అంతమాత్రమైన లాభకారి లెండి. ఏ జాతి తన పూర్వ సంస్కృతిని, తన జనుల విశ్వాసములను, భారత గాథలను, కథలను, పాటలను విస్మరించునో ఆ జాతికి నిష్కృతియే లేదు. పాశ్చాత్య దేశా

లలోను గత శతాబ్దములో (Folk Tales) జనుల కథలను, (Folk Songs) జనుల పాటలను, (Ballads) వీర గాథలను ఉదహరించినారు. ప్రాచీన మందు పాళిలో బౌద్ధజైనులు వ్రాసిన "జాతక కథలు" సంస్కృత మందు వ్రాసిన హితోపదేశ కథలు, భేతాళ పంచవింశతి, పంచతంత్ర కథలు, కథాసరిత్సాగరము ఇట్టి వాటిలోనెల్ల పిట్ట కథలు, నక్కబావ కథలు, పిల్లిమామ కథలు ఎందుకు వ్రాసినారు వారంతా పిచ్చి పుల్లయ్యలేనా మరి.

క్రీ.శ. 1703 లో స్కాట్లెండు దేశీయుడగు ఆండ్రూ ఫ్లెచ్చర్ అను దేశ భక్తుడు "ప్రతిజాతి యొక్క జానపదములు ఆ జాతి యొక్క శాసనాల కన్నను ముఖ్యమైనవి" అని సెలవిచ్చెను. మన తెనుగు వారిలోని జానపదులు చారిత్రిక గాథలు, శృంగారము, వేడుకలు, వినోదాలు, కష్ట సుఖాలు అన్నింటిని గేయ రూపములో పాడుకొంటూ వచ్చినారు. శోభనాలు, సువ్వాలలు, ధవళాలు, సుద్దులు ఇవన్నియూ గాన యుక్తములే. మోటకొట్టినా, కలుపు తీసినా, దంచినా, విసిరినా, బంతి తిప్పినా, చేల కోతలు కోసినా, పండుగలు పబ్బాలు చేసుకొన్నా, తుదకు శవాన్ని కాటికి తీసుకొనిపోయినా తదనుగుణ్యమైన గానములను చేసినారు. ఇవన్నియు నుద్ధరించినచో భాషకు గొప్ప అభివృద్ధి. కవితకు విజృంభణము, జన సామాన్య సముద్ధరణానికి సులభ మార్గము అలవడుతుంది.

# 2

పూర్వమందు తెనుగు దేశములో మార్గ కవిత, దేశికవిత యను రెండు విధాల కవిత్వముండినట్లు మనకు మొదటిసారి నన్నెచోడుని కుమార సంభవము ద్వారా తెలిసినట్లు చూపించియుంటిని. అయితే ఈ విభాగము తెనుగు కవులు చేసినదేనా లేక మరెందైనా ఇట్టి మర్యాద యుండెనా అని చూచిన ఇది అతి ప్రాచీనము నుండియు వర్తించినదని తెలియగలదు. ఆది కావ్యమగు వాల్మీకి రామాయణములోని బాలకాండలోని చతుర్థ సర్గలో కుశలవులు వాల్మీకిచే రచితమగు రామాయణమును శ్రీరాముని కాలములోనే వారి సన్నిధిలోనే గాన లయ యుక్తముగా పాడిరని తెలుపబడినది. ఎట్లన-

శ్లో. తతస్తు తౌ రామవచః ప్రచోదితా
వగాయతాం మార్గవిధాన సంపదా

సచాపిరామః పరిషద్గతశ్శనై
ర్బుభూషయాసక్తమనాబభూవ బాల-4 సర్గ శ్లో. 31.

అనగా శ్రీరాముల ప్రేరణచే ఆ లవకుశులు "మార్గము'' అనునట్టి పద్ధతితో గానము చేసిరి. రాముడును చాలా ఆనందించిన వాడయ్యెను. అని యర్థము. ఈ శ్లోకముపై వ్యాఖ్యాన కర్తలిట్లభిప్రాయమిచ్చినారు.

"మార్గ విధాన సంపదా దేశీమార్గశ్చేతి ద్వాగాన ప్రకారౌ
తత్రమార్గస్సార్వత్రికః దేశిక్వాచిత్కః
దేశవిశేష జైరపేక్ష్యేణ శాస్త్ర ప్రతిపాది
తో మార్గస్సార్వత్రికరాగ ప్రకారః
తయోర్మధ్యే మార్గ నిర్వాహ సామగ్ర్యాగాయతాం"

మార్గము, దేశి అను రెండు విధాలైన గానములుండెననియు, మార్గవిధాన గానము దేశమంతటను వ్యాపించినట్టి సార్వత్రికమైనట్టిదనియు, దేశ విధాన గానము కేవలము క్వాచిత్కమైనదనియు అనగా కొన్ని ప్రాంతాలలో నుండినట్టి దనియు వ్యాఖ్యాన కర్తలు తెలిపినారు. అనగా మార్గ గానము సంస్కృత భాషాయుక్తమనియు దేశిగానము, ప్రాంతీయ ప్రాకృతాది భాషలతో కూడినట్టి దనియు మన మర్థము చేసుకొనవచ్చును.

మొదటి వ్యాసము వ్రాసిన తర్వాత ఏప్రిల్ నెల మాడరన్ రెవ్యూ చూచితిని. అందు ''ఊర్మిళాదేవి నిద్ర'' అను తెనుగునాటి పాటను ఇంగ్లీషు ఛందస్సులో అనువదించి 5-6 పుటల పెద్ద వ్యాసాన్ని దేవేంద్ర సత్యార్థి అనువారు వ్రాసినది చూచితిని. నేనున్నూ ఎన్నెన్నో గ్రంథాలు చదివినానని గర్వించిన వాణ్ణికదా- మరి మాడరన్ రెవ్యూలో ఒక పంజాబీ పండితునిచేత శ్రమించి సంపాదించినట్టి తెనుగు దేశములోని ఆడువారు పాడుకొను పాట నింతవరకు చూడకపోతినే అని వెంటనే గ్రంథమెంతటిదో వెలయెంతనో తెలియక 6 అణాలు మనిషిచేతిలో బెట్టి గుజరీ పాతచ్చులో దొరకవచ్చును 'ఊర్మిళాదేవి నిద్ర' అనే పుస్తకాన్ని కొనుక్కురా అని పంపితిని. 8 పుటల గ్రంథమువెల ఒక అణా అందు ప్రారంభమిట్లున్నది.

శ్రీరామ భూపాలుడూ
పట్టాభి
షేకుడై కొలువుండగా
భరత శత్రుఘ్నులపుడా
సౌమిత్రి
వరుసకు సేవలు చేయగా

ఈ ధాటిపై కథంతా నడిచింది. ఇట్టివింకా చాలా కథలున్నవని విన్నాను. ఒకనాడు పని కల్పించుకొని పాతచ్చు పెద్దచ్చు పుస్తకాలవారి వద్దకు పోయి అవన్ని సేకరించుతానులెండి. అయితే చెప్పవచ్చినదేమంటే మన తెనుగు ఊర్మి ళను గౌరవింపకపోతిమి. ఇంగ్లీషులో కెక్కువరకు గౌరవము కలిగినది. చూచి నారా? ఇతర రాష్ట్రలవారు దేశికవిత నుద్ధరించుటకై యెంతకృషి చేయు చున్నారో?

పూర్వము మనదేశములో "కోలన్న" లేక "కోలాటము" అను వేడుక ఆటపాటలతో కూడినది. సాధారణముగా నుండెడిది. ఆడువారు కోలాటమును జడవలె త్రాళ్ళనల్లుట ఇప్పటి నాగరికులకు పరిచితమైంది. కాని పురుషులు 10-12 మంది కలిసి యెత్తులు అందెలు వేయుచు పాటలు పాడుచు కోలలు కొట్టుచు పండుగల వేళలలో వెన్నెలరాత్రులలో వినోదాలు చేసేవారు. సుమారు 200 ఏండ్లక్రిందటివాడగు గండ్లూరు నరసింహరాయ కవియను కర్నూలు మండలకవి తన భాషీయదండకములో ఒక స్త్రీచే నిట్లు పలికించినాడు. "నీవాడ కోలన్న వేస్తుండగా చూసి నాల్నుంటి నాకిట్లరా తాపమంటింది. (విరహతాపము కలిగింది)" ఇప్పుడు మన దేశికోలన్న మాయమగుచున్నాడు. పండరి భజనలు ఆస్థాన మాక్రమించుకున్నవి. ఈ క్రొత్తదానిలో మన పూర్వపుదానిలోని ధాటి, దర్జా, వీరత్వము కానరావు.

మన దేశములో జంగము కథలు. (తందాన కథలు) ఎన్నియున్నవి, విద్యావంతులమనుకొన్నవారు వాటిలో ఒకటిరెండైన ఎప్పుడైనా విన్నారా? మరి భావకవులమని చెప్పుకొనుచు ప్రబంధాలపేరు చెప్పితే తలనొప్పి కలిగిందని తల పట్టుకొనువారు, ఈ జంగము కథలలో పాట, భావము, చరిత్ర, వర్ణన, సులభశైలి,

అచ్చతెనుగు నుడికారము, అన్నియు నున్నవికదా. ఉద్ధరించే ప్రయత్న మేమైన చేసినారా? ఈ నిజాము రాష్ట్రములోనే వనపర్తి సంస్థాన పూర్వికులగు సవై వెంకటరెడ్డి, రాజారామేశ్వరరావు అను వీరుల కథలను చించోడివారి పూర్వికుల కథలను, గద్వాలవారిలో సోమనాద్రి కథను, పాపన్నవారి పూర్వికులలో రాణీ శంకరమ్మ, నరసింహారెడ్డి, సదాశివరెడ్డి కథలను తందానవారు తరతరాలనుండి చెప్పుచున్నారుకదా! పై సంస్థానాలవారు తమ పూర్వికుల యశోగానాలను సమకూర్చి సంస్కరించి, చారిత్రిక సమన్వయముతోను, ఇతరాధారములతోను కూడిన పీఠికతో ముద్రించరాదా? అదొక కష్టమా? నష్టమగు కార్యమా? నిజాం రాష్ట్రములో ఇంకను ఎన్నియో కథలు ఆదరము లేక కాలగర్భములో పడి మాయమగుచున్నవి. భాషా సేవ జేయదలచిన వానికి చేతి నిండుగా పనియే దొరుకును.

స్త్రీలకు విద్య యెందుకు? స్త్రీలను నమ్మరాదు; (పురుషులను మాత్రము నమ్మవచ్చునేమో, పాపము వారెంతటి మేదకులోయేమో) స్త్రీలకు చదువు వచ్చిన తంటాలు చేయుదురు అను భావాలు హిందువులలో విశేషముగా వ్యాపించిపోయెను. ఆ కారణముచేతనోయేమో స్త్రీలు ఊర్మిళాదేవి నిద్రవంటి పాటలపై అభిమానము కలవారైరి. పెండ్లి పేరంటములలోను, పండుగలలోను, స్త్రీలు నానా విధములగు పాటలను పాడుకొని కాలము వెళ్లబుచ్చుకొందురు. ఇప్పుడు ఆ సంతతివారు కూడ అరుదగుచున్నారు. ఆధునిక స్త్రీలకు పాతదంతయు మోటైపోవుచున్నది. తమ జాతీయ సంస్కృతిని విస్మరించుచున్నారు. కాని పాశ్చాత్య పద్ధతిలో అమితదుష్టములగు నాచారములే మనవారి కెక్కువగా పట్టుబడుచున్నవి. వృద్ధులైన స్త్రీలనుండి పాటలనన్నిటిని సేకరించి వ్రాసుకొని కాపాడుట చాల యవసరము. నానా ప్రాంతములలో ఇప్పటికిని పాటలు నేర్చినట్టి ముదుసళ్లగు ఆడువారు చాల మంది కలరు. ఆ ముసలమ్మలు మోటువారనియు, విద్యా శూన్యులనియు, మూర్ఖులనియు, నవనాగరికులు భావించినందున వారిలో దాగినట్టి గేయ వాఙ్మయము ప్రకాశమగుటలేదు.

ఈ సందర్భములో ఒక సూచన చేయదలచినాను మన ఆంధ్రులను ఆశ్రయించుకొని ఆంధ్రులుగానే పరిగణింపబడునట్టి అడవిజాతులవారు కలరు. చెంచులు అను తెగవారు కర్నూలు జిల్లాలోను మహబూబునగరము జిల్లాలోను

అమ్రాబాదులోను కలరు. అనగా శ్రీశైల ప్రాంతములో వీరున్నారు. మరియు "కోయ దొరలు" అను పేరుతో కోయ జాతివారు వరంగల్ జిల్లాలోనున్నారు. సవరలు గంజాం జిల్లాలో కలరు. ఈ సవరలు (శబరులు) ఆంధ్రులు కారు. కాని పై చెంచుకోయవారాంధ్రులు. వారికి సమీపములోగల నాగరికులు వారి నుద్ధరించు విషయములో ఏమియు శ్రద్ధ తీసికొనుటలేదు. ఏ ఇంగ్లాండునుండియో, ఏ అమెరికా నుండియో వచ్చిన పాద్రీలు ఇట్టి జాతులకై శ్రమించుచున్నారు. వీరి భాషకు వ్యాకరణాలు, గ్రంథాలు వ్రాసినారు. వీరికి బళ్లు స్థాపించినారు. వీరితో జీవితాలు గడిపి సంస్కరించినారు. మరి మనము వారి ప్రక్కననే యుండియు వారి భావాలు, వారి ఆచారాలు గమనింపకపోతిమి. ఈ చెంచుల నాటకము చాల అందముగానుండును. వీరి పాట, వీరి ఆట మన ఆంధ్రులెల్లరు చూచినారు. గావున వీరికి సమీపములోనుండు మహబూబునగరు, వరంగల్ జిల్లా ఆంధ్రులు చెంచు కోయ సోదరుల విషయమై మంచి శ్రద్ధతీసుకొని వారి పాటలను సేకరించగలరు. అవి కూడా భాషకుపకరించునేమో !

భారతదేశములోని మహారాష్ట్రీలు, కర్ణాటకులు, బంగాళీలు, హిందీవారు, తమ తమ భాషలలోని పల్లె పాటలను అప్పుడే సమకూర్చి అనేక గ్రంథాలను ముద్రించినారు. మన తెలుగులో ఒక గ్రంథమైనా ఈ విషయానికి సంబంధించినది కలదా? లేదు మరి తక్కిన భారతీయులకన్న మనమే తెలివిపరులమా యేమి? ఈ గేయ వాఙ్మయాన్ని ఉద్ధరించుటలో గ్రాంథికవాదులకన్న భావకవుల మీదనే యెక్కువ భారమున్నది.

## 3

ఇదివరలో పల్లెపాటల యొక్క ప్రాముఖ్యమును వీలైనంతవరకు తెలుపుకున్నాను అయితే ఇది ఎవరో నావంటి చాదస్థులకు పట్టిన పిచ్చియేనా కాక మరెవ్వరైనా యిట్టి పిచ్చివారున్నారా అని కొందరికైనా సంశయము కలుగ వచ్చును. భారతదేశములో మనము తప్ప తక్కిన అన్ని భాషల వారును జాన పదుల వాఙ్మయమును సేకరించి ఉద్ధరించి సమకూర్చి ముద్రించి తమ తమ భాషా సముద్ధరణమునకు తోడ్పడినారు. రెండవ వ్యాసములో దేవేంద్రసత్యార్థి గారు మాడరన్ రెవ్యూలో వ్రాసిన మన ఊర్మిళాదేవి నిద్రను గురించిన దీర్ఘ వ్యాసమును గురించి సూచించితిని. సత్యార్థిగారు పంజాబు వాస్తవ్యులు. వారు

మన తెలుగుదేశానికి వచ్చి తెనుగు వారి పరిచయాన్ని కలిగించుకొని మీలోనున్న పాటలేమి? అని విచారించి వాటిని సమకూర్చుకొని తర్జుమా చేసుకొని కష్టపడు చున్నారు కదా? వారి శ్రద్ధలో శతాంశమైన మనకు కలదా? ఈ సత్యార్థిగారు బెంగాలు, కాశ్మీరు, అయోధ్య, నాగపూరు, ఆంధ్ర, కర్ణాటక మున్నగు ప్రాంతాలన్ని తిరిగినారు.

ఈ సత్యార్థిగారు "రూరల్ ఇండియా" అను మాసపత్రికలో జనవరి సంచికలో "భారతదేశపు పల్లెపాటలే జాతీయ వాఙ్మయము" అనునొక అమూల్య వ్యాసమును వ్రాసినది చూడ తటస్థించినది. దానిని చదివిన తర్వాత మనమెంత వెనుకబడినామో మన వాఙ్మయానికి మనమెట్లపచారము చేయుచున్నామో మన కెంత అశ్రద్ధయు అనాదరణమును మన సోదరుల పాటలపై కలదో విశదమగును. సత్యార్థిగారు వ్రాసిన వ్యాసము నుండి కొన్ని భాగాల నిందుదహరింతును.

"పంజాబులో నూర్లకొలది గొల్లలు మంచి మంచి భావయుక్తమైన పాటలు పాడుచున్నారు.

గోండులు అను అడవిజాతి వారిలో మంచి సుందరమైన గానాలు కలవు.

"ఆంధ్ర దేశమందు పల్లెపడుచులు ప్రత్తి విరుచునప్పుడు ముద్దయిన పాటలు పాడుదురు."

"పఠాన్ స్త్రీలు శతాబ్దముల తరబడి అందమైన పాటలు పాడుకొనుచున్నారు.

క్రీ. శ. 1872 లో గోవర్ అను యూరోపియన్ దక్షిణ దేశపు పల్లెపాటలు (**Flok songs of Southern India**) అను గ్రంథాన్ని ముద్రించినారు. ఈ వాఙ్మయాన్ని తెలుపు మొదటి గ్రంథమిదే. 1885 లో సర్. ఆర్. సీ. టెంపిల్ పంజాబు లిజెండులు అను గ్రంథాన్ని ప్రకటించెను. చంద్రకు మారదేవు తూర్పు బంగాళా గేయములు ప్రకటించెను. దీనినే ఇటీవల రోమేన్ రోలెండు గారి సోదరి ఫ్రెంచి భాషలో తర్జుమా చేసి ప్రకటించెను. కే. యం. మున్షీ గుజరాతు వాఙ్మయము అను గ్రంథాన్ని ప్రకటించి అందు చాలా పాటలు ముద్రించెను. దానికి మహాత్మాగాంధిగారు పీఠిక వ్రాసినారు. రామనరేశత్రిపాఠీగారు "గ్రామ

గీతములు'' అను గ్రంథాన్ని హిందీలో ప్రకటించెను ఒక రైలు స్టేషనులో కొందరు స్త్రీలు తమ భర్తలు కలకత్తాకు పోవుచుండగా వారిని సాగనంపుటకై ఒక పాట పాడిరి. దాని అందము చందము విని త్రిపాఠీగారికి ఆనందమైనది. ఆనాటినుండి వారు గ్రామగీతాలను సమకూర్చుటలో నిమగ్నులైరి. స్త్రీలు వరి పొలాలలో కలుపు తీస్తూ పాడినప్పుడు అదేపనిగా పొంచి యుండి ఈ త్రిపాఠిగారు పొలములోని వరాలపై కూర్చుని విన్నది విన్నట్లుగా వ్రాసుకున్నారు. కొన్ని గ్రామాలలోని మంది అతన్ని చూచి ఎవరో ప్రభుత్వచారుడని భయపడి దూరము పోయినారు. ఇతడేదో తప్పుజేసి జైలునుండి తప్పించుకొని పారివచ్చినాడురా అని గుసగుసలు పోయినారు. ఎట్లయితేనేమి పట్టినపట్టు వదలని ధీరుడు. అతడు హిందీలో ''కవితాకౌముది'' అను పేరుతో అయిదు పెద్ద సంపుటాలు ప్రకటించినాడు. అందులో పూర్వకవిత, ప్రాచీన కవిత, మధ్యకవిత, ఆధునిక కవిత ప్రకటించి తుది అయిదవ సంపుటములో ''గ్రామగీతములు'' ప్రకటించినాడు.

పండిత రామశరణదాసుగారు ఉర్దూలిపిలో ''పంజాబుకే గీత్'' అను గ్రంథాన్ని ప్రకటించినారు. సంత్‌రాం పంజాబీ గీత్ అను గ్రంథాన్ని ప్రకటించెను. ఈ రెంటిలోను జానపదుల ప్రేమగానాలు పూర్వకాలమునుండి అనుశ్రుతముగా వచ్చుచున్న వాటిని సేకరించి ముద్రించినారు.

"రాజస్థాన్‌కీ లోకగీత్" అను హిందీ పాటల గ్రంథములో 230 పాత పాటలను క్రోడీకరించి ముద్రించినారు. ఇవన్నియు రాజపుత్ర స్థానములోని స్త్రీల పాటలు. ఇంకను ఈ పద్ధతిపై అచ్చైన గ్రంథాల సంఖ్య పెరుగుతూ వచ్చినది.

మదన్‌లాలుగారు మార్వాడీ గీతములను, నిహాల్‌చందువర్మగారు మార్వాడీ గీతములను, భేటారాం మాలీగారు మార్వాడీ గీతా సంగ్రహమును, తారాచందు ఓఝాగారు మార్వాడీ స్త్రీ గీత సంగ్రహమునున్ను జగదీశసింగు గహిలోటు గారు మర్వాడకి గ్రామగీత్‌నున్ను ప్రకటించినారు.

వెరియర్ ఎల్విన్ అను ఇంగ్లీషు పాద్రీగారు 290 గోండుపాటలను సేకరించి అరణ్యగానను (**songs of the forest**) అను పేర ప్రకటించినారు. మహారాష్ట్ర భాషలోని పాటలను కొన్నిటిని సేకరించి వామన్‌కృష్ణ చోర్‌ఘూరే అనువారు సాహిత్యాచే మూలధన్ అను గ్రంథాన్ని ప్రకటించినారు.

పై సత్యార్థిగారి వ్యాసములోని విషయమును చూడగా భారతీయ భాషా కుటుంబములో చేరిన కాశ్మీరీ, పంజాబీ, రాజస్థానీ, హిందీ, మరాటీ, బెంగాళీ, గోండు, గుజరాతీ మున్నగు భాషలన్నిటిలోను గ్రామ గీతములు సేకరించి ముద్రింపబడినవి కర్ణాటకులును ఇట్టి గేయాలను ప్రకటించినారని తెలిపినాను ఇక మిగిలిన వారము మనమే! ఇతరులను చూచియైన మనము గుణపాఠము నేర్చుకొందుము గాక. మన యువకులలో ఈ విషయమైన శ్రద్ధ హెచ్చుగు గాక. నశించిపోవుచున్న వీర కథలు, సుద్దులు, తందాన పాటలు, ఏల పాటలు మున్నగునవన్నియు నుద్ధరింపబడు గాక!

# 4

మన తెనుగు దేశములోని జనులు తాము పనులు జేయునప్పుడు పాటలు పాడుచుందురు. మోటకొట్టిన, కలుపు తీసిన, దంచిన, విసరిన, రాట్నము త్రిప్పిన, కళ్లాలలో బంతులు త్రిప్పిన, బండి తోలిన, బరువులాగిన, ఏకాయ కష్టము చేసినను సరే ఆ సమయములలో పాటలు పాడుచుందురు. అవన్నియు సేకరించవలసిన అవసరము చాలా కలదు.

తుదకు చిన్న పిల్లలు గూడ ఏవో పాటలు పాడుచుందురు. శ్రీ చింతా దీక్షితులుగారు పిల్లలకై వాచకములు ప్రకటించినారు. అందు పిల్లల పాటలను కొన్ని చేర్చినారు. అయినను వారుగూడ వానిలోని అంతరార్థమును గుర్తించిన వారు కారు. దానిని మొట్టమొదటి సారి గుర్తించినవారు మిత్రులగు ఆయుర్వేదాచార్య శ్రీ వేదాల తిరుమల వేంకట రామానుజ స్వామిగారు. బాలబాలికల పాటలందు పెక్కింటిలో వైద్యపు చిట్కాలున్నవని వారు గుర్తించినారు. ఆ చికిత్స పాటలలో నెట్లిమిడియున్నదో ఆచార్యులవారు ఒక చిన్న గ్రంథముగానే ప్రకటించవలసినదని పలుమారు కోరినాను. కాని వారట్లు చేయుటలేదు.

స్త్రీలలో ముసలివారిప్పటికిన్ని పలుతావులలో కొన్ని కథలను పాటలుగా పాడుకొనుచుందురు. ఊర్మిళాదేవి నిద్ర, రామాయణ కీర్తనలు, కామేశ్వరీ పాటలు మున్నగునవి వారిలో ప్రచారమందున్నవి. వల్లభరాయడు తన క్రీడాభిరామములో ఒక బ్రాహ్మణ వితంతువు రామాయణమును తెల్లవార్లు పాడుచుండెనని ఇట్లు వర్ణించినాడు.

ఉ. కోయిల పంచమ స్వరము
క్రొల్చిన భంగిని విద్ది చూచి రా
మాయణ మారుకాండములు
నచ్యుత జాగర వేళబాడెనా
రాయ వితంతు రత్నమను
రాగముతోడ నమశ్శివాయ శాం
తాయ సమస్త దోష హరణాయ
సమాన మెదాని కెవ్వరుఁ

కామేశ్వరీ లేక మహాలక్ష్మి పాటలను పాడుచుండిరని అదే క్రీడాభిరామ మందిట్లు వర్ణింపబడినది.

గీ. రాగమున నుండి లంఘించు రాగమునకు
నురు మయూరు ద్వయంబుపై నొత్త గిల్ల
కావ తల్లీ మహాలక్ష్మి కైట భారి
వలపు వాడుచు వచ్చె జక్కులపు రంధ్రి

జమదగ్ని భార్యయు, పరశురాముని తల్లియునగు రేణుకను కాకతీయుల కాలములో ఏకవీరాదేవి అను పేర పూజించుచుండిరి. ఇప్పటికిని తెనుగుదేశమందు కొన్ని ప్రాంతాలలో ఈరమ్మ (ఏకవీరమ్మ) అనుదేవతను పామరులు పూజింతురు. తెనుగు స్త్రీలకు చాలా మందికి ఈరమ్మ అను పేరు కూడా పెట్టుదురు. ఈ వీరమ్మయే ఎల్లమ్మ. నేటికిని పల్లెలలో ఎల్లమ్మ దేవరను చేయుదురు. ఆమెకథను బవని వారు (మాదిగజాతిలో ఒక శాఖ) రెండు రాత్రుల వరకు చెప్పుదురు. అదంతయు రేణుకా పరశురాముల కథయే ఈ కథలను పాడినట్లు క్రీడాభిరామము లోనే యిట్లు వర్ణించినారు.

గీ॥ వాద్యవైఖరి కడునెరవాది యనగ
నేక వీరామహాదేవి యెదుట నిల్చి
పరశురాముని కథలెల్ల ప్రౌఢిబాడె
చారు త రకీర్తి బవనీల చక్రవర్తి

ఆంధ్రదేశమందు బహు ప్రాంతాలలో కోలాటమును పురుషులు వేయుచు పాటలు పాడేవారు. దీనినే రాయలసీమలో కోలన్న పాటలు అనిన్నీ కోలంట్లఆట యనిన్ని యందురు. 200 ఏండ్ల క్రిందట కర్నూలు జిల్లా కవియైన గండ్లూరి నరసింహరాయ కవియను నతడు భాషీయ దండకములో దీనిని వర్ణించినాడు. ఒక స్త్రీ తన ప్రియుడు "కోలన్న" వేయుచుండగా చూచి మరునాడతనితో ఇట్లన్నదట. "నీవాడ కోలన్న వేస్తుండగా చూచినాట్నుండి నాకిట్లిరా తాపమంటింది - నీమీద మోహానసే తాళలేనోయి" (ఇరాతాపమనగా విరహతాపము)

విజయనగర చక్రవర్తులు తాము దండయాత్రలు చేయుటకుముందు ప్రొద్దుననే కొన్ని శకునాలను చూచేవారు. శ్రీకృష్ణదేవరాయలు కటకంపై దండెత్తుటకాలోచించినప్పుడు ఒకనాడు తెల్లవార చీకటిలో ఒక చాకలి యిట్లు పాడుకొనుచుండుట వినవయ్యెను.

కొండవీడు మనదేరా
కొండపల్లి మనదేరా
కాదని యెవ్వరు వాదుకు వచ్చిన
కటకందాకా మనదేరా॥

పల్లెపాటలలో జన సామాన్యమందుండు భాష, భావములు పూర్తిగా నిండియున్నవి. గ్రంథస్థ భాషలోనికి పల్లె పదాలలోని పదాలెక్కలేదు. అట్టి పదాలు వేలకొలదిగా ఉన్నవి. ఆ పదాలన్నియు ఏ నిఘంటువులందును లేవు. అ సుందరమగు పదాలు విద్యావంతుల అనాదరణముచేత మూలబడి యున్నవి. మరియు జనసామాన్యమునుండి విద్యావంతులు దూరమగుచు వచ్చినారు. ఈ కారణముచేత భాషకుకూడా చాలా నష్టము కలిగినది. శుకసప్తతి కవితలోని కొన్ని పదాలు ఏ నిఘంటువులోను లేవు "బందారాకు" "నఖరువాడు" "కూనలమ్మచీర" ఇట్టి పదాలు 100 వరకైనా కదరీపతి యొక్క శుకసప్తతిలో కలవు. ఈదేశప్రాంతమందలి ఈలకత్తి కూడ నిఘంటువులలోలేదు. దాని శుకసప్తతిలోన పాడిరి. ఇట్టి పదాలలో అనేక పదాలకర్థమును మంగలివారిని పల్లెటూరివారిని విచారించి తెలుసుకొనగలిగితిని. 300 ఏండ్ల క్రిందట ఒక ప్రామాణిక కవి వాడిన పదాలకే యీ

గతి పట్టినప్పుడు పల్లెపదాలలో ఎన్ని పదాలు ఇప్పుడు విద్యావంతులకర్థమగునో యేమో ?

భారత దేశమందితర భాషలలోని పల్లెపదాలను గొప్పగొప్ప పండితులు సమకూర్చి గ్రంథస్థముచేసి పెద్ద పెద్ద సంపుటాలుగా ప్రకటించినారు. తుదకు ముండా, కోయ, గోండు, భిల్లు, సంథాలులవంటి ఆటవికుల పాటలు గూడా ముద్రితములైనవి. మనము మన పల్లె పదాలను ఇంతవరకు ఒకచోట చేర్చి ముద్రించక పోయితిమి. ఈ కార్యమును ముఖ్యముగా భావకవులు చేయవలసి యుండెను. వారు గూడా చేయకపోయిరి. ఈ నిజాం రాష్ట్రములోనే చాలా తందాన కథలున్నవి. అవి విశేషముగా మన తెనుగు సంస్థానాలకు సంబంధించినవి. మన సంస్థానాధిపతులును తమకు సంబంధించిన జంగముల కథలనైనా ముద్రింపించక పోయిరి. అవి అనాదరణచేత దిన దినము నశించిపోవుచున్నవి. విద్యావంతులు పల్లెపదాలను శ్రద్ధతో ఉద్ధరించి మరల వాటికి మంచి ప్రచారమును కలిగించవలెను. కొన్ని పల్లె పదాలలో అసభ్యత కలదు. అట్టి వాటిలో మంచి భావాలను గ్రహించి అసభ్యతను పరిహరించవలెను. మంచి పాటలు వేలకు వేలు కలవు. వాటిని సేకరించితే ఆదొక మహోపకారమగును.

# పల్లె పాటలు

స్కాట్లండు దేశీయుడు ఆండ్రూ ఫ్లెచర్ అనునతడు క్రీ.శ. 1203 లో ఇట్లన్నాడు. "ప్రతి జాతియొక్క జానపదములు ఆ జాతియొక్క శాసనాల కన్నను ముఖ్యమైనవి." యూరపుదేశములో పల్లెపాటల ప్రాముఖ్యమును ఏండ్ల క్రిందట గుర్తించిరి. మనవారు 2000 ఏండ్లకు పూర్వమే గుర్తించి మధ్యకాలములో అదంతా మరచిపోయి యిప్పుడు మళ్ళీ పాశ్చాత్యులను జూచి పునరుద్ధరించుకొను ప్రయత్నము చేస్తున్నారు.

సంస్కృతములో అనేక విధాల పాటలుండెడివి. రత్నావళి వంటి నాటకాలలో కొన్ని మనకు నిదర్శనాలు దొరకుచున్నవి. గీత గోవిందములోని పాటలు భక్తి శృంగార రసములతో కూడినవి. పూర్వము సంస్కృతములో చాలా విధములగు పాటలుండినట్లు కాళిదాసాదుల వర్ణనల వలన తెలియవస్తున్నది.

శ్లో॥ ఇక్షుచ్ఛాయ నిషాదిన్య
స్తస్య గోప్తుర్గుణోదయం
ఆ కుమార కథోద్ఘాతం
శాలిగోప్యో జగుర్యశః॥ రఘువంశము-4-20.

వరి పైరును కావలికాచే స్త్రీలు ప్రక్కన నుండిన చెరకు చేలలో చెరకు గడల నీడలలో కూర్చుని రఘు మహారాజు చరిత్రను పాటలుగా పాడుకొని కాలము గడిపిరి అని కవి వర్ణించినాడు. రఘు మహారాజు కాలములో పొలము కాచువారు పాటలు పాడుకొనుచుండిరని స్పష్టమైనది.

శ్లో॥ శరైరుత్సవ సంకేతాన్
సకృత్వా విరతోత్సవాన్
జయోదాహరణం బాహ్వోర్గా
పయామాస కిన్నరాన్. రఘువంశము 4-28.

రఘుమహారాజు ఉత్సవ సంకేతులను గణములను జయించిన తర్వాత కిన్నరులను ఒక దేశమువారు అతని జయోదాహరణమును పాటలుగా గానము చేసిరి. ఉదాహరణమనగా ఒక విధమగు ప్రబంధము. మన తందాన కథ వంటిది.

సంస్కృతములో దేశిగానము, మార్గవిధాన గానము అను గాన పద్ధతు లుండెను. శ్రీరాముని చరిత్రమును వాల్మీకి మార్గవిధానముగా రచించి కుశలవులచే గానము చేయించెను.

శ్లో॥ తతస్తుతౌ
రామవచ ప్రచోధితౌ
ఆగాయతాం
మార్గ విధాన సంపదా.

వాల్మీకి రామాయణము - బాలకాండ సంస్కృతములో కన్న తెలుగులో బహు విధాల పల్లె పాటలుండెను. నన్నయభట్టు భారత రచనతో ఆ పాటలు క్రమక్రమముగా అనాదృతములయ్యెను. తుదకు ద్విపద కావ్యము రచించుట ఉత్తమ కవిత కాదను భావము ముదిరిపోయెను. అందుచేత పాల్కురికి సోమనాథుడు దాని విశిష్టతను తెలుపుటకై ప్రత్యేక శ్రద్ధను చూపవలసి వచ్చెను. తన కాలములోను అంతకు ముందు తెనుగు దేశములో ప్రచారమందుండిన పాటలను కొన్నింటిని పాల్కురికి పండితారాధ్య చరిత్రలో వ్రాసియుంచినందున మనకు వాటి పేరులైనా తెలియవచ్చుటకు వీలు కలిగినది. తుమ్మెద పదాలు, ప్రభాత పదాలు, పర్వత పదాలు, ఆనంద పదాలు, శంకర పదాలు, నివాళి పదాలు, గొబ్బి పదాలు, వెన్నెల పదాలు ఇట్టివింకా చాలా పదాలు జనులు "పాడుచు ఆడుచుండిరి." అని అతడు తెలిపినాడు.

ఇప్పటికిని తెనుగు దేశంలోని స్త్రీలలో అనేక పాటలు నిలచిపోయినవి. ఇప్పటికిని కొన్నియిండ్లలో పెండ్లిండ్ల కాలములో సువ్వాలలు, ధవళాలు, పాడుదురు. కలుపు తీయునప్పుడు, కల్లముచేయునప్పుడు రాటము త్రిప్పునపుడు, మోట కొట్టునప్పుడు, విసురునప్పుడు, దంచునప్పుడు, చాలామంది పాటలు పాడుచుందురు.

పనితోపాటు పాటలుండును. అందుచేతనే కాబోలు "పనీ పాటా" అను సామెత మన భాషలో కలదు. స్త్రీల పాటలలో కామేశ్వరీ పాట కొన్ని బ్రాహ్మణ కుటుంబాలలో కలదు. అదే మల్లమ్మ పాటగా పరిణమించినట్లు కానవస్తున్నది. గుజరాత్ దేశములో గర్భ నృత్య మున్నది. లంబాడీలట్టిదే ఆడుదురు. అదే విధమగు నృత్యాన్ని మన తెనుగువారు తెలంగాణములో బతకమ్మ అను పేరుతో దేవి నవ రాత్రులలో ఆడుచు పాడుచుందురు. దీనినే కర్నూలు జిల్లాలో "బొడ్డెమ్మ" అను పేరుతో వెన్నెల రాత్రులందు స్త్రీలు ఆచరిస్తూ ఉందురు. పురుషులు కోలన్న పదాలను పాడుచు ఆడుచుందురు. వెన్నెల రాత్రులందే ఈ ఆటనాడుదురు. దీనినే కొద్ది భేదముతో కోలాటమని బాలికలచే ఆడింతురు.

అప్పకవి కాలములో కూడా పల్లె పాటలు కొల్లలుగా ఉండెను. అతడు తన ఛందస్సులో ఇట్లు తెలిపెను. "అసంఖ్యా బద్ధములగునవి పాటలు. రచనలు వృత్తములని, జాతులని రెండు తెగలవి కలవు. అందు జాతులనునట్టివి పాటలు, మంజరి, రగడ, కళిక, లాలిపాట, ధవళాలు, సువ్వాలలు అనునవి పాటలు. కన్నడ భాషలో ఒక్క ద్విపదలో ద్విపద, త్రిపద, షట్పద అను భేదాలు చాలా ఉండుటయేగాక వాటిలో గొప్ప కవులు చాలా రచనలు చేసిరి. మన తెనుగులో ద్విపదయే చాలా పాటలకు మూలము. దానిని మధ్యలో విరిచి తుమ్మెద, వెన్నెలా, తందాన మొదలగు ఊత పదాలను వాడుతూ ఇద్దరు వ్యక్తులు పాడుట పరిపాటి. శృంగార గానములను జావళీలందురు. తెనుగులో క్షేత్రయ్య, సారంగపాణి రచించిన జావళీలు ప్రసిద్ధములైనవి.

వైద్యులు కూడా తమ చికిత్సలను పిల్లల పాటలుగా రచించి ప్రచారము చేసిరి. కాని అవి అర్థము లేని తిక్క మాటల జోడింపు అని అందరున్నూ అనుకొనుచుండిరి. బాలబాలికల పాటలలోని కొన్నింటిలో గొప్ప వైద్య, చికిత్సలు కలవని మొట్టమొదట కనిపెట్టిన వారలు శ్రీమాన్ వేదాల తిరుమల రామానుజ స్వామిగారు.

తెనుగు దేశములోని పోతులూరి వీరబ్రహ్మం, యాగంటయ్య, తోటి గజేంద్రుడు, దూదేకుల సిద్దప్ప మొదలగు భక్తులు తమ బోధలనన్నింటిని పాటలలోనే రచించి ప్రచారము చేసిరి.

హిందూ స్థానములోని ఇతర భాషా సోదరులు మనకంటే ముందుగానే బాగా మేల్కొని యున్నారు. దేవేంద్రసత్యార్థి అను పంజాబీ రసికుడు పల్లె పాటలనుద్ధరించుటకే తన యావజ్జీవితము నర్పించియున్నాడు. అతడు భారతదేశ మందలి అన్ని ప్రాంతాలలో తిరిగి అన్ని భాషలలోని పల్లె పాటలను సమకూర్చు తున్నాడు. రామనరేశ త్రిపాఠీ అనునతడు కవితా కౌముది అను పేరుతో హిందీ పాటలను సమకూర్చి ముద్రించినాడు. పంజాబుగీతాలు, మార్వాడగీతాలు, కన్నడ గీతాలు ముద్రితమైనవి. తుదకు గోండులను అడవి జాతులవారి గీతాలనుగూడా ఎల్విౕ అను మిషనరీ సమకూర్చి ముద్రించినాడు మన తెలుగువారింకను ఈ విష యములో ఎక్కువ శ్రద్ధ బూనలేదు. స్త్రీల పాటలు అనునవి కొన్ని చాలా ఏండ్ల క్రిందట ముద్రింపబడెను. ఈ మధ్య కొన్ని పిల్లల పాటలు ముద్రితమైనవి. మన తందాన కథను (బుర్రకథలను) పండితులు సంస్కరించి చక్కని పీఠికలతో ముద్రించు ఆలోచన ఇంకా చేయలేదు హైదాబాదు రాష్ట్రములో ఎన్నో చారిత్రక గాథలు తందాన కథలుగా ఇంకా నిలచియున్నవి. వాటిని ముద్రించే ఆలోచన ఎవరున్నూ చేయుటలేదు. గద్వాల వనపర్తి పాపన్నపేట సంస్థానాల పూర్వ రాజుల వీరగాథలు చాలా రమ్యమైనవి కొన్ని కలవు. ఆ సంస్థానం వారికే తమ పూర్వుల గాథలపై అభిమానము లేకపోయెను. వారికభిమానం కలిగితే అవి దిక్కులేని చావు చావకుండ బ్రదికి యుండగలవు. తెలంగాణములో ప్రతి చోటనూ వీరగాథలు కొల్లలుగా గలవు. ప్రతి ఊరిలోనూ ఎన్నో సుందరమగు పాటలు కలవు. ఆ పాటలలో ప్రబంధాలలో దొరకని చక్కని జాను తెనుగు పదాలు కలవు. నిజాం రాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు వాటిని సేకరించి ముద్రించుట భావ్యము. భావ కవులు అభినవ సారస్వతమువారు, నవ్య కవితా కుమారులు, ఈ కార్యమునకు పూనుకొనవలెను. పల్లె పాటల నుద్ధరించిన భాషకు కూడా చాలా లాభము కలుగును.

తెనుగు దేశంలోని గుంటూరు బెజవాడ మధ్య ప్రదేశములో చంద్రమ్మ వెంకయ్యా పాటలు కలవు. అవి మంచి పాటలే అయినను కొందరు అందు తమ బూతు రచనలు చేర్చి వాని స్వరూపమును మార్చినారు. చంద్రమ్మ వెంకయ్యాల గాథలో అనేక విశిష్టతలు కలవు. చంద్రమ్మ కాపు కులములోని పడుచు. వెంకయ్యా మాల, ఇద్దరికి పొలాల కాచునప్పుడు ప్రేమ కలిగినది. వారు వివాహమాడదలచిరి. సంఘము ఓర్వలేకపోయెను. వారు సంఘ బహిష్కరణకు.

సంఘ దౌర్జన్యములకు గురియై తుదకు ఆత్మహత్యలు చేసుకొనిరి. ఇట్టి విషాద గాథలో ఆ యిరువురి భావాలు ఎంత మనోహరముగానైనను దానిని రచించిన అజ్ఞాత కవి చిత్రించినాడు.

"మిడి మిడి యెండలో
నడిచి వస్తుండావు
జోడు కుట్టి తెచ్చినానే
చంద్రమ్మా—
ఆకు చెప్పులు కుట్టినానే
చంద్రమ్మా"—

"మాలోన్ని పెండ్లాడ్తె
మర్యాద పోతాది.
మాట్లాడ కూరకోవే
చంద్రమ్మా"—

"ఏడు కొండల రేడు
వేంకటేశ్వర స్వామి
కడకుపోయీ
మొక్కులడుక్కొని వద్దాము
మీ తల్లితో చెప్పిరావే
చంద్రమ్మా"—

"ఇద్దరము కలిసి
ఏకమొగముంటేను
ఏడు లోకాలు
మన కాడనే ఉంటాయి
ఎక్కడికి వెళ్ళ వద్దే
చంద్రమ్మా —
ఇక్కడనే ఉండి పోదామే
చంద్రమ్మా"—

"గోదావరికి పోయి
గోవిందునికి మొక్కి
కడతేరి పోతానురో
వెంకయ్యా —
కడసారి చూపిదేరో
యంకయ్యా''

''స్వర్గ లోకములో
చల్లనీ చోటులో
సరసము లాడుదామే
చంద్రమ్మా —
చందమామను చూతమే
చంద్రమ్మా"—

ఇట్టి వెన్ని అజ్ఞాత వాసము చేస్తున్నవో ఆంధ్ర విజ్ఞాన ప్రియులంతా అన్వేషించి వాటి నుద్ధరించవలసి యుండునని మనవి చేస్తున్నా.

# జీవిత చరిత్రలు – వాటి రచన

జీవిత చరిత్రలకూ దేశచరిత్రలకూ సన్నిహిత సంబంధం కలదు. మహా పురుషులే దేశచరిత్రలకు ముఖ్యకారకులు. ఒక్కొక్క మహాపురుషుడు తన శక్తి చేత గొప్ప భూభాగమునే కాక ఖండాలనే మార్చిపోయినాడు. ఏసుక్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు గొప్ప మత పరివర్తనము కావించి పోయినట్టివారు. అలెగ్జాండరు, హానిబాల్, నెపోలియన్ చక్రవర్తి, అశోకుడు మరొక వర్గానికి చేరినట్టివారు. వారు శూరులును, సాహసికులునై యుండిరి. కొలంబసు, కుక్, వాస్కోడిగామా వంటి నావికులు కూడా ప్రపంచముపై తమ ప్రభావము వేసి పోయిరి. కొలంబసు తేరకు తేరగా అమెరికాను స్పెయిను కిచ్చెను. కుక్ అను వాడు ఆస్ట్రేలియాను చూడబోయి అచ్చట ఇంగ్లీషు జండా పాతి ఇది మాది అనెను. వాస్కోడిగామా ఇండియాకు దారితీసే పాశ్చాత్యులకు ఇండియాను అప్పగించుటకు పాటుపడెను.వాట్,స్టివెన్సన్,గూటెన్‌బర్గు,రైటు సోదరులు మున్నగు వారు చాలా గొప్పవారు. వారు రసాయనాది శాస్త్రాలలో ప్రవీణులై రైళ్ళు, ఇంజనులు, అచ్చుయంత్రాలు, విమానాలు మున్నగునవి కనుగొని ఏషియా, ఆఫ్రికా ఖండాల ఆర్థిక విజయమునకు కారకులైరి.

పై విషయాలను బట్టి మతకర్తలు, సేనానులు, రాజులు, పరిశోధకులు, శాస్త్రవేత్తలు వీరందరూ చారిత్రిక పురుషులని విశదమగును. వారిని ఆదర్శముగా తీసుకొని తర్వాతి కాలములో క్రొత్తవారు బయలుదేరి ప్రపంచ కల్యాణమునకు తోడ్పడుట కవకాశమేర్పడును. జీవిత చరిత్రలు నీతిని బోధించును. మన పూర్వుల మంచిచెడ్డలను తెలుసుకొని మనము వాటివల్ల లాభం పొందగలము.

జీవిత చరిత్రలు వ్రాయుటలో గ్రీకులే ప్రథమంలో క్రీస్తునకు పూర్వమందే క్షణఫన్ (                ) అను నతడు సోక్రటీసు చరిత్రను వ్రాసెను. ప్లూటార్-? అను నతడు 46 మంది గ్రీసు రోము దేశాల మహాపురుషుల జీవితమును వ్రాసెను. గ్రీకుల తర్వాత జీవిత చరిత్రలు వ్రాయుటలో రోము వారు ప్రసిద్ధులు.

హిందువులలో చరిత్రలే లేకుండెనను అపవాద మున్నందున ఇక జీవిత చరిత్రల కెక్కడ తావున్నది. హిందువులు ఒక విధముగా ప్రపంచములో మొట్ట మొదట జీవిత చరిత్రలు వ్రాసినవారు. కాని ఆ మాటను నమ్మకుండునట్లుగా తర్వాత మనవారే చేసి వేసినారు. మన పురాణములు జీవిత చరిత్రలతో నిండి యుండెను. రామాయణము శ్రీరాముని జీవిత చరిత్రము కాదా? దానిని చదువని లేక వినని హిందువు లేడు కదా! భాగవతము శ్రీకృష్ణుని జీవిత చరిత్రము. దానిని వినని వారు అరుదు. హరిశ్చంద్రుని చరిత్ర, నలచరిత్ర, అజామిళుని చరిత్ర ఇట్టివి వేల కొలది కలవు. అవన్నీ జీవిత చరిత్రలే? కాని హిందువులలో ఒక లక్షణ మున్నది. తమకు నచ్చిన వారిని దేవతలనుగా చేసిరి. మెచ్చని వారిని రాక్షసులనుగా చేసిరి. ఆ చేయుటలోనూ మహిమలతో పూర్తిగా నింపి వేసిరి. ఈ కారణాల చేత నిజమైన చరిత్ర మాటుపడి, నమ్మరానిదై పోయెను. అంత ప్రాచీన కాలపు ముచ్చట్లు వదలినా నిన్న మొన్నటి అనగా 200 ఏండ్ల క్రిందటి చరిత్రలు కూడా మనవారట్లే వ్రాసిరి. తుకారాం విమానములో సశరీరుడై పోయె నట. నామదేవుడు ఒట్టెచేత వేదాలు చదివించె నట. ఇవన్నీ భక్త విజయములో చూచుకొనవచ్చును. వైష్ణవులను చూచి శైవులు, శైవులను చూచి వైష్ణవులు భక్తుల చరిత్రలను కొల్లలుగా వ్రాసిరి. ఇక మనవారి రెండవ లోప మేమనగా జీవిత చరిత్రలను ఉన్న దున్నట్లుగా వ్రాయక ఉత్ప్రేక్షలతో అబద్ధాలతో నింపి వేసిరి. విక్రమాంకదేవ చరిత్ర, మహ్మద్ మదమర్ధనం, శంకర విజయము, వేమభూపాల చరిత్ర, హర్ష చరిత, సాళువాభ్యుదయము, పృథ్వీరాజ విజయము మున్నగు సంస్కృత జీవిత చరిత్రములు వందలకొలదిగా నున్నవి. అవి కొంతవరకే పనికి వచ్చును.

అజ్ఞానుల వల్ల వ్రాయబడిన జీవిత చరిత్రలు దేశకాలాదులను తెలుపక, అపభ్రంశ రూపాలతో నిండిన జంగము కథలు, పవాడాలు, సుద్దులు దేశ మంతట నిండినవి. అవి జీవిత చరిత్రలె కాని బహు లోప భూయిష్టముగానున్నవి.

మన తెనుగులో కొన్ని జీవిత చరిత్రలు కానవచ్చుచున్నవి. కృష్ణరాయ విజయము, నరపతి విజయము, కైఫియత్తులు, ప్రతాప చరిత్రము మున్నగునవీ వర్గములో చేరును. కాని ఇవి వ్రేళ్ళమీది లెక్కలోనివి, ఇవి కూడా లోపాలకు గురియైనవి.

యూరపు దేశములో ఆధునిక పద్ధతులపై జీవిత చరిత్రలు మున్నూరు నన్నూరు ఏండ్ల క్రిందటనే రచింపబడుటకు మొదలయ్యెను. ఎనిమిదవ హెన్రీ కాలములో ఇంగ్లండు దేశములో జీవిత చరిత్రలు వ్రాయనారంభించిరి. కాని బాస్వెల్ వ్రాసిన జాన్సన్ జీవితమే ఇంగ్లీషు భాషకూ, జాతికీ జగద్విఖ్యాతిని తెచ్చెను. అదే తర్వాతి వారికి ఒరవడి అయ్యెను. నెల్సన్ జీవితము, స్కాటు జీవితము ప్రఖ్యాతములైనవి. యూరపు ఖండములోని ఫ్రాన్సు, జర్మనీ, రష్యా దేశాలలో జీవిత చరిత్రల రచన బాగా గత శతాబ్దమందు వృద్ధియయ్యెను. అమెరికాలోను అదేకాలమందు అవి వ్యాప్తికి వచ్చెను.

జీవిత చరిత్రలో ఆత్మకథలు (Auto biographies) చేరినవి. ప్రపంచ మందలి కొందరు మహాపురుషులు తామే తమ జీవితచరిత్రలను వ్రాసి పెట్టినారు. మహాత్మాగాంధీ గారు తమ జీవితచరిత్రను వ్రాసినది సుప్రసిద్ధము. ప్రపంచ స్వీయచరిత్రలలో గాంధీగారి ఆత్మకథ ఉత్తమస్థానము వహిస్తుంది. ఆత్మకథ వ్రాయువారు తమలోపాలను బయట పెట్టరు. గాంధీగారు తనలోని మంచివీ చెడ్డవీ అన్నీ బయట పెట్టినారు.

మన తెనుగులో స్వీయచరిత్రను వ్రాసిన వారిలో మొట్ట మొదటివారు శ్రీ కందుకూరి వీరేశలింగము గారే. మన తెనుగులో జీవిత చరిత్రలు మొన్న మొన్నటివరకు లేకుండెను. ఈ ముప్ఫైయేండ్ల నుండియే జీవిత చరిత్రలను అందందు వ్రాయుటకు మొదలు పెట్టినారు. మన తెనుగు లోనికి మొట్టమొదట ఆబట్ రచితమగు నెపోలియన్ చరిత్రము, లడ్విగ్ వ్రాసిన చరిత్రములు, ఆరంస్ట్రాంగ్ వ్రాసిన కమాల్‌పాషా ఇబ్నసాదు చరిత్రలు జాన్సన్ జీవితచరిత్ర, కార్లైల్ వీరుల చరిత్ర మొదలైన ఉత్తమ జీవిత చరిత్రలు పరివర్తనలు కావలెను. తర్వాత ప్రపంచ మహాపురుషులను గూర్చి వ్రాసిన ఉత్తమ చరిత్రల నన్నింటిని అనువదింప జేయవలెను.

పాశ్చాత్యులు మన పూర్వులకు సరియగు న్యాయమును చూపించియుండ లేదు. పాఘ్చయర్, యూక్లెడ్, ఆర్కిమిడిస్, గాలిలియో మొదలైన యూరపు పరిశోధకుల చరిత్రలను విపులముగా వ్రాయుదురు. కాని ప్రపంచానికి సంస్కృత భిక్షను పెట్టిన హిందూ ఆర్య మహాపురుషుల పేరులనైనా స్మరించరు. రేఖా

గణితము, బీజగణితము (Geometry & Algebra) లెక్కలలోని పూర్ణాంకమును (సున్నను) దశాంశమును (Decimal) మొట్ట మొదట కనిపెట్టినది హిందువులు. ఆర్యభట, వరాహ మిహిర, భాస్కరాచార్య, నాగార్జున, భోజరాజ, కల్ప, కణాద, ధన్వంతరి, అగస్త్య, కౌండిన్య, భరత, జయసింహాది పరిశ్కృత మహాపురుషుల పేరు లెక్కడా ఆంగ్ల జీవిత చరిత్రలలో కానరావు. పై వారిలో జ్యోతిర్వేత్తలు, గణితాచార్యులు, రసాయనశాస్త్ర ప్రవర్తకులు, కణ సిద్ధాంత స్థాపకులు (Atomic theory) వలన రాజ్యాలను స్థాపించిన వారు. శిల్పాచార్యులు, విమానశాస్త్ర నిర్మాతలు చేరియున్నారు. తెల్లవారు చేయలేదని మనమూరకొనవలెనా? అందుచేతనే మన మింకనూ అధికముగా పరిశోధించి శ్రమించి మన పూర్వ మహామహుల చరిత్రలను మన భాషలందును పరభాషలందును వ్రాసి వ్యాప్తికి తేవలెను. ప్రత్యేకముగా పై సూచించిన వారిని గూర్చి ఇతరార్య మహాపురుషుల గూర్చి యెవరైనా పరిశోధించి రచించిన బాగుండునని నేను చాలా కాలము నుండి అనుకొనుచుందును. ఆ పుణ్యకాలము రాకమానదు.



జీవిత చరిత్రలను వ్రాయుట సామాన్య విషయము కాదు. జీవితచరిత్రను కూలికి వ్రాయువారు చాలా మంది కలరు. తమ పొట్ట నింపుకొనుటకై శక్తి సంపన్నులను సకలాలంకారములతో వర్ణించి రావణుని రామునిగా, హిరణ్యకశిపుని హిరణ్య గర్భునిగా, పోతరాజును భోజరాజుగా, లుబ్ధాగ్రేసరుని దానకర్ణునిగా చిత్రించి హాస్యాస్పదులగుచున్నారు. అట్టి చరిత్రలు నాలుగుదినాల పాటు కూడా నిలువవు. జాన్సన్ చరిత్ర వ్రాసిన బాస్వెల్‌కు దమ్మిడి లాభము లేకుండెను. అది లోకోత్తర జీవితచరిత్ర యయ్యెను. జీవిత చరిత్రలను కొని చదువుటనిన జనులు వాటితో పాటు అమృతాంజనం కొనవలెనంటారు. అవి నీరసముగా నుండునని తలతురు. జీవిత చరిత్ర వ్రాయు రచయిత తన గ్రంథాన్ని రమ్యముగా ఆకర్షణీయముగా వినోదహేతువుగా చేయుటకై అబద్ధాలను తన సొంత పైత్యాన్ని తన గ్రంథములో నింపిన అది మదనకామరాజు కథలుగా మారిపోవచ్చును. సత్యమునే చెప్పవలెను. చక్కగానే చెప్పవలెను. ఆ విధముగా చెప్పినవాడే ఘనుడు. రచయిత శైలి ద్వారా చాలా రమ్యతను తన గ్రంథానికి చేకూర్చగలడు. కావున జీవిత చరిత్రలకు శైలి చాల ముఖ్యమైనదిగా నుండును.

# దాక్షిణాత్య లోకోక్తులు

సామెతలలో ఎంతో అర్థము ఇమిడియుండును. భాషకు ఒక అలంకార ప్రాయము, చరిత్రకు కొంత ఉపకరణము, కవిత్వానికి తోడు నీడ, భావ ప్రకటనకు పుష్టి, పండిత పామరులకు సంగమ స్థానము. ఇవి సామెతలలోని విశేషములు. ప్రతి దేశములోను ప్రతి జాతిలోను, ప్రతి భాషలోను సామెతలకు మంచి స్థానమున్నది. ఒక్కొక్క ప్రాంతములో ఒక విధమైన సామెతలు, అవి జనుల భావములను, ఆచారములను వ్యక్తపరచునవై యుండును.

ఇతరుల మాటయేమో కాని తెనుగువారి సామెతలకు ప్రత్యేక స్థానము కలదు. ప్రాయికముగా సామెతలు యతి ప్రాసయుక్తముగానుండును. ప్రాసతో తిట్టరా పాడు ముండాకొడుకా అని ఎవ్వరో అన్నారట. సామెతలు మూడు నాలుగు విధాలుగా నుండును. హాస్యరసయుక్తమయినవి. బూతులతోనిండినవి. లోకానుభవయుక్తమైనవి యిట్లు పలు తెరగులుగా నుండును.

తెనుగులోని సామెతలను ఒకచోట చేర్చి ఒకటి రెండు గ్రంథాలు ప్రకటించినారు. అయితే అందు దశాంశమైనా కూర్చలేదని చెప్పవచ్చును. ఒక్కొక్క జిల్లాలో ఒక విధమైన సామెతలు కలవు. ఇవన్నింటిని ప్రతి మండలమువారును కూర్చి వివరములతో కూడినవిగా ప్రకటించుచు వచ్చిన కొంత కాలానికి మరెవ్వరైనా అన్నింటినొకచో కూర్చుటకు వీలుండును.

మన ఆంధ్రులకు అరవలకు పూర్వకాలము నుండి అదెందుకో సరిపడకున్నట్లున్నది. అరవలు కూడా తెనుగు వారిని గురించి హేళనముగా సామెతలు చెప్పుకొందురు. తెనుగువారును అదే పద్ధతిపై అరవవారిని గురించి చెప్పుకొందురు.

శ్రీనాథ మహాకవికి అరవ సాంబారు రసము రుచించకపోయెను. ఆంధ్రులకు ఇప్పటికిని సాంబారు రసం అంటే సరిపడదు. శ్రీనాథునికి అరవ దేశము మంది కూడా సరిపడినట్లులేదు. "పిళ్ళె" జాతి వారిని వర్ణించినది వింటే ఈ

సంగతి అర్థమౌతుంది, అతని తర్వాత పండిత జగన్నాథ రాయలవారికిని ఇదే విరోధముండినది. ఆయన "ప్రౌఢ మనోరమా కుచమర్దిని"లో ద్రావిడుల దూషణ అచ్చటచ్చట వ్యక్తమగు చున్నది.

దక్షిణ దేశములోని కొన్ని పట్టణాలు, ఆచారాలు ఆంధ్రుల సామెతలలో. కెక్కి సాధారణమై పోయినవి. అట్టి సామెత లెన్నియున్నవో కాని నాకు తెలిసిన అయిదారింటిని ఇందు తెలుపు కొంటాను.

అరవ భాష మన వారికి సరిపడినట్లులేదు, ఎవరైనా మాట్లాడే దానిలో అర్థముకాకుంటె - ఏమిటదీ "అరవ మొత్తుకోళ్ళు" అని ఎగబడతారు. "అరవ అధ్వాన్నము'' అనియు మరొక సామెత కలదు. ఎవరైనా బండచాకిరీ చేస్తే దాన్ని "అరవచాకిరీ'' అంటారు.

భిక్షపతి క్షౌరం అంటే అందరికీ తెలిసినసంగతే. తిరుపతికిపోయే యాత్రికు లెక్కువ. మంగళ్ళు తక్కువ. వేంకటేశ్వరునికి వెంట్రుకలంటే చాల ప్రీతి. ముత్తైదువలు కూడా నున్నగా బోడి కొట్టించుకొని వెంట్రుకలు సమర్పించుకొని వస్తారు.

అయితే మంగళ్ళు క్షౌరానికి పోయిన వారిని వరుసగా కూర్చొనబెట్టి ప్రతి వాని నెత్తిన ఒక పట్టె పెట్టి ఆ మనిషి తనవాడని రిజిష్టర్ చేసుకొందురు. ఆ ప్రకా రముకాబడ్డ మనిషిని ఇంకొక మంగళివాడు మూడు నాల్గంతల పైకమిత్తునన్నను ముట్టడు. అట్లు ముట్టినా మంగలి కత్తులతో ఘోర యుద్ధము ప్రారంభమైనదన్న మాటే. ఇట్టి పట్టెల క్షౌరానికే మనవారు తిరుపతి క్షౌరం అని ప్రసిద్ధి నించినారు.

ఇంకా కాస్త దక్షిణానికి విజయం చేస్తే "చిదంబర రహస్యమును" తెలుసు కొనవచ్చును. చిదంబర క్షేత్రములోని ఒక దేవాలయములో ఒక పర్దా కట్టి యుంటారట. దాని లోపల ఏమిన్ని ఉండదు. అయినా యాత్రికులు అందు దేవు డున్నాడని భావించుకొనవలెనట. ఏమిన్నీ లేని వస్తువును ఉన్నదనడానికి మనవారు చిదంబర రహస్యం అంటారు.

ఇంకా కొంచెము దక్షిణానికి తర్లినామంటే మనకు "పుంగనూరు మనుషులు" కనబడతారు. మనలోని మూర్ఖులను "పుంగనూరు మనిషి" అని తిట్టుతాము. ఇప్పటికి నీ పుంగనూరు గురుస్థానమొకటి మద్రాసు రాజధానిలోనున్నది. అయితే అచటి మనుషులు మనవలెనే తెలివి తేటలు కలవారేకాని యెవ్వరో మహానుభావులు ఈ సామెతను కల్పించి పోయినారు. పుంగనూరులో నౌకరులను విస్తర్లు ఎత్తి వేయరా అంటే యెంత మంది తిన్నారు అని అడుగుతారట. ఫలానివాణ్ణి పిలుచు కొని రారా అంటే ఆతడు లేకపోతే యేమి చేయాలె అని అడుగుతారట. ఉన్నాడు పోరా అంటే "రాకపోతే మరి" అని అడుగుతారట. ఈ కల్పనలు ముచ్చటగానే ఉన్నవి.

తిరుపతికి సమీపములో "కంచి" అనే క్షేత్రము కలదు. "నగరేషు కాంచీ నారీషు రంభా" అని ప్రాచీ-మునుండి దీనికి ప్రఖ్యాతి. "కంచంత కాపురము" అనే సామెత కలదు. తెనాలి రామకృష్ణుడు తన పాండురంగ మహాత్మ్యములో నిట్లు వర్ణించినాడు.

"కాపు కోడలు కంచంత కాపురంబు
బాలవంటి కులంబు కాడ్పరచి యురికె
మగని నటుబెట్టి రెండవ మగనివెంట
నువిదలకు బుద్ధి పెడతల నుండుగాదె."

అంటే కంచి పట్నమంత పెద్ద కాపురము అన్న మాట. ఇక్కడ మాత్రము మనవారు ఒక్కమారైనా మెచ్చుకొన్నారు.

"ద్రావిడ ప్రాణాయామము" అనే సామెత సాధారణము. ద్రావిడులు ప్రాణాయామము చేయవలెనంటే నేరుగా ముక్కు పట్టుకోకుండా కుడిచేతిని నెత్తి వెనుకనుండి పెనవేసుకొని వచ్చి దానితో ముక్కు పట్టించు కొందురట. ఆ ప్రకారము ఎవ్వరును చేయరు కాని సామెత ఏర్పడింది. అంటే ఎవ్వరైనా సూటిగా చెప్పుటకు మారుగా డొంక తిరుగుడులు సవ్యాపసవ్య ప్రదక్షిణాలు చేసి చెప్పదలచిన ఆ రెండు ముక్కలు యిన్నూరు మాటల వరకు పెంచి పావుగంట కాల హరణము చేసి అంతయైనను ఒక్కొక్క మారు తమ అభిప్రాయాన్ని వినే నెత్తిలో పూర్తిగా యెక్కించ లేని సందర్భములో ఈ సామెతను చెప్పుతారు.

ఇంకా దక్షిణానికి యాత్ర చేస్తే మనకు కుంభకోణము ప్రత్యక్షమౌతుంది. ''వాడు కుంభకోణము చేసినాడురా'' అని మన వారిలో నొక సామెత. అనగా మోసము చేసినాడని అర్థము. ఇది కూడ అన్యాయంగా వ్యాప్తి గావింపబడినట్టి సామెతయే అని చెప్ప వలసిందే.

ఇంకా దక్షిణానికి దిగితే శ్రీరంగం అనే పవిత్ర శ్రీవైష్ణవ క్షేత్రం ప్రత్యక్షం అవుతుంది. ''శ్రీరంగనీతులు'' అనే సామెత తెనుగు వారిలో చాలా ప్రసిద్ధి. అంటే తాము మాత్రము ఆచరింపక ఏమేమో నీతులు బోధించితే అవి శ్రీరంగనీతులు అని మన వారంటారు.

ఇంకా దక్షిణానికి పోతే ''ఆడ మళయాళం''లో పడిపోతాము. ఈ ఆడ మళయాళం అనే దేశాన్ని గురించి మన దేశంలో వ్యాపించినన్ని కథలు, కల్లలు మరెచ్చటను లేకుండ వచ్చును. ఈనాడు కూడా పల్లెలలోని జనులు కట్టు కథల నంతా నమ్ముతారు. ఆడ మళయాళంలో అంతా ఆడవాళ్ళేనట. మగవాడు పోతే దక్కడట. అయితే గాలికి పిల్లలు పుట్టు తారట. ''మళయాళ భగవతీ అని మంత్రం వేసినారంటే రాయో రప్పనో పశువో అయి పోవలసిందేనట. ఇంకా ఇట్టి చిత్ర కథలు కొల్లలుగా మన దేశములో చెప్పుకుంటూ వుంటారు.

మళయాళ మంత్రాలకు ప్రసిద్ధి అయిపోయింది. పూర్వంలో మంత్ర గాండ్లు మళయాళం పోనీ పోక పోనీ తమ కేమైనా మంత్రాలు వచ్చి వుంటే వాటిని వారు మళయాళంలో నేర్చు కొన్నామని చెప్పుకునే వారు. అందు చేతనే మంత్రగాండ్లు యిప్పటికిన్నీ మోడీ గారడీ వంటి ఇంద్ర జాలాన్ని ప్రదర్శించే దానికి ముందు ''ఛూ, మళయాళ భగవతీ'' అని ఆడ మళయాళ శక్తిని తలచు కొంటారు.

ఇంకా ఇట్టి సామెతలు మరెన్ని వున్నవో యేమో.

# శబ్దాల ముచ్చట

మా శ్రీపాద శాస్త్రిగారితో మాటల సందర్భమున నా పుస్తకములో వ్రాసికొనిన కొన్ని శబ్దముల చరిత్రను ముచ్చటించి యుంటిని. కాని వాని నింత త్వరగా ప్రకటించదలచి యుండలేదు. మా శాస్త్రిగారు మాత్రము ఇప్పుడే కావలెనని పట్టుపట్టినారు. సంస్కృత ఫార్సీ భాషలకు పరస్పర సన్నిహిత సంబంధమెట్లు కలదో, ఈ రెంటికినీ కించిద్భేదమెట్లేర్పడెనో, ఎన్నడేర్పడెనో ఇత్యాది విషయముల నొక చిన్న గ్రంథముగా వ్రాయతలపెట్టి యుంటిని.

అప్పుడు నేను సంగ్రహించి యుంచిన ఫార్సీ శబ్దములను గురించియు వ్రాయదలచి యుంటిని - అదెన్నడో యేమోకాని యిప్పుడు మాత్రము నాకు తోచిన కొన్ని శబ్దముల నిందు ప్రకటించుచున్నాను. నేను వ్రాసిన అభిప్రాయములు సరిగాకపోవచ్చును. విమర్శకులకు మార్గదర్శకముగ నైన నుండవచ్చునను ఊహతో ప్రకటించుచున్నాను.

1. ద్వార — ద్వి + అర రెండు రెక్కలు కలది. ప్రాచీనమందు ఒంటిరెక్క తలపులకన్న రెండు రెక్కల తలుపులే విశేషమేమొ.

2. డప్పు — ఇది ఉత్తర సర్కారులలో విశేషము వాడుకలో కలదు. ఫార్సీలో దఫ్ అని కలదు. తప్పెట అను నర్థములో నుపయోగింతురు.

3. హంవీరుడు — శూరుడను నర్థములో ప్రయుక్తము. తారా శశాంక విజయమందు ప్రయోగించబడినది.

"దండహంవీరతల గుండు గండ" అని శుకసప్తతిలో (పు. 128) కలదు. "రాజమాన్య హంవీరులు దక్కణీలు" అనియు నొక చాటువు. హంవీరుడు రాజపుత్ర స్థాన చిత్తూరు రాజగు అర్సి కుమారుడు. మహావీరుడగుటచే శూరపద పర్యాయమయ్యెను.

4. దేవానాం ప్రియ - ఇది షష్ఠీతత్పురుష అలుక్సమాసముగానే మూర్ఖుడను నర్థములో వాడినారు. అమరసింహుడు త్రికాండ శేషములో దీని యర్థము

"ఛాగము" అని వ్రాసెను. ఛాగసమానుడు మూర్ఖుడు. మరియు ఛాగము యజ్ఞములందు దేవానాం ప్రియమైనది. నిఘంటుకారులు మూర్ఖునికే యీ పదము అలుక్సమాస స్వరూపమందే వర్తించుననిరి. దీనికి చారిత్రక కారణము కలదు. బౌద్ధులు తమ మతమందు శ్రేష్ఠులైన వారిని "దేవానాం ప్రియులు" అని పిలుచు చుండిరి. అశోక చక్రవర్తి బిరుదులలో నిదొక్కటి హిందువులు బౌద్ధులను హేళనము అవమానము చేయు నుద్దేశముతో నీ యలుక్సమాస మూర్ఖ నిర్వచనము చేసి యుందురు.

5. హజారము—దర్బారు అను నర్థములో వాడుదురు. ఫార్సీ హజారీ నుండి వచ్చియుండును.

6. హసాదు—"చిత్తము అట్లే" అను నర్థము హాస్రాబ్ అను దాని నుండి యేమో?

7. చొక్కా—అంగీ. ఫార్శీలోని "చాగా" నుండియే వచ్చినది. ఏస్సం దేహము.

8. కాగితము—ఫార్సీ-కాగజ్ నుండి.

9. బులాకి—ముక్కుకొనను అలంకారముగా (?) వాడుకొను ఆభరణ విశేషము. ఫార్సీలో "బులాఖ్" ఈ ఆభరణమును ముసల్మానులే తెచ్చి ఈ దేశ స్త్రీల ముక్కుల కెక్కించినారేమో, ఆలోచించుడు.

10. కందిల్—హైద్రాబాదులో ప్రయుక్తము దీపమని యర్థయు ఇంగ్లీషు క్యాండిల్ Candle నుండి వచ్చినదీ వెలుగు.

11. గడ్డినూనె—ఉత్తర సర్కారులలో నున్నదో లేదో కర్నూలులో, నిజాం రాష్ట్రంలో కొన్ని భాగములలో కిరోసిన్ నూనెకు పర్యాయ పదముగా నున్నది. కిరోసిన్ నుండి గ్యాస్ కూడ వచ్చును. కావున గ్యాసును ముసల్మానులు 'ఘాస్‌నూనె'నుగా జేసిరి. ఉర్దూలో ఘాస్ (ఘాసశబ్దమే) అనగా గడ్డి కావున కిరోసిన్ గడ్డినూనె అయినది.

12. చీనా గొలుసు—ఇది నంబి సోమయాజివంటి పదము. ఇంగ్లీషు చైన్ (Chain) అనగా గొలుసు. ఆక్స్ OX ఎద్దు అన్న చదువు పరిణామమే

చైన్‌గొలుసు తుదకు చైనా గొలుసు, చీనా గొలుసు అయినది. (చీనా దేశమున కిప్పుడిప్పుడే గొలుసు సంబంధము కలుగుచున్నది.

13. తంబలి—ఒక శైవజాతి - తాంబూల శబ్ద భవమని తలతును. పూర్వము ఒక్కొక్క జాతి ఒక్కొక్క వృత్తి. నంబులకు పూజయే కాక పూలను వర్తనగా తెచ్చియిచ్చుట ("నంబి వాడిచ్చిన గన్నేరు పూవులు" అని శుకసప్తతి కారుడు) అటులే తంబలవారికి గ్రామములో తమలపాకుల నిచ్చుట.

14. యోజన—ఈ శబ్దము ఒక యూర పొడవగును, ఒక చోట చిన్న దగును. కొందరు పది మైళ్ళందురు. కొందరు ఎనిమిది, మరికొందరు ఆరు మైళ్లు యుజ్యతేతి యోజన. ఎద్దులను బండికి కట్టుట యని యర్థము. అనగా ఎద్దులబండి ఒక దినములో ఎంత దూరము పోవునో అంతదూరము. అది ఐదు మైళ్ళ నుండి పది మైళ్ళు కావచ్చును. బాటలను బట్టి యది నిర్ణయింపదగినది.

15. సెమ్మె—దీపము పెట్టు స్తంభము అని యర్థము. ఫార్సీలో "షమ" అనగా దీపము (దీప స్తంభము కాదు) దాని నుండియె మన సెమ్మె ఏర్పడినది.

16. కాక పక్షము—గిర్జాలు, జుంపాలు. కాకి రెక్కల వలె ఉభయ పార్శ్వములం దుండునవి. శ్రీరాములకు కాకపక్ష ముండెనని వాల్మీకి అభిప్రాయము.

17. కవాట—పాణిని కాలములో మన దేశమందు తలుపులు చిన్నవిగా నుండె నేమొ. క = తలను, పాట యతీతి = పగుల గొట్టునది కనుక - కవాట మయ్యెను.

18. కీసర—కీస అని కూడ యందురు. జేబు అని యర్థము. ఈ జేబు కూడ అన్యదేశ్యమే. (మన పూర్వులకు జేబులు లేకుండె నన్నమాట. మన మెప్పుడును పరులకై జీవించువారము కాన మనకు జేబు లెందుకు ?) కీసర్ అని ఫార్సీ రూపము నుండి వచ్చినది.

19. దుహిత—బిడ్డ అని యందరకు తెలిసినదే. ఈ శబ్దార్థము రెండు విధములు. ఈ అర్థములో ప్రాచీనుల ఇంటి బిడ్డయొక్క స్థానము విశదమగును.

దుహ్ ధాతువు. పితుకుట అను దాని నుండి వచ్చినదీ పదము. పూర్వము ఇంటి యాడుపడుచు దినము అవులను, బర్రెలను చూచుకొనుచుండెనని యూహ్యము. ద్వేహితా - రెండు కుటుంబములకు - పుట్టినయింటికి మెట్టినయింటికి హితురాలు అగుట కావచ్చును.

20. పునాస—వర్షకాలారంభమున విత్తునట్టి పంటకు అర్థము. పునర్వసు కార్తిలో సజ్జలు, కొర్రలు మున్నగునవి వేయుదురు. ఈ పునర్వసు నుండియె పునాస పదముద్భవించినదని నా యూహ.

21. అక్ష (మాల) —

శ్లో. ఆదిక్షాంతార్ణయోగిత్వా దక్షమాలేతి కీర్తితా
తద్వర్ణ సంఖ్యైర్మణిభి ర్జపమాలాం ప్రకల్పయేత్

— శారదా తిలకము —

22 ఏడుగడ —

క. గురుడును (1) తల్లియు (2) దండ్రియు (3) బురుషుడు (4) విద్యయును (5) దైవమును (6) దాతయు (7) నాఁరి నేడు గడయు దానై
హరి ననురక్షించుగాతన ననవరతంబున్

— వాసిష్ఠము—

23 హెగ్గడి—ద్వారపాలకుడు. బహు భార్యాయుక్తులగు రాజులు నాటికి నేటికి తమ దేవిడీలవద్ద పురుషుల పహిరాను అంతగా పసందు చేయరు. నపుంసకులను అంతఃపురమువద్ద కావలి పెట్టుచుందురు. ఉర్దూలో హిజ్డా అను పదముయొక్క అపభ్రంశమీ హెగ్గడియై యుండును.

24. చిలువ—చీలిన - వ - నోరు కలది - పాము.

25. నలువ—నాల్గు-వ-మోములవాడు. ఇట్లే గట్టివ మున్నగునవి.

26. కింపచ—దరిద్రుడు - ఈ దినమేమి వండుకుందునా అని చేతులు పిసికికొనువాడు.

27. ముత్తైదువ—అయిదు వన్నెలు కలది - మంగళసూత్రము, పసుపు, కుంకుమ, గాజులు, చెవ్వాకు - కడపటిది అరవల సొమ్ము. తెలుగు స్త్రీలకు మట్టియలు-(మెట్టెలు).

28. హురుమంజి—హురుమంజి ముత్యములు. పర్ష్యాదేశపు సంధిని హురుముజ్ సంధి యందురు-(Gulf of Hurmuz). పూర్వము మన దేశానికి సముద్ర భాగము నుండి తీసిన ముత్తెములు విశేషముగా నెగుమతి యగుచుండెను.

29. నంగనాచి—ఈ పేరు గలది ఏలేశ్వరోపాధ్యాయుల కూతురనియు నామెనొక కంసాలి తన కులము దాచి వివాహమాడెననియు తదనంతరమామోస మెరిగి యామె యాత్మహత్య చేసుకొనెననియు అప్పటినుండియు "ఎంతటి నంగనాచివే" అనిన "ఎంతటి సాహసురాలవు" అను సామెత యయ్యెననియు కొందరందురు. హిందీలో నగ్నము (నంగా)గా ఆడునట్టి (నాచ్) స్త్రీల నృత్యమునకు నంగా నాచ్ అందురు. ఈ నృత్యముచేయు స్త్రీ సాహసికురాలు కాదా! అంతటి సిగ్గు విడిచిన దను నర్థము ప్రయుక్తమే కాని ఏలేశ్వరోపాధ్యాయుని కూతురునకు మంచి పేరు దొరకక యంతటి సుందర నామము పెట్టి యుండరు.

30. మోజాలు—బగ్దాదు పాదరక్షలకే యీ పేరుండెను. ఆ దేశము నుండి దిగుమతి యగుచుండెను.

31. దేవర—ద్వితీయో వరః. మరది వితంతువైన వదినెకు నియోగ న్యాయముచే ద్వితీయ వరుడై యుండెను. ఉర్దూ, హిందీ భాషలలో నీ పదమే (దేవర్) అని నేటికిని మరదికి వాడుచున్నారు.

32. దరుబేసి—యోగి. ఫార్సీలో దర్వేష్. ఒక తెనుగు కవి (శృంగార అహల్యా సంక్రందన మేమో?) యీ పదమును ప్రయోగించినాడు.

33. వర్గ— అధ్యాయము, భాగము, ప్రకరణమను నర్థము. ప్రాచీన కాలములో గ్రంథములు ఆకులపై వ్రాయుచుండిరి. ఫార్సీలో బర్గ్ అన ఆకు. (బవయోరభేదః - వర్గ్).

34. సూక్త— (హోమము చేయునప్పు డుచ్చరించు) మంత్రము. ఫార్సీలో సొఖ్త్ అన కాల్చుట, వ్రేల్చుట అని యర్థము.

35. పుస్తకము—పార్సీలో పొస్తక్ అన చర్మము. బహుశః ప్రాచీన మందు గ్రంథములకు జింక చర్మములు మున్నగునవి అట్టలుగా నుంచుచుండిరో లేక చర్మపు సంచులలో గ్రంథముల భద్రపరచుచుండిరో యని దీనివలన గ్రహింపవచ్చును.

36. ద్విబిస్తా—బిస్తా 80 రతుల తూకపు బంగారు నాణెము. (సూ. ఆపరిమాణ బిస్తా చితకం బల్వేభ్యోనతద్ధితలుకి) రెండు బిస్తలకు కొన్న దానిస స్త్రీ.

37. పంచాశ్వా—అయిదు గుర్రములిచ్చి కొన్నట్టి దానిస స్త్రీ. ఈ రెండు పదములను బట్టి ప్రాచీనార్యులలో దానిసలను కొనుటయు, వ్యాపారమందు దానిసల విలువయు వెల్లడి యగుచున్నది.

38. చండాల—సుప్రసిద్ధుడే! పార్సీలో నీచుని జందాల్ అనిరి.

39. దేవ అసుర — ఈ పదములకర్థము పార్సీలో అపసవ్యముగా నున్నది. దేవ్ అన భూతము లేక రాక్షసి అని, అహుర్ (పార్సీలో సకారమునకు హకార ముంచుదురు. ఉ॥ సప్త = హప్త. సింధు = హిందు) అనగా పార్సీ మతమున మంచి దేవత. పార్సీలు, ఆర్యులును మొదట ఏకస్థులుగానుండి సురాసుర పూజాదులందు భేదాభిప్రాయులై వేరైన నాటనుండి యీ పరస్పర విరుద్ధార్థములు ప్రారంభమై యుండును.[1]

* * *

1935 లో ప్రబుద్ధాంధ్రలో నేను "కొన్ని శబ్దముల కథలు" అను విషయముపై చర్చించి యుంటిని. ఇప్పుడు మరి కొన్నింటిని గూర్చి నా ఊహలను తెలుపుకొందును. అందు సగము తప్పయినను మిగిలినవి సరియగుచో ఈ చర్చవల్ల నష్టము లేదని అనుకొందును.

1. ఇంతవరకు ప్రబుద్ధాంధ్ర (1935 సెప్టెంబరు) పత్రికలో ముద్రితము. ఇకముందు భాగము గోలకొండ పత్రిక (21-3-45, 28-2-1386 ఫ.) లో ప్రచురితము.

1. టక్కు —

టక్కులాడు, టక్కరి అను పదాలు టక్కునుండి వచ్చినవి. నాకు తెలిసినంతవరకు ఈ పదాన్ని ఒకరిద్దరు కవులే పూర్వములో వాడినారు. నాచన సోమన "తిరిపెపు కూడు దెచ్చి" అను పద్యములో "టక్కరి బలుమోపు మోచు నయగాకితనంబడియుట్టిగట్టినన్" అని ప్రయోగించెను. క్రీ. శ. 17 వ శతాబ్ది తర్వాతి కవులీపదాన్ని ఎక్కువగా వాడిరి. ఠగ్ అను హిందీ పదము కలదు. ఠగ్గులు ప్రసిద్ధులే. మన డక్కు నుండి ఠగు అనునది వచ్చెనా? లేక ఈ రెంటికినీ మూల సంస్కృత పదము కలదా?

2. మ్లేచ్ఛ—

ఈ పదము బలూచ్ పదము నుండి ఏర్పడినదని మాక్సుమూలర్ అభిప్రాయము. బెలుచిస్తాన్‌లోని వారు ఆర్యావర్తము సరిహద్దులోనివారు వారనార్యులుగా ఉండి అపభ్రంశమును మాట్లాడిన వారని మహర్షి పతంజలి అభిప్రాయము.

3. బఱ్ఱెంక పూలు—

బఱ్ఱెంక అను విష వృక్షమొకటి మహబూబునగరులో కలదు. కాని ఆదిలాబాదు జిల్లాలో పారిజాత పుష్పాలను బఱ్ఱెంక పూలని అందురు.

4. శరభము—

మన సంస్కృత కవులు "సింహ శరభ శార్దూలములు" అని చాలా వర్ణించేవారు. శరభం ఎట్టి మృగమో ఎవ్వరున్నూ చూడలేదు. ఈ పదము అసీరియా నుండి వచ్చినట్లు కానవచ్చును. అసీరియాలో Cherub అను ఊహా మృగాన్ని భయంకరముగా చిత్రించేవారు. దేవతలు దానిపై స్వారి చేసినట్లు చిత్రించుచుండిరి చెరుబిం (Cherubmim)అను పదము లాటిన్ లోనికినీ ఎక్కెను ఆ చెరుబిం పదమే మన శరభం అయినదేమో?

5. ఖుదా—

దేవుడు అను ఫార్సీలో అర్థము. ఇది సంస్కృతంలోని స్వధా అను పదము నుండి యేర్పడి యుండును. సకారము ఫార్సీలో ఖకారముగా మారును. స్వసుర ఖుసర్ అయినది.

**6.** జగడము—

హిందీలో ఝగడా ఏది మొదటిది? భారతములో యుద్ధవర్ణనలు నిండుగా ఉండినను జగడము అను పదము కానరాలేదు. హిందీ నుండియె తెనుగులోనికి వచ్చెనేమో?[1]

**7.** కుల్లాయి—

పొడుపైన బట్టటోపి కర్థము. విజయనగర చక్రవర్తుల కాలములో పలువురు హిందూ ముసల్మానులు మూరెడు పొడవు గలిగి తలక్రిందులుగా ఉంచిన కాగితము పొట్లము వంటి టోపీని ధరించేవారు.

"కుల్లాపెట్టితి కోక జుట్టితి మహాకూర్పాసమున్ దొడిగితిన్" అని శ్రీనాథుడనెను. ఫార్సీలో కులా: అనగా టోపి. ఇది ఫార్సీవారి నుండి మనవారు తీసుకొన్న ఆచారము.

**8.** పంతులు—

ఈ పదమును ఇప్పుడు నియోగులు తమ బిరుదు పదముగా వాడుకొనుచున్నారు. తెనుగు దేశములో చదువు చెప్పే ఉపాధ్యాయుని పంతులు అని అంటారు. ఈపదము తెనుగు వాఙ్మయములో కానరాదు. ఇది మరాటీ పదమని తోస్తున్నది. పంథ్ అనునది మరాటీ పదము. మరాటీ బ్రాహ్మణోద్యోగులు ఆ పదాన్ని తమ పేరుల తుదిలో నుంచుచునుండిరి. మోరో పంథ్ వంటి విట్టివే, పంథ్ బహువచనము మన పంతులు అయియుండును. ఇది గోలకొండ నవాబుల కాలములోను పీష్వాల కాలములోను తెనుగు దేశములోనికి వచ్చినట్లున్నది.

**9.** ఫిరంగి—

ఇంగ్లీషులో క్యానన్ అందురు. ఈ పదము ఫ్రెంచివారి నుండి యేర్పడినది. ఫ్రెంచివారే ఫిరంగీలు వారుతెచ్చిన మారణయంత్రమే ఫిరంగి. ఈ పదాన్ని

---

1. జగడము ఝకటము అను సంస్కృత పదమునుండి వచ్చినదని ప్రతాపరెడ్డిగారు తర్వాత ఒక చోట వ్రాసుకొన్నారు.

క్రీ. శ. 1600 తర్వాత కవులెక్కువగా వాడినారు. అంతకు పూర్వమీ పదము మన వాఙ్మయములో లేదు.

**10.** గేరి—

వాడ, వీథి అని యర్థము. రాయలసీమలో, మహిబూబ నగరు జిల్లాలో వాడుదురు. మాదిగగేరి, బాపనిగేరి, కాపగేరి అని కన్నడములోని కేరి అను పదమే గేరి అయినది.

**11.** కురువ—

గొల్లజాతిలోని ఒకజాతి. కన్నడములో కురి అనగా గొర్రె. కురికి సంబంధించిన జాతి కురువగా ఏర్పడియుండును.

**12.** అడకొత్తు—

కన్నడములో అడకె అనగా వక్కదానిని ఒత్తునది అడకొత్తు.

**13.** క్రమేలక—

ఒంటె ఇంగ్లీషులోని క్యామెల్ అనునది దీనికి దగ్గరి పదము. ఇది సెమిటిక్ భాష నుండి సంస్కృతములోని కెక్కిన పదమని భాషాతత్వ శాస్త్ర వేత్తల అభిప్రాయము.

**14.** మేలా—

సంస్కృతములో మసి-సిరా-అనుదానికి వాడుదురట. మేలాంధుక అనగా మసిబుడ్డి Ink pot అట. ఇది గ్రీకు భాషనుండి సంస్కృతములోనికి వచ్చినదట.

**15.** లిపి—

ఇది పురాతన పార్సీ నుండి సంసత్కృతములోని కెక్కెనని భాషాశాస్త్ర వాదుల వాదము. పాణిని నాటికిది మన సంస్కృతములో నుండినట్టిది.

**16.** శేరక—

వ్యాఘ్రము-అను నర్థములో సంస్కృతములోని కెక్కెనట. పార్సీ షేర్ పదాన్ని సంస్కృతములో శేరక అన్నారట.

**17.** శిరోబంధనము—

రుమాల. ఫార్సీలో సర్‌బంద్ అందురు. అదే ఇంగ్లీషు టరుబన్ అయ్యెను.

**18.** సమరె హింద్—

చింత చెట్టు ఈరాన్‌లో లేనిది-ఫార్సీలు దీనికి హిందూదేశపు (సమర్) పండ్ల చెట్టు అనిరి- అదే ఇంగ్లీషులో టామరండ్ అయ్యెను.

**19.** సిస్తు—

శిష్టము (పరిశిష్టము) నుండి వచ్చియుండును. సేద్యము ఖర్చు కూలి ఇంటి బత్తెముపోగా మిగిలినది. (శిష్టము) రాజుకు చెల్లించుట అను నర్థములో వాడియుందురు.

**20.** వరహా—

మూడున్నర రూపాయి - విలువగల బంగారు నాణెము. విజయనగర రాజుల కాలములో ఆ నాణెములపై వరాహ చిహ్నముండెను వరాహమే వరహా అయ్యెను. ఆ నాణెమునకు రెండవ ప్రక్కన దేవాలయ చిహ్నముండినందున ఇంగ్లీషువారు దానిని పగోడా అనిరి.

**21.** తత్తెరేని—

మట్టితోచేసిన గుండ్రని కూజా. దీనిని ఉత్తర సర్కారువారు తాబేటిబుర్ర అని యందురు. తత్తెరేని పదము కర్నూలు మండలము రాయచూరు పాలమూరు జిల్లాలలో వాడుటను ఎరుగుదును. శబ్దరత్నాకరములో తత్తెర అను పదమిచ్చి దానికి సారాబుడ్డి అని యర్థము వ్రాసినారు. వ్యవసాయకులు పొలాలకు వెళ్ళు నప్పుడు తాబేటిచిప్ప వంటి యాకారముకల మట్టికూజాలో నీరు తీసుకొనిపోదురు. దానిని తత్తెరేని యందురు.

**22.** మేజువాణి—

ఉత్తర సర్కారులలో భోగము సానుల ఆటకు మేజువాణి యందురు. ఇది ఉర్దూలోని మేజ్‌బానీ అను పదము యొక్క అపభ్రంశరూపము. మేజ్‌బాన్ అనగా విందునిచ్చువాడు. మేజుబానీ అనగా విందు. సాహెబులలో విందులలో

పూర్వము నాచ్ ప్రధానముగా నుండెను. అందుచేత మనవారు సానుల ఆటకు వారి పాటకచ్చేరీకి మేజువాణి అని పేరు పెట్టినారు.

**23.** పోటి—

బాలిక అని అర్థము. ఇది అల్పార్థమందు తక్కువ వారి పిల్లలను పిలుచుటకై వాడుదురు. కాని పూర్వము గొప్పవారి కూతుండ్ర కే పదమును వాడిరి. వేంగీ చాళుక్యులలో మంగిరాజు క్రీ. శ. 701-725 వరకు వేంగీ రాజ్యమును పాలించెను. అతని కూతురు పేరు "పృథివీ పోటి" అని అతని శాసనములో వ్రాసినారు. పోటి శబ్దము ఇప్పుడు తెలంగాణాలో చాలా ప్రాంతాలలో విరివిగా వాడుకలో కలదు. పిల్లవానిని పోటడు, పోటగాడు అని యందురు.

**24.** వంద—

నూఱు యని యర్థము. ఈ పదము భారతములో కానరాదని నా నమ్మకం. ఇతర పూర్వ కవులలో, మధ్యకాలపు కవులలోను ఇది కానవచ్చినటుల నాకు తోచదు. మరి యిదెట్లేర్పడెను ? ఈ పదము తెలంగాణాలో, రాయలసీమలో జన సామాన్యమందు వాడుకలో లేదు. ఉత్తర సర్కారు వారిని జూచి తక్కిన వారు వందయనుటయే బాగని ప్రయోగించుటకు నేర్చుకొనుచున్నారు. బహుశ బృంద (సమూహము) అను పదము యొక్క తద్భవముగా ఈ వంద అను పదమేర్పడెనేమో ?

**25.** కరడా—

ఇప్పుడు బళ్ళలో కాపీలు వ్రాయింతురు. అందుచేత కాపీ వ్రాయుట అని మనము వ్యవహరించుతున్నాము. కాని మనకు కాపీ శబ్దమునకు సరియగు పదము కలదు. అదే కరడా అను పదము. ఈ శబ్దము నిఘంటులలో లేదు. తెలంగాణాలో ఇది విరివిగా ప్రయోగింపబడుతున్నది. అక్షరాలు బాగా కుదురుటకై మంచి అక్షరాలను ఒరవడిగా నుంచుకొని వ్రాయుటకు కరడాలు వ్రాయుట అని యందురు.

**26.** అరి కంతము—

తల చెవులు మూసుకొను నటుల వస్త్రమును చలినాపుటకు చుట్టుకొనుట కందురు. ఇది నిఘంటులలో లేదు.

## 27. మాంగో—

మామిడి పండు అను నర్థము కల ఇంగ్లీషు పదము. ఇంగ్లండులో మామిడి చెట్లు పండ్లులేవు. ఈ పదాన్ని మన దేశమునుండే తీసుకొనిపోయియుందురు. మచిలీ బందరులో మొదట ఇంగ్లీషువారు మొఖాము వేసిననాడు తెనుగువారి నుండి మావికాయ మాగాయ అని దాని పేరు తెలుసుకొని దానినే మాంగో అని మార్చుకొని యుందురు.

## 28. దుముదారు—

**rear gaurd** అని యింగ్లీషులో దానికి సరియగు పదము. సేనకు వెనక భాగమందుండి శత్రువుల నుండి రక్షించుటకై నియుక్తులగు సేనానులకీ పదమును విజయనగర చక్రవర్తుల కాలములో వాడినారు.

"సకుటుంబముగ వీగి చరమ శైలము చేరు
తుహినాంశు దుముదారు దొరయనంగ"

మనుచరిత్ర. ఆ 3 ప. 54

ఇచ్చట దుముదారు అన సేనా నాయకుడని అర్థము వ్రాసినారు. సేనకు వెనక దిక్కుననుండు రక్షక సేనాని యనుటయే స్వారస్యము. దుముదారు అనునది దుందార్ అను ఉర్దూ పదము. దుం అనగా తోక దుందార్ అనగా తోక దిక్కుండువాడు అని యర్థము.

## 29. తాయెతు —

దీన్ని గూర్చి అప్పకవి ఒక వ్యుత్పత్తిని చెప్పసాహసించెను. "ఎత్తులనగా దక్షిణ దేశీయమున దండలకు పేరు. దాని జడ్డన తేలబలికిన ఎతు లాయెను. తాయి అనగా తల్లి. ఆ తాయి శిశువులకు శరీర రక్షగా కట్టునవి యెత్తులు కనుక తాయెతులు'' అని వ్రాసెను. అప్పకవి తనకు పూర్వము ముద్దరాజు రామన తాయెత్తును తాయతు అని వ్రాసి యుండెనని యాక్షేపించెను. మరియు తనకు పూర్వుడైన కవి తన చంద్రభాను చరిత్రయం దిట్లు వ్రాసెనని యుదాహరించెను.

"ఒక యింతి యొరగిన సికమీద ముడి పువ్వు
టెత్తులు దొరయు తాయెతులు చుట్టి"

చంద్రభాను చరిత్రమును వ్రాసిన తరిగొప్పుల మల్లన కవి క్రీ.శ. 1600 ప్రాంతము వాడని ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారు పీఠికలో వ్రాసినారు. తరిగొప్పుల మల్లన ముద్దరాజు రామన కంటే పూర్వకవు లెవ్వరును తాయెతు శబ్దమును ప్రయోగించి నటుల కానరాదు. అనగా క్రీ.శ. 1500 తర్వాతనే యీ శబ్దము తెనుగులోనికి ప్రవేశించిన దనవలెను. ప్రవేశించిన దగుటచేత ఇది విదేశీ శబ్దమై యుండవలెను. అప్పకవి భ్రమించినట్లుగా ఇది దక్షిణ దేశీ పదము కాదు. ఎత్తు లేక ఎతు అను పదాలకు దండ (హస్తముపై భాగము) అను నర్థ మెందును కానరాదు. నిఘంటువులలో గాని ప్రయోగాలలో గాని ఈ యర్థము కానరాదు.

ఇక ఈ పద మెక్కడిదనగా ఇది అరబీ పద మనవలెను. అరబీలో తావీజ్ అను పదము కలదు. అరబీ నిఘంటువులలో దాని కర్థము చేతులకు కట్టుకొనే ఖురాను మంత్ర విషయిక రక్ష అని వ్రాసినారు. తెనుగు దేశముపై గోలకొండ సుల్తానుల పరిపాలనము క్రీ.శ. 1612 నుండి స్థిరపడెను. వారి పరిపాలనములో ఫకీరులద్వారా హిందువులు తావీజులను పొంది అవి తమకు సకల పీడా నివారక రక్షలుగా నుండునని భ్రమించిరి. తావీజు శబ్దమే తెనుగు నోళ్ళలో నలిగి తుదకు తాయెతు రూపము దాల్చెను. దీని పుట్టుకను సరిగా గుర్తించక తానేమో సరిగా నుచ్చరించినట్లు తలచి మల్లనను ఆధారము చేసుకొని ముద్దరాజు రామన్నను తప్పు పట్టిన అప్పకవి శాసనమును ఎవ్వరును అవుగాదనిన వారు కారు.

# నన్నెచోడుఁడు

నన్నెచోడుని కాలము వివాదఁ గ్రస్తము. ఆదిమ కాలమునందీకవి ఏలనో వెలుగుజూడని వాడైనాఁడు. ఇరువదియవ శతాబ్దిదనుక నీతని రచనలకు నవి యున్నవను సంగతి తెలియరాలేదు.

తత్కవికాల విషయమై స్థూలముగా నాలుగు వాదములున్నవి. పలువురు తదనుగుణ భావవ్యక్తీకరణ గావించిరి. అందు, నన్నయకు ప్రాచీనుఁడుగను, నన్నపార్యునకు సమకాలికుఁడుగను, ఆది కవికిని కవిబ్రహ్మకును నడిమి కాలము వాడుగను, ఉభయకవి మిత్రునికి తరువాతివాడుగను, గన్పట్టి సందేహపుటూయల యందూగుచున్నాడు.

నన్నపార్యునకు సోమయాజికి నడుమ కాలము వాడని పెక్కురభిప్రాయమగుటంజేసి తద్రచయితనట్లే స్వీకరించుట ఉచితము.

## రచనలు - బిరుదములు - కవితారీతులు

సూర్యవంశ క్షత్రియ, కాశ్యపగోత్ర, చోడబల్లి, హైహయాన్వయాంబర శశిరేఖల యనుంగు పుత్ర, నన్నెచోడ నామాంకిత మహాకవి "టెంకణాదిత్య" - కవిరాజ శిఖామణి" బిరుధేయుడై యొప్పెను.

శివభక్తాగ్ర గణ్యుండైన యీతని గురువరేణ్యుడు ''జంగమ మల్లిఖార్జును" డుగ గురితింపబడినాడు.

అదియునుంగాక నాతడే ఇక్కృతికన్య స్వీకర్త. అచ్చటచ్చట ఈశ్వరునకు సద్గురువునకు నాతడభేదము చూపుట వలనఁబరమేశ్వరుడే ఈతని గురువు కానోపునను సందియమ్మింపుక బొడసూపక తప్పదు.

'కుమారసంభవము'' కళా విలాసమను కవితా కన్నియం సృష్టించిన నన్నెచోడుఁడు ప్రప్రథమముగ షష్ఠ్యంతముల బ్రవేశపెట్టెను.

ఉద్భటుని సంస్కృత కృతి దీనికి మూలమని తెలియనగును.

తారకాసురమర్దనుని చరితయందు, సంస్కృతమునలేని ''దక్షయజ్ఞ'' చరితమును ఈతడు తన కావ్యమున ప్రవేశపెట్టెను. గణపతి జననము సైత మీతని కృతియందు విశేషము.

శ్రీకారముతో ప్రారంభించి (మంగళమహా) శ్రీకారములో ముగించు పద్ధతి గూడ నీతఁడే ప్రవేశ పెట్టెను.

"'మ' గణముగదియరగణము
వగవక కృతి మొదట నిలుపు వానికి మరణం
బగునిక్క_మంద్రు, మడియఁడే
యగునని యిడి తొల్లి 'బెంకణాదిత్యుడనిన్''

నన్నెచోడుఁడు తత్కారణముగ యుద్ధమున మడిసెనని అభిప్రాయ పడుచున్నారు

నన్నెచోడునిది వస్తుకవిత. అనగ వస్తు ప్రధాన కవితయని విన్నకోట పెద్దన వచించెను.

ప్రకృతి పరిశీలనము నందును, వర్ణనానైపుణియందును సిద్ధహస్తుడైన చోడుఁడు తనంతతానే తనది వస్తు కవితయని చెప్పుకొనినాడు.

"నింగిముట్టియున్న జంగమ మల్లయ
వరమునందుఁగనిన వస్తుకవిత
దగిలివారి యందనెగ డింతురవికిదీ
పమునరర్చలిచ్చు పగిదివోలె''

"జంగమ మల్లికార్జునుని సర్గకవి స్తవనీయ సూక్తి యు
క్తింగొనియాడి సత్కవితఁ గానము లేకసుర క్తియైన భా
షాంగనఁ దక్కనేలిన మహత్వము లోకమునం ప్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ ప్రబంధము సద్రసబంధురంబుగాన్''

ఆశ్వాసాంతమున కందమును వాడుట పరిపాటికాగా నన్నెచోడు 'మాలిని' వాడినాడు. తదుపరి కవులెల్లరకును ఇందు మార్గదర్శకుడైనాడు. 'వనమ

యూర' వృత్తమును తృతీయాశ్వాసాంతమున విరచించినాడు. చతుర్థాశ్వాసాంతమున 'వసంత తిలక' వృత్తమును రచించెను. "వసంత తిలకం భాతి సంకరే వీరరౌద్రయోః" అనుటంజేసి పంచమాశ్వాసమును సంభవింపనున్న కంతుని వీర విక్రమమును, రుద్రుని రౌద్రమును సూచించెనని నుడువ వచ్చును.

## శార్దూల విక్రీడితము

శార్దూల విక్రీడితము జెప్పుటలో తిక్కన ప్రసిద్ధుడని చెప్పుటకుదాహృతమున ఈ పద్యమును సూచింతురు.

"సింగం బాఁక టితో గుహాంతరమునం జేట్పాటుమైనుండి మా
తంగ స్ఫూర్జిత యూథ దర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జంగాంతార నివాస ఖిన్నమతి నస్మత్సేనపైఁ వీడే వ
చ్చెంగుం తీసుత మధ్యముండు సమరస్థేమాభిరామా కృతిన్"
ఇంతటి నేర్పితనికి నేర్పిన వాడు నన్నె చోడుడుగా నోపును.
"భర్గుండంతక వాహినుల్ ............ మద్బాణ వర్షంబునన్"
"వీరే కాదశరుద్రులష్ట వసువుల్
............సుమహద్విఖ్యాత కార్తీశ్వరా!

శౌర్య వర్ణనతో నిండియున్న పై పద్యములన్నియును అతనెంత జాగరూకతతో తూచి తూచి వ్రాసినాడో తెలియనగును.

ఒక్క శార్దూలమునకే.గాక తక్కిన పద్యముల వాడుట యందుకూఁడ నన్నెచోడుఁడు ఔచిత్య పోషణ గావించినాడు.

## కందము

కథా గమనమును శీఘ్రతర మొనర్చుటకి కందము మిక్కిలి యనుకూలము. చోడుఁడు వాడిన పద్యము లనివియేనెక్కుఁడుగ నున్నవి.

"తగుఁ దగదని మనమును
వగవగ నొడబడగ వగవ వగవగ బడయున్

దగుదగదని వగవని వగ
వగవగఁబని గలదె తనకు వగమఱి జగతిన్"

ఇది సర్వ లఘు కందము. దీని నడక చూచిన పోతరాజు "లక్ష్మినడక" మనకు జ్ఞప్తికి రాక దప్పదు. కనుక నీ విషయమునకు ఆతనికితఁడు మార్గదర్శకుడైనాడు.

తన చిత్తము వచ్చినట్లు కందమును నడపించినవాడీతఁడు. ఎన్ని పోకలవలంబించిన నన్ని పోకలం బోయినది. దుష్కర ప్రాసముతోఁ బొల్లు మాటలు లేక వచనమువలె సాగిపోయిన కందములీతని కృతియందనేకములు.

"చక్షు మదనేంద్రియములుము
ముక్షులు మదిగెలుతురెఱిఁగిమునుశ్రోతృత్వ
కుక్షుర్జిహ్వా ఘ్రాణస
పక్షగ వాక్పాణి పాద పాయూపస్థల్"

శ్లేషాభి రామమగు కందము నడచిన తీరు :-

"కమలాభి శోభితము హరి
రమణీయము విద్రుమాభి రామము శుకర
మ్యమునై గగనాబ్ధులతో
సమమై వనమధ్య జలజషండం బొప్పెన్"

## "చతుర్విధ కందము"

"రెండవ చరణంబునకున్
రెండవ గణమాది గాగ నిర్మించినచో
దండిఁ జతుర్విధ కందము
పాండవ పక్షా! మెలంగు ప్రాజ్ఞుల సభలన్"

## నన్నెచోడుని చతుర్విధ కందము

### ప్రథమ కందము

"సుజ్ఞాన యోగతత్వవి
ధిజ్ఞులు భవ బంధనముల ద్రెంచుచు భువిలో

నజ్ఞాన పదముఁ బొందక
ప్రాజ్ఞులు శివుఁగొల్తు రచల భావనఁ దవులన్"

ద్వితీయ కందము

భవ బంధనములఁ దెంచుచు
భువిలోన జ్ఞాన పదముఁ బొందక ప్రాజ్ఞుల్
శివు గొల్తు రచల భావనఁ
దవులన్ సుజ్ఞాన యోగతత్వ విధిజ్ఞుల్"

తృతీయ కందము

"అజ్ఞాన పదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుగొల్తు రచల భావనఁ దవులన్
సుజ్ఞానయోగతత్వవి
ధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో"

చతుర్థ కందము

"శివు గొల్తు రచల భావన
దవులన్ సుజ్ఞాన యోగ తత్వ విధిజ్ఞుల్
భవబంధనములఁ ద్రెంచుచు
భువిలోన జ్ఞాన పదముఁ బొందక ప్రాజ్ఞుల్"

## సీసము

కవి రాజు క్రొత్త మార్గమునకుఁ దిప్పి సొగసుగా రచించిన మఱియొక పద్యము సీసము. చోడుని సీసములందు తూఁగు సీసములే మెండు.

"వెలిమిడిన లికంబు చెలుపంగఁ బోవుచోఁ
దెలుపారమై నిండ నలది కొనుచుఁ
బూవులు దుఱుమంగఁ బోవుచో వెలిగొంత
దోపంగ నడ్డంబు దురిమికొనుచు

మోవిలత్తుక బూయఁ బోవుచోలాలాట
పట్టిక దిలకంబు పెట్టికొనుచు
కాటుక మెదుచుచు గన్నులనిడబోయి
పొల్తుక గళమున బూసికొనుచు

సితరుచిం, దుఖండ, శిఖి నేత్ర గరళంబు
లొడల, దలను, నుదుట, మెడను, దాల్చి
పొల్చు శంభు నోర్తు పొలిచూపఱుదన
కెఱగుచుండ వచ్చె నీశుజూడ"

సీసము చమత్కారముగా నుండుటకు మరియొక కారణము గీత పద్య మద్దానికి జీవము పోయునట్లు మార్చుట. ఈతడు సీస పద్యమును పెక్కు బాటల నడిపించి తరువాతి వారికి మార్గదర్శకుడైనాడు.

## తరువోజ

దేశి పద్యముల ఎడ నభిమానము గల్గిన చోడుఁడు తరువోజ, ఉత్సాహ, లయగ్రాహి లయ హారిణ్యాది పద్యములను సందర్భోచితముగ జెప్పినాడు.

చోడుఁడు తరువోజ పద్యమును దక్షునిచే నల్లునిపై నలిగిన తరుణమున - భార్యకు జెప్పు సమయమున జెప్పించినాడు

రతీ విలాపమును [పంచమాశ్వాసము] గూడ నీ పద్యముననే జెప్పించి నాడు.

"కాయజుఁ డాయగ్నిగా లెనో నెఱయఁ
గాలంగ నెడ యెద్దిగడు భీతి బాఱి
పోయెనో ? ననుఁ బెట్టిపోవునే కడచి ?
పోయిన నీ భస్మపుంజ మెక్కడిది"

విరహావస్థ యందు (పార్వతీ) సైత మీతడు పైని చెప్పిన పద్యమును వ్రాసినాడు.

## లయగ్రాహి

వీర రసాను కూలమైన ఈ పద్యము నీతఁడు మనోహరముగ జిత్రించినాడు.

"ముట్టి గజయూథముల బట్టి రద నాగముల
గుట్టి తెగఁ జీరి పలు తట్టులను వెట్టుం
గట్టి దురదాకి పదఁ జెట్ట మొగపెట్టుఁ బెద
ముట్టుసని వాలముల బట్టుకొని వీడున్
బిట్టడరకేల మెడసుట్టి తెగ నెత్తువడు
నట్టలుశిరంబులును మెట్టలు గొనం బ్రో
పెట్టు జనదట్టు జెడమెట్టునలిగొట్టుఁ గని
కట్టలుకఁ దారక సురారి కరివారన్"

కుమారసంభవములోని వృత్తములకు శ్రీ పర్వములోని వృత్తములను కరణములుగ గన్పట్టును.

## స్రగ్ధర - మహాస్రగ్ధరలు

చోడుఁడు స్రగ్ధరను రెండు పట్టుల యందే వాడినాడు. (గ్రంథాది మంగళా చరణమందును, దక్షాధ్వర విధ్వంసమునను)

మహాస్రగ్ధరను మాత్రము నూట తొంబది పద్యముల, కుమార సంభవమున జెప్పినాడు.

## మంగళ మహాశ్రీ

కావ్యాదిని స్రగ్ధరా వృత్తము నన్నెచోడుని ప్రత్యేక మార్గమయినట్లే కావ్యాంతమున మంగళ మహాశ్రీ వృత్తమును రచించుటయు నీ కవి ప్రత్యేక మార్గము.

ఈ మంగళ మహాశ్రీ యనునది కాకతీయ శాసనముల కానవగును.

## పదపరికరము

'నన్నెచోడుని కవిత్వ మన్య భాషా దూషణగాదేని యుత్తమ'మని పంతులు గారు జెప్పుటకు అతడుపయోగించిన ప్రాంత పదము లాధారముగా స్వీకరింప వచ్చును.

చోడుని కవిత్వమునందాంధ్రేతరములైన తమిళ, కన్నడ భాషా పదము లుండుట సత్యదూరము కాదు.

## జాను తెనుగు

ఇదమిత్థముగా నిర్ణయించుటకసాధ్యమైన ఈ జాను తెనుగు స్వరూప మెట్టిదో జనసామాన్యమునకు సుదూరముననున్నది.

నన్నెచోడుని యనుగామియులో నొకడైన పాల్కురికి సోమనాథుడు జాను తెనుగునిట్లు నిర్వచించినాడు.

"ఉరుతరగద్య పద్యోక్తుల కంటె సరసమై పరగిన జాను తెనుంగు చర్చింపగా సర్వసామాన్యమగుట" (బ. పు).

"పూరిత సంస్కృత భూయిష్ఠ రచన మానుగా సర్వసామాన్యంబుగా మి జానుతెనుగు విశేషము ప్రసన్నతకును (పం. ఆ. చ).

తత్కాలమున వ్యావహారికములగు నాంధ్రేతర పదములనే యాతడుపయో గించెనని అంగీకరించుట కాలంబనముగా, ఆతని తరువాతివారు యా పదముల నుపయోగించుట మనము దీసికొనవచ్చును.

## శతక వాఙ్మయము

శతకరచనకు బీజములు నాటినవాడు నన్నెచోడుడు. దారిద్ర్య విద్రావణా యను మకుటముతో పది పద్యములు వరుసగా నింద్రుడు శివుని స్తుతించినట్లు రచించెను.

## కుమార సంభవము ప్రథమ ప్రబంధము

ప్రబంధములో నితివృత్తమున వస్త్వైక్యముండవలయును తదితివృత్తము పురాణమునుండి గ్రహింపబడినదై, శృంగార రస ప్రధానమై, వీరరసము అంగ రసము కాగా వర్ణనాబాహుళ్యత నొప్పుచు నుండవలెను.

ప్రబంధ శబ్దమును తొలిసారిగ నుపయోగించిన చోడుని కృతి యందుగల ప్రబంధ లక్షణా పరీక్షణ.

**అష్టాదశవర్ణన :**

"వనజలకేళి రవిశశి
తన యోదయ మంత్రగతిరతి క్షితి పరణాం
బునిధి మధు ఋతు పురో ద్వా
హనగ విరహ దూత్య వర్ణనాష్టాదశమున్"

### వనవిహరము :

"తన్నిన జూచె నెందుగడు దైన్యము శోకము, బాహుపీడనం
గ్రన్నన జూచె నీకురు వ కంబును, నెంగిలికల్లు సల్లినన్
మన్నన దప్పపూచె దొరమాయగ గేసరమేము నూచుడుం
గన్నుం సన్న జూచె బిలకంబని దానికి మెచ్చిరంగనల్"

ఈ పుష్పా పచయవర్ణన మనంతర కవులు తూ. చా. తప్పక వర్ణించిరి.

### సూర్యోదయ వర్ణన :

అష్టాదశ వర్ణనలో ఈతదతిమనోహరముగ జిత్రించిన వానిలో నిది యొకటి. శ్లేషాత్మకముగ జెప్పిన ఈ క్రింది పద్యముదాహరణముగ గైకొన వచ్చును.

"రాజరుచివాయగువలయ రమణదఱకె
గలయ దమ్ముల మొగములు నెలమి మిగిలె
శీత కరుడైన రాజు పాసిన ధరిత్రి
వందుగాకెందు దాయలు వగతు రెట్లు"

ఇట్లు చంద్రోదయ, తనయోదయ, మంత్రాలోచన, యాత్రా, సురత, యుద్ధ, సముద్ర, మధుపాన, ఋతు, నగ, పుర, పరిణయ, విరహ, దూత్య వర్ణనలు మనోహరముగా జేయబడినది.

షట్త్రింశదలంకారాలంకృతంబై యొప్పు కావ్య కన్య సృష్టి కర్తయు, ప్రథమ ప్రబంధ కర్తయు, షష్ట్యంత్యశతక, శ్రీకారాది పద్యములకు మార్గదర్శకుడై మాయని కాంతిని గాంచినప్పటికిని, అటు శివకవుల యొక్కయు, నిటు వైష్ణవ కవుల యొక్కయు ఆదరమును బొందలేమి యాతడు వెలుగు చూడలేదు.

అనేక విషయములందనేకులకు మార్గదర్శకుడైన ఈ కవి రాజ శిఖామణి అనల్ప కల్పనాశక్తితో, అపూర్వ వర్ణనాయుక్తితో, అలతి యలతి అలంకారములతో రమణీయాక్షరముల పొందికతో కథను అందముగ, కర్పూర తాంబూలము వలె మంచి యందించి, సమస్త వస్తు కవీశ్వర సూత్న కావ్య రుచిర రత్న పీఠి యెట్లుండవలెనో విశదీకరించి, దశప్రాణంబుల సప్రాణంబై నవరస భావ భరిత మైన రచనతో కావ్య కన్యను నిర్మించి చిరస్మరణీయుడైనాడు.

# దశకుమార చరిత్రము

సంస్కృత వాఙ్మయ మందే దశకుమార చరిత్రము వంటి రమ్యమైన కథలు కలిగిన గ్రంథము లేదనిన నింక తెనుగు విషయము జెప్ప నవసర మే లేదు. తెనుగు నేటివరకు నొక యనుకరణ భాషగానున్నది. నాడు సంస్కృతము దీనికి మార్గదర్శకమైన నేడు ఇంగ్లీషు బంగాలీ భాషలా స్థానము వహించినవి. సంస్కృతమందు హితోపదేశ కథా సరిత్సాగర బృహత్కథా కాదంబరీ కథల వంటి వనేకములు కలవు. కాని యవియు నీ దశకుమార చరిత్రలోని కథలలో నొక్కొక్కటి యొక్క నవలకు మూలాధారము కాదగినది. నేటి నవలా కర్తలిట్టి కథలనే పెంచి సాహస కథలనుగా (**Novels of Adventure**) వ్రాయుచున్నారు. ఈ కథలలో రాజవాహనుడు పాతాళలోకమునకు బోవుట ఒక మంత్రి యక్ష స్త్రీని వివాహమాడుట, ఒక బ్రాహ్మణ బ్రువుడు యమలోక మేగి వచ్చుట, ఒక మంత్రి కుమారుడు నిట్టి యంశములు నాలుగైదు అవిశ్వసనీయము లైన వానిని వదలిన దక్కిన భాగమంతయు నేటి నవలా కర్తలు సమ్మతించునవే యైయున్నవి.

కథలు వ్రాయు కవులకు ముఖ్యముగా గథా మాత్రము నవిచ్ఛిన్నముగా నడపుట (**Narration**) దాని కనుకూలమగు సులభ శైలి యీ రెండును నవరస ములు. మన తెనుగు ప్రబంధములలో నూటికి తొంబది తొమ్మిది ప్రబంధములోని కథలు. "పిట్టమ్మ కాకమ్మ కథల వంటివి". మన కవులు కథా చమత్కృతిని చాటింపక శైలి చమత్కృతిని బూజించిరి. సంస్కృతమందును కాదంబరి యిట్టి గ్రంథమే. బాణుడు కథలు జెప్పుచు జెప్పుచు మధ్యన నలుబది యేబది పుటలే సరోవర వర్ణనమునో, యే సైన్య గమనమునో, యే రాజకుమారోపదేశమునో వర్ణించును. ఈ వర్ణనలును దెగబారెడు సమాసములతో నిండియుండును. చదువు వారికి విసుగు పుట్టుట తుది ఫలితము. మన దశకుమార చరిత్ర మట్లుకాదు. వర్ణనాంశము లిందు తక్కువ. శైలి నాతికఠినము. కథ మనోహరము. స్వాభావి కము. ఇది సంస్కృత దశకుమార చరిత్ర సంబంధమగు చర్చ.

ఇక మన తెనుగు దశకుమార చరిత్రను గుఱించి యించుక వ్రాసెదను. కేతన తెలుగులో గథలందొక్క చోట కొంచెము మార్పుచేసెను. రాజవాహనుని ప్రేమకథయంతయు నొక యుచ్ఛ్వాసమున మూల మందుండ దానినే తెలుగున పుష్పోద్భవుని కథలో కొంతయు, చతుర్థాశ్వాసమందు సోమదత్తుని కథ యందు గొంతయు విభాగించి వ్రాసియున్నాడు. ఈ రెండు పద్ధతులవలన కేతన ప్రతిభను గనుగొనవచ్చును. ఈ కేతన ప్రపంధమును కేవలము (తర్జుమా) భాషాంతరీకరణ మునుగా భావింపజనదు. ఇతడు స్వతంత్ర వర్ణనములు వ్రాసి తన భావ వైశాల్య మును జూపించినాడు. దండి యెంత రసికుడో, యంతకన్న రసికుడు మన కేతన. దండి వచనము వ్రాసియు "కవిర్దండీ" యని ప్రఖ్యాతి గాంచెను. కావుననే కేతన "యభినవదండి" యను బిరుద మందభిమానము కలవాడయ్యెను. కేతన మూలమున కెందెందు భిన్నముగా వ్రాసెనో యన్నియు నిందు జూప వీలుండదు. కావున గొన్నింటినే కేతన వర్ణనా సామర్థ్యమును జూపుటకై యుదాహ రించెదను. ప్రారంభముననే పుర వర్ణనము భిన్నించినది. దాని వెంటనే రాణియగు వసుమతీదేవి సౌందర్య వర్ణనము విపులముగా మూలమందుండ మన కేతన "వసుమతికి సవతియనందగు వసుమతీదేవీ" యనినాడు. మూలమందలి వర్ణనలో విశేషమేమియులేదు. కవి సాంప్రదాయానుసారముగా పద్మములు మీనములు, పూర్ణకుంభములు మున్నగు వస్తువుల యంగముల కుపమానములుగా గైకొనబడినవి. మగధ మాళవదేశ రాజుల యుద్ధము వర్ణించుచో మన కేతన యిట్లు తన సొంత పద్దెమొకటి కలిపినాడు.

చ. ఆమగధేశ మాళవ ధరాధిపు
లెక్కటిఁబోరి రాజిలోఁ
గాముడు శంబరుండు శశిఖండ
ధరుండు గజా సురేంద్రుఁడున్
రాముఁడు రావణుండు సురరాజ త
నూజుడు సింధునాథుడున్
భీముడు దుస్ససేనుడు నుపేంద్రుడు
కంసుడు బోరు నాకృతిన్"

మూలమందు కామ మంజరి యను భోగముది మరీచికి కామతత్త్వమును బోధించునప్పుడిట్లు వర్ణింపబడినది. ''బాధితో పిచాల్పాయా ప్రతి సమాహిత స్త్ర మపి దోషం నిర్హృత్య శ్రేయసేఽనల్పాయ కల్పతే, తథాహి పితా మహస్య తిలోత్త మాభిలాషః భవానీ పతేర్మని పత్నీ సహస్రసం సందూషణం పద్మనాభస్య షోడశసహస్రాంతః పురవిహారః ప్రజాపతేః స్వదుహితర్యపి ప్రణయ ప్రవృత్తిః శచీపతే రహల్యా జారతాః.''

ఈ వర్ణన తెనుగునందు లేదు. దానికి బదులీ పద్యము మూలమందు లేనిది కలదు.

చ. అలరులుఁ బూతలంబరము
లాభరణంబులు దమ్మలంబు దె
చ్చెలులు మృదూపధానములు సెజ్జలుఁ
గేలి గృహంబు లాదిగా
గలుగు పదార్థముల్ నడుపుఁగామము
దాను మనోహరంబు త
త్ఫల మగు సౌఖ్యసిద్ధిఁ దెలుపన్
యశమే యను భూతిఁ దక్కఁగన్॥

మూలమందొక జైనుఁడు (క్షపణకుడు) వ్యసనియై యొకచో నుండినట్లు వర్ణింపబడినాడు. ఆదర్శంచ........మస్పష్ట సమాధి మాధిక్షీణ మ్రగగణ్యా మానభి రూపాణాం కృపణ వర్ణం కమపిక్షపణకం" అనగా నాక్షపణకుడు దీనుడై మానస పీడా దుర్బలుడై కురూపియై యుండెనని దీని అర్థము. ఈ క్షపణకుని వేషమును వాని వ్యసనమును నెట్లు కేతన చిత్రించినాఁడో చిత్తగింపుడు.

సీ. భూరేణు పటలంబు పొదవిన వక్షంబుఁ
గన్నిటఁ దోఁప్తోడఁగడగు వాని
డాకేలు నెక్కువ దాపిడి తనలోనఁ
తలపోసి తలపోసి యలయువాని

ధరలోన గలుగు నొప్పరి మిండలకు నెల్ల
మొరలు నాఁ జాలిన మూర్తివాని
బరివోవ సూఁచినఁ బలుచనై తలమీద
దూగాడు వెంద్రుక తోకవాని

తే. గూటికుంచెయు వెడచింపి చేటకెలన
దొంతి బుట్టల చిక్కఁంబు పొంతఁబెట్టి
వగలఁ బొగిలెడువాని నిర్వాణి నొక్క
తరుణ తాపసిఁ గాంచితి ధరణినాథ.

ఇందు మొదటి పంక్తి మాత్రమే మూలమున కనుకూలము. కేతనప్రతిభా ప్రభావమే.

మూలములో సుర్యోదయ మయ్యెను అని మాత్రమున్నది. గాని యా భాగ మునే కేతన పంచమాశ్వాసమున నిట్లు వర్ణించినాడు.

సీ. ప్రాచీన శైలాగ్ర భాగస్థమగు నశో
కంబునఁ జిగురు జొంపంబనంగ
వర్షాధి పతియని వాసపు గొలువ జే
రిన యింద్రగోపక శ్రేణియనగ
నురుతర పూర్వభూధరము నెత్తంబున
బొలుచుగైరిక గండ శిలయనంగ
కాశ్మీర పటమున గావించి సురపతి
విడిచి యాడెడు వాలుబడగ యనగ

తే. నరుణ కిరణుండు దోతెంచె నంబుజాత
నర్మసచి వస్మితా పాదనంబునందు
జతురుడై యుష్ణ కరముల జక్రవాక
తాపముడుపుట నాశ్చర్య ధాము డగుచు.

ఒక ధనికుని యింట దొంగతనము కాగా పౌరజనులాచోరుని చాకచక్యము నిర్విధముగా వర్ణించిరని మూలమున లేని విశేషమును తెనుగులో కేతన కల్పించి నాడు చూడుడు.

సీ. ఇమ్ముగా కలిబ్బంగి నింటిలో దిరుగంగ
సరకు సేయక వచ్చుటరిది కాదె....
పంచ ఆశ్వా 130 పద్యము.

మూలమందొక లంజ తల్లి రాజుతో తన కులాచారమును గురించి యిట్లను.

నహ్యర్థిర్న్యాయార్జితై రేన పురుషావేశము పతిష్టంతి (విటులు అన్యాయార్జితమైన ధనములను వేశ్య కిచ్చి వారిని బొందుదురు అని దీని యర్థము) ఈ వాక్యము నాధారముగా విటుల న్యాయార్జితము లెట్టివి తెత్తురో మనకేతన వర్ణించిన విధమిది.

సీ. కన్నంబు వెట్టి తెక్కలి కొని యంకంబు
పలుపురితో నాడి బందివెట్టి
జూదంబునకుఁ జొచ్చి చూఱ కాంద్రం గూడి
పరదేశముల కేగి తెరువులడిచి........
........ఆ, 6 ప. 95.

షష్ఠాశ్వాసమందు అపహారవర్మ రాజ కన్యను జూచినప్పుడామె సౌందర్య వర్ణనము మూలమందు విశేషముగా కలదు. మన యాంధ్ర దశకుమార చరిత్ర మందది విడువఁ బడినది. అపహార వర్మ రాత్రి రాజ గృహము కన్నము పెట్టి సృగాలికయను దానిని వెంబడించుకొని వీధులందు బోవుచుండ దలవరులు వచ్చుటయు వారిని జూచి యితఁడు తప్పించుకొను నుపాయము కానక విధి కృతము తప్పునేయని వారి ఎదుటికిబోయి నేను దొంగను నన్ను పట్టుకొనుడు అని పలికెను. కాని సృగాలిక యిట్లనెను. "అయ్యా! ఇతడు నా కొడుకు. పిచ్చి యెత్తినది. ఇంటిలో బంధించి యుంచ తప్పించుకొని వచ్చి యిట్లు వెట్టిని మీ యెదుట ప్రకటించుచున్నాడు.

మూలమందింతయ యున్నది. వెఱ్ఱి పట్టిన దను విషయమును నాధారము చేసుకొని మనకేతన బహురమ్యముగా హాస్యజనకముగా నీవెఱ్ఱి తనమును వర్ణించిన ఘట్టము ముఖ్యముగా గమనింపదగినది.

సీ. చేసంకు పట్టుచుఁ జిడుపలు వెదకుచు
నొరె గాలదేవుడు నులికి పడుచు
విందులు విందులు విందులంచును బఱ
తెంచి మ్రాకులు కౌగలించి కొనుచు
మునుకుచు వెలుగుతో ముచ్చటలాడుచు
బొరిపొలి గూయుచు బొబ్బలిడుచు
గల మాటలాడుచు మొలపుండ్ల మల్లని
బాడుచు నొడలెల్ల బరికి కొనుచు

తే. నేవము గ జొమ్ముపై నింద ద్రేవు డొలుక
నన్న కుడుములు దిన వన్న యనుచు డాసి
గుండ్రడ గుడ్డను జూపుచు గునిసి గునిసి
బయలు నవ్వుచు బడుకిళ్ల వాచి కొనుచు.

వ. "అయ్యారె కులదిక్కు మరలి"

తే. నేల జేతులు సమరి మైనిక్కమెల్ల
నఱచి యుంకించి యడుపులు గఱచుఁయును
వారలద్దిరా ! యని విచ్చి నలియబాఱ
దోలికొని వారినిలిపితి సూల వొడచి

వ. "దానికి వారలందరు బెలుచ నవ్వుచు నరిగిన"

మూల మందు ఒక కోమటి నానాదేశములు తిరిగి యొకచోఁ దనకు నచ్చి నట్టి కన్యను జూచెను. ఆ కన్యక లక్షణములు - అనగా - వివాహయోగ్య కన్యా లక్షణములను దండి విశేషముగా వర్ణించినాడు. కేతన యిది వదలినాడు. ?థా సందర్భమునకు దగినట్లుగా నాయా తావుల కేతన మంచి యుపమానములను సామెతలను జొనిపినాడు. మూలమందులేని యొండు రెండు చూపెదను.

క. ఆరమణీ తిలకమునకు
గారవమున శిశిరవిధులు గావించిన దాం
గారెడు నేతికి బయిపై సీరలికిసయట్లవోలె నిష్ఫలమయ్యెన్. ఆ. 3.

క. ....ఆడబోయిన తీర్థం
బెదురుగ వచ్చిన క్రియ ఆ. 3.

వ. చుంబక శిలా ప్రతిమందగులు నయోరూపంబునంబోలె ముని తన సజ్జ
యరుగుదేరు డరుణి రాజ మందిరమునకుంజని (ఆ. 5)

ఉ. తేనియబడ్డ యీ గగతిధీరత గోల్పడి బిట్టు
చొక్కతిన్ (ప్రణయ వర్ణన) (ఆ. 6)

ఆ. ఏను జోర వృత్తి నిచ్చితినేనియు
మేలి వస్తువైన తోలతిత్తి
దక్కునెట్లు మీకు గుక్కకుడెం కాయ
దక్క దనిన పలుకు నిక్కమయ్యె॥

దండి మహాకవి క్రీ. శ. ఏడవ శతాబ్దమందుండెనని పండితులు నిర్ణయించి నారు. మఱియు కేతన తన గ్రంథమును దిక్కన సోమయాజికంకిత మిచ్చుటం జేసి యితడు తిక్కన సమకాలికుడనియు క్రీ. శ. 13 వ శతాబ్దమందు జీవించిన వాడనియు పండితులు నిరూపించినారు. ఈ యుభయులకు మధ్య సుమారు 500 సంవత్సరముల యంతరాయమున్నది. దండి యాంధ్రుడో కాడో మనకు తెలియదు. దండి గ్రంథమందు జూదము, కోడి పందెము, సముద్రయానము వర్ణింపబడుటచేత నాతని కాలమున నివి జనులందు వాడుకగా నుండెనని చెప్పవచ్చును ఈ వర్ణనలు తెనుగులో తర్జుమాయైనందున నివి కేతన కాలమున నాంధ్రదేశమందుండెనో లేదోయని సంశయింపఁనిలేదు. కేతనకు సుమారు 100 - 200 సంవత్సరముల తర్వాతివాడగు వల్లభరాయడు తన క్రీడాభిరామమందు ఓరుగంటి పట్టణములో, జూదము, కోడి పందెములు జరిగినట్లు వర్ణించినాడు. కోడి పందెము మొట్ట మొదట మన దేశమందే కనిపెట్టబడినది. అమరసింహుడు క్రీస్తు

శకాదిలో నుండినవాడు, అతడు నిఘంటువునందు కోడికి పర్యాయ పదముల నిట్లు వ్రాసినాడు.

"కృక వాకస్తామ్రచూడః కుక్కుటశ్చరణాయుధః" ఇందు కోడికి చరణా యుధః అని చెప్పు మాటను జూచిన - నాతని కాలమందే కోళ్ళ పందెములు జరుగు చుండెనని యూహింప వచ్చును. కోళ్ళ పందెమును గురించి యొక శాస్త్రమే యున్నది.

ఆంధ్ర దేశమందు పందెగాండ్రు నేటికిని కోళ్ళలో కాకిజాతి డేగజాతి నెమిలి జాతి మున్నగున వున్నవనియు నొక్కొక్క జాతియొక్కొక్క కాలమందిం కొక జాతి కోడిపై జయము పొందుననియు శాస్త్రములో వ్రాసికొని పందెము లప్పుడు చూచుకొందురు. దశకుమార చరిత్రయందు ఒక జాతి నారికేళ జాతులు వర్ణింపబడినవి. మూలమందు నారికేళజాతి ఒకజాతి కోడిని గెలిచెనని మాత్ర మున్నది. కాని మన కేతన కోళ్ళ యుద్ధమునే వర్ణించినాడు.

సీ. ఎదిరిన కోడి మున్నెనసియారెలు మెడ
　　నెసగాడ నురువడి వ్రేసి వ్రేసి
అదివ్రేయ మదికిన్కనదరి బల్పున బట్టి
　　కబళించి యందంద కదిమి కదిమి
విశిఖ ముఖంబులు వెనువెంట దగులుచు
　　నంతంత బోనీక యాగి యాగి
వాగాటులకు వచ్చి వసుమతి నిలువక
　　యొంటి తన్నున గొసరుడిపియుడిపి

గీ॥ గెలిచె నామాట దగ నారికేళ జాతి
యగ్గలికనంత ప్రజయెల్ల నార్చుచుండె
జెలగి ఒక జాతి మాత్రోపజీవియైన
బ్రాహ్మణుండు నన్నెంతయు ప్రస్తుతించి.

జూదము ఇరువదియైదు విధములదని దండి వర్ణించినాడు ఆ జూదమందు అపహారవర్మ పదివేల దీనారముల గెలిచెనట. దీనిచే దండికాలమున దీనారములు

నాణెములుగా విశేషప్రచారమందుండెనని తెలిసెడి. కేతన తన భాషాంతరీకరణ మున నెందును దీనారముల పేర్కొనలేదు. దానిచే నితని కాలమందివి లేవనికాదు. ఇతని తర్వాతవాడగు శ్రీనాథుడు.

"దీనారటంకాల తీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల"

యని చెప్పికొనినాడు.

దండి కథలలో తలవరుల ప్రాముఖ్యము చాల గనబడుచున్నది. నిజాముకో బీటు జవానులీ కాలములో చలాయించు నధికారముకన్న జాల హెచ్చుగా నధికార బలము కలవారై యుండిరనవచ్చును. వారు రాత్రికాలమందు కోల దీవటీలతో గస్తీ తిరుగుచు వీథులందు సంచరించు జార చోరులకు గుండె గాలములై యుండిరి. మన అపహారవర్మ (ఈతని కథయే కథలన్నిటిలో రమ్యము) వీరిచే బలు సంకటముల బడినాడు. వారినుండి తప్పించికొనుటకై ఒక తూరి పాము కఱచినట్లు నటించినాడు. ఈ తలవరులను మూలమందు రక్షకబలమనియు నాగరక బలమనియు వర్ణించియున్నాడు. మన కేతన వీరిని ఆరెకులు, తలవరులు అని తెనిగించినాడు. అయితే యీ తలవరుల యధికారములు దండి కాలమున నుండెనేమో కాని కేతన కాలమున నాంధ్రదేశమున లేకుండెననజాలము. కేతనకు తర్వాతవాడును క్రీ. శ. 1600 ప్రాంతమున నుండిన కదిరీపతి తన శుకసప్తతిలో తలార్లను సనేక స్థలముల వర్ణించినాడు చూడుడు.

క. చుట్టాలకుఁ దెల్పుదు మది
దొట్టిన కినుకం దలార్లతో జెప్పుదు గూ
పెట్టుదు దొరముందర నను
బట్టకుమని పలవనతడు బరువగుభీతిన్.

ఉ. అంత తలారులాత్మవిభు డచ్చటికిం జనుదేర
జార వృత్తాంతము దెల్ప బట్టుడని యా
తడనం గుడి నొచ్చి దివ్వెటీల్
చెంతకు దెచ్చి చూచి........

సీ. చనుజక్క వలుగన్న సన్యాసులైనను
దలవరి వారితోఁ జెలిమిసేయ

కావున కేతనకాలమందును దలవరుల పోలీసుతనము విశేషముగానుండెను. కావుననే

తే. కోలది వియల వెలుగుదిక్కులకు నిగిడి
తొడరి పురివీధి చీకటి దొలగ దోల
బటురయంబున తలవరి బలమురాక
చూచి యొక్కింత చిత్త సంక్షోభ మెసగ.

అని వర్ణించినాడు.

చోరులనేగాక జారులను గూడ బట్టు నధికారము తలవరులకు నుండెనని తెలిపితిమి. ఈ యాచారమును గుఱించి యెన్నటి విషయమో త్రవ్వనేల నిన్న మొన్నటివఱకు గద్వాల సంస్థానములో గణాచారిగుత్త యని యొకటి రాజు లేర్పాటు చేసియుండిరి. ప్రతి గ్రామము గుత్తను నొకడు తీసుకొని యా మొత్తమును రాజుగారికి చెల్లించును. గుత్త తీసుకొన్నవాడా గ్రామమందెవ్వరైనా వ్యభిచరించినట్లు తలార్లవలన గుర్తెరిగినవారినుండి తాను దండుగలు తీసుకొనుచుండెడివాడు. ఈ గుత్తనే గణాచారి గుత్తా యని వ్యవహరించుచుండిరి.

జైన మతము దండి కాలమునందును కేతన కాలములోను ప్రచారమందుండెననియు జైనులు బ్రాహ్మణ దూషకులునై యుండిరని దెలియ వచ్చెడి. కేతన జైన వేషమును వర్ణించుటచేత నాతని కాలమందు జైన వేషాచారము లెట్లుండెనో వివరముగా తెలియవచ్చెడి.

దండి కాలమందును కేతన కాలమందును స్త్రీలు సాధారణముగా నెట్టి సొమ్ములు పెట్టుకొనుచుండిరో యీ క్రింది యుదాహరణముల వలస దెలియగలదు.

"అహ మపి మణి నూపుర మేఖలా కంకణ కటక తాటంక హార మరాకణ్ఠల వనితా యోగ్యం మండన జాతం నిపుణతో యాతత్ర స్థానేషు నిక్షిప్య" అని దండి వర్ణించినాడు.

సీ. మట్టియ లుజ్జ్వల మణి నూపురంబులు
మొలనూలు వస్త్రముల్ ముత్తియములు
కన్న వడంబులు గట్టి నూళ్ళను సుద్ద
సరి తీగె మినుకులు సంది దండ
నంగుళీయములు హారి కంకణములు
చే కట్టు పాలెలు చెన్ను మెఱుగు
టాకులు సరిపెణ లాలక్తకము పూత
కాటుక తిలకంబు కమ్మ పువ్వు

తే. లాదిగా గల మేలిద్రవ్యముల నొప్ప
బసదనము చేసి యుచిత రూపంబు దాల్చి
బాల చంద్రిక బోటినై పజ్జ కరిగి
దారువర్మని లోగిలి దరియ జొచ్చి.

ఈ పద్యమందు పెద్ద అక్షరాలు మూలమున కనుకూలములు. తక్కిన వన్నియు కేతన చేర్చినవే. ఇవి బాగుగా గమనింప దగినవి. కేతనకాలమం దీ యలంకారములనే ఆంధ్ర స్త్రీలలంకరించుకొనుచుండిరి. భూషణముల పేర్లు విశేషముగా నచ్చ తెనుగు పదములు. ఈ భూషణములు నేటికిని మన యాంధ్ర స్త్రీలు పాటించుచున్నారు.

ఇవి యాంధ్ర దశకుమారచరిత్ర మందు నాకు దోచిన విశేషములు. ఈ కవి శైలి విషయము నేను ప్రత్యేకముగా నిరూపించ నవసరము లేదు. కేతనయే వ్రాసికొనిన యీ పద్యము నుదాహరించిన జాలును.

ఆ. కవితఁ జెప్పి యుభయ కవి మిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతడు మెచ్చ
బరగ దశకుమార చరితంబు జెప్పిన
ప్రోడ నన్ను వేఱ పొగడనేల.

ఈ కేతన దశకుమార చరిత్రను జూడని నిర్భాగ్యులైన యాంధ్రు లెవ్వరైన నుండినవారు తప్పక యా గ్రంథమునైన దిలకింతురని గోరుచున్నాను. ఈ దశకుమార చరిత్రమున కుత్తమముగా బీఠికను శ్రీ శేషాద్రి రమణ కవులు వ్రాసి యున్నారు. దాని నవశ్యము పాఠకులు చదువుదురని మనవి.

# అప్పకవి

ఇటీవల ప్రచురితమైన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము రెండవ భాగము చూచితిని. అప్పకవిని గురించి ఇందు ఇంచుక వ్రాసినారు. అతడు గుంటూరు వాడని నిరూపించుటకు ముప్పుతిప్పలు పడినారు. స్థానికాభిమానముతో అట్లు వ్రాయుట కారణము కానరాదు కాని నిజాం రాష్ట్రమువారి యభిప్రాయముల గమనింపని వివేకమువారికి చేకూరినది. కందుకూరి వీరేశలింగము పంతులువారు అప్పకవి కృష్ణామండలము వాడని వ్రాసిరి. మరియు శతఘంటము వేంకటశాస్త్రిగారు తమ భారతపీఠికలో నిదే సూచించిరి. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమువారు ప్రథమ ముద్రణములో అప్పకవి గుంటూరు వాడని వ్రాసి ఇప్పుడును అదేమాట వ్రాసినారు. కాని యిది సరియైనదికాదు. సంపూర్ణముగా తప్పువ్రాతయే. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ ప్రథమ ద్వితీయ ముద్రణములును, నిజాంరాష్ట్ర పత్రికలలో మూడు వ్యాసములును బయలుదేరెను.

౧. దేశబంధు మాసపత్రికలో శుక్ల సంవత్సర జ్యేష్ఠ మాసములో నేను వ్రాసిన వ్యాసము.

౨. బూర్గుల రామకృష్ణారావుగారు గోలకొండ పత్రిక ౭వ సంపుటము మొదటి సంచికలో అంగీరస వైశాఖ శు॥ ౨ లు - నాడు వ్రాసిన అతివిపులమగు వ్యాసము.

౩. గత సంవత్సరము గోలకొండ సంచికలోని పూర్వకవి భాగములో శ్రీ శేషాద్రి రమణకవులచే సంకలిత వివరణము.

ఇవన్నియు సర్వస్వమువారు చూడకపోవుట తటస్థించినది. ఈ సవరణ వ్యాసమును గూడ చూడకుండిన నాశ్చర్యమేమి ?

ఈ వ్యాసమును నేను నిజాం రాష్ట్రాభిమానముతో వ్రాయుటకాదు. యథార్థమును వెల్లడించుటయే దీని యుద్దేశ్యము. అప్పకవి మరియు నిచ్చటివారు చేయు భాషాసేవను నెరుకపరచుటయు జ్ఞాపకము చేయుటయు ద్వితీయోద్దేశము. అప్ప

కవి నిజముగా నిజాం రాష్ట్రమువాడుగాడని అతనిని కృష్ణలో వేసినను గోదావరిలో వేసినను మేమేమి చేయగలము ?

ఇక ప్రకృత విషయము - అప్పకవి నిజాం రాష్ట్రములోని మహబూబు నగరు జిల్లావాడు. పాలమూరను పూర్వనామమునకు నూతన నామకరణమే మహిబూబునగరు. నేను దేశబంధులో వ్రాసిన భాగమిది.

అప్పకవి వ్రాతలగూర్చి చర్చించుటకు పూర్వము వారి నివాస స్థలమును గూర్చి బయలుదేరిన సందిగ్ధములకు తోడుగ నింకొక సందిగ్ధమును జతపరుప నెంచితిని. అతడు గుంటూరు మండలమువాడని యొకరు, కృష్ణకు దక్షిణమున నొక యోజనము దూరమున (నెచ్చటనో) యుండెనని యొకరును వ్రాసిరి. అతడు మహిబూబునగరు జిల్లావాడేమోనని నాకనుమానము కలిగినది. ఏలన నతడు తన గ్రంథములో నుదహరించిన స్థల నామములు మహిబూబునగరములో గాన వచ్చుచున్నవి.

"కొంతూరు" అనునది "కోడూరు" ఏమో! చలిమల్ల యిప్పటి చెలిమిళ్ళయేమో! తంగెడ విషయము యిప్పటి తంగెళ్ళపల్లి యేమో. అభినవనూత గ్రామము అను అచ్చుతెనుగు చేసిన లేమావిళ్ళ యగును. వట్టెము యిప్పటికి వట్టెముగానే యున్నది. ఈ గ్రామములన్నియు మహిబూబునగరు జిల్లాలో నున్నవి. శ్రీశైలమునకు సమీపమున నున్నవి. కావున ననుమానముతో సూచించితిని గాని నేనాజిల్లా వాడను ఐనందున స్థలాభిమానముతో గాదని ముందే విన్నవించు కొనుచున్నాను.'

ఈ అనుమానమును నిస్సందేహ పరచినది మా మిత్రులును పండితులును యగు శ్రీయుత బూర్గుల రామకృష్ణారావుగారు. వారు గోలకొండ పత్రికలో నిట్లు వ్రాసిరి.

"కాకునూరుగ్రామ మెచ్చటనుండిన దెవ్వరికిని తెలియనట్లున్నది. కాని పై పద్యమును చదివినచో

(బాలుడై కాశికాపట్టణంబునకేగి
బ్రహ్మేంద్రు నొద్ద శాస్త్రములు జదివె॥)

నిజాం రాష్ట్రవాసులమగు మనకు ఈ కాకునూరు గ్రామమును నిశ్చితముగా నిర్దేశించుటకు వీలుగలదు. చరికొండసీమలో అని వ్రాసియున్నాడు మహిబూబునగర్

జిల్లాలో నాగర్‌కర్నూలు, కల్వకుర్తి తాలూకాలలో చేరియున్న గ్రామాదు లన్నియు దాదాపు నాడు చరికొండసీమలో చేరియుండినవి. చరికొండ గ్రామము కల్వకుర్తి తాలూకాలో నున్నది. ఈసీమలో చేరిన కాకునూరు నా జన్మస్థానమగు బూర్గులకు ౪ కోసుల దూరమున్నది. ఇపుడది గుమార్‌గీర్ అను గోస్వాములకు సర్వాగ్రహారముగా నున్నది. నిడుదవెల్లి బొద్దనేపెల్లి మొదలగు గ్రామాదులందు మాన్యక్షేత్రముల గడించెనని వ్రాసికొనియున్నారు కదా! పై జెప్పిన కాకునూరు నకు మిగుల సమీపముననే యొక యామడలోపల పై గ్రామాదులన్నియు నిప్పటికి కలవు. కాకునూరికి ౨ క్రోశములలో నిడుదవెల్లికలదు. బొద్దినేపల్లియు ౨ క్రోశములలో నున్నది. కల్వకుర్తి తాలూకాలో చేరినది. "నివరళపురి"యను పాఠము సరికాదు.'' నవదళపురి యని నా ప్రబలమైన యనుమానము. కాకు నూరికి రెండు క్రోశములలో తొమ్మిదిరేకుల యను గ్రామము కలదు. ప్రాత ప్రతుల మూలములు మరల పరిశీలింపదగినవి.... ''అభినవచూత సద్గ్రామము" విషయమై కీ. శే. లక్ష్మణరావుగారును, గిడుగు సీతాపతిగారును పొరపడినారు. ఈ గ్రామమును క్రొత్త మామిడిపల్లె యనిరి. మామిళ్లపల్లి యను గ్రామము లిక్కడను గలవు. అమరాబాదు తాలూకాలో నొక గ్రామము కలదు....కాకునూరికి క్రోసెడు దూరముననే "లేమామిడి'' లేక ''లేతమామిడి" యను గ్రామము పురా తన ప్రసిద్ధముగా నున్నది. ''వట్టెము" నాగర్‌కర్నూలు తాలూకాలో చేరిన గ్రామము. ఇది రావుగారి వ్యాస సారాంశము. ఆ వ్యాస మతివిపులమై సమగ్ర చర్చగలదై యున్నను స్థలవిస్తరణమగునని సూచన మాత్రముతో తృప్తి బొందు చున్నాను. అభిలాషులు దానిని జూడగలరు.

తర్వాత గోలకొండ కవుల సంచికలో పై బూర్గులవారి యభిప్రాయముసే బలపరచుచు శ్రీ శేషాద్రిరమణ కవులు వ్రాసిరి - గత సంవత్సరము కాకునూరు ప్రాంత మిత్రుడొకడు నాతో చెప్పిన విషయములేమన కాకునూరు నిడదవెల్లికి రెండు మైళ్ళ దూరమున నున్నదనియు, తొమ్మిది రేకులకు (రామకృష్ణా రావుగారు సరిగా చదివిన నవదళపురి పాఠము నిరవళిపురికాదు) రెండు మైళ్ళ దూరముననుు, వట్టెమునకు ౨౦ మైళ్ళ దూరముననుు, లేమామిళ్ళకు రెండు మైళ్ళ దూరమునను కలదనియు నీ గ్రామములన్నియు తనకు పరిచితములే యనియు తెలిపినారు. మరియు కాకునూరు కల్వకుర్తిలో ఖాల్సా యిలాకా మఖామనియు తెలిపినారు. చరికొండ కాకునూరునకు ౭ కోసుల దూరములో నున్నదనినారు. బొద్దినేపల్లి కాకునూరికి ౧ కోసు దూరములో నున్నదనినారు.

కామెపల్లి యెక్కడిదోనని అందరు తికమకలగుచున్నారు. దేవరకొండకు (నల్లగొండలోని తాలూకా గ్రామము నాగర కర్నూలు తాలూకా సరిహద్దులో నుండునది) ౨౦ మైళ్ళ దూరములోనున్నదని పై మిత్రుతే చెప్పినారు. గోనవాని పల్లె అను గ్రామమునకు ౧౦-౧౨ మైళ్ళ దూరములో నున్నదనియు చెప్పినారు.

ఇదే సందర్భములో తిరుమలభట్టారకుని విషయము సూచించుట అప్రస్తుతము కాదనియు ముందు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము వారి వ్యాసమును చూడ తటస్థించిన తప్పుదిద్దుకొనదలచిన తిరుమల భట్టారకు నొద్దనైన సరియైన సమాధానము జెప్పిన అతని వంశీయుడగు అప్పకవికి చేసిన యపచారమునకు "మాఫీ" యగు నని తలచి వ్రాయుచున్నాము.

అప్పకవీయములో చతుర్థాశ్వాసములో గణదేవతాఫలశీర్షికలో ౬౮ సంఖ్య గల వచనములో వావిళ్ళవారి ౧౯౧౦ వ సంవత్సరపు ముద్రిత ప్రతిలోని ౧౭౮ పుటలో నిట్లున్నది. "కాలామృతమునందు శ్రీమద్వేంకట నాయకమ్మని మదీయాన్వయ ప్రభువుండగు తిరుమల భట్టారకుండును.... .... .... ...." అను వాక్యము గమనింపదగినది.

సుప్రసిద్ధ కాలామృత గ్రంథకర్తయు తిరుమల భట్టారకుడు అప్పకవి పూర్వీకుడును, వంశస్థుడును.

తే॥ అందులో కాకునూరి రంగాహ్వయుండు
గనియె నలువురి తనయుల గన్నమాంబ
యందు దిరుమల భట్టు గంగార్యవర్యు
నెలమి బెదసోము జినసోము నిందులోన

అను పద్యములోని తిరుమల భట్టితడోయేమో !

మరియు అప్పకవి వంశస్థుడు శేషయ్య యను పేరుగల యువకుడు మహబూబునగరు జిల్లాలో వట్టెము ప్రాంతములో నున్నాడనియు, తమవద్ద కొంత కాలము చదువుకొనియె ననియు నా మిత్రులును కర్నూలులో పాఠశాల పండితులు నగు శ్రీ అనుముల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నాతో చెప్పినారు.

ఇన్ని కారణములుండినను అప్పకవి గుంటూరు మండలము వాడై యుండె ననియే యొండు రెండూహలు చేసి నిర్ణయించుట సరికాదని మనవి చేయుచున్నాను.

ఇక అప్పకవి కావ్య విశేషముల నరయుదము.

**కల :**

మన యాంధ్రకవులు చాల ధన్యులు. వారికి గ్రంథములు వ్రాయబుద్ధి పొడమిన తప్పక వారి కులదైవము వారికి ప్రత్యక్షమై గ్రంథమును వ్రాసి తనకే అంకితమీయ కోరుటయు సంభవించును. కలలో కేవలము కనిపించుటయే కాదు. వీరి దైవము వీరితో చాలాసేపు ముచ్చటించి నన్నయ, భీమన, సారంగధరుల కథయు, తాతన, కేతన రచించిన గ్రంథముల మెచ్చకపోవుటయు మున్నగు ముచ్చటలు గూడ నిందు గలవు. ధన్యోస్మి అని మరునాడే గ్రంథము ప్రారంభించెను మన అప్పకవి.

**ప్రబంధ లక్షణము :**

ప్రబంధ లక్షణమును నిరూపించిన వీరి పద్ధతి ఆంధ్ర భాషకు చాల కష్టము గలిగించినదని నా అభిప్రాయము. ఏలయన, వీరు జూపించిన వర్ణనము లన్నియు ప్రతి గ్రంథమందుండిన సామాన్యమై రుచి తగ్గుటయు; కవికి స్వాతంత్ర్యమీయక వర్ణనములందు కూడ దాసునిగా జేయుటయు, కథా సందర్భము నకు సంబంధించకపోయినను బలవంతముగా వర్ణనములను పట్టుకొని వచ్చి కూర్చుటయు, జలవిహార, సురతములను వర్ణించుట చేత గ్రామ్యత్వము కవులకు సిద్ధించుటయు ఈ అప్పకవి గారి మార్గమున నడుచుటవలన కలుగు ఫలితములు. చూడుడు వారి ఆదేశము.

సీ॥ పురమును ఋతుషట్కమును ప్రయాణంబును
    శైలంబు వేటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
    ద్యూతంబు పిదప నద్భుత రణంబు
విజయంబు మద్యపానజ వికారంబును
    వనవిహారంబును వారికేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
    భ్యుదయంబు విప్రలంభోదితంబు
పద్మ మిత్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుత జననము

నసగ నిరువది రెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయు ప్రబంధంబు శ్రీనివాస !

కల్లుద్రావి చెప్పిన వికార చేష్టలు కూడ వర్ణించవలయునట. కొడుకు పుట్టని కథ ఉండినను కొడుకును పుట్టించి వర్ణించవలయునేమో! కన్యాంగ సౌందర్య కథనంబు అని చెప్పుటచేత కవులనేకులు పిచ్చి పిచ్చిగా వర్ణించినది అట్లుండ కొందరు చెప్పరాని అంగవర్ణనలు కూడ చేసిరి. చాల కట్టి (వరుసపెట్టి) మధ్యకాలపు కవులందరు "ఉండంగ ఉండంగ ఒక ఊరుండె" అని పురవర్ణనతో కథ ప్రారంభించిరి. కాళిదాసు కుమార సంభవములో 'అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా' అని ప్రారంభము తోడనే హిమాలయ వర్ణన తోడను, మేఘసందేశములో 'కశ్చిత్కాంతా విరహ గురుణా' అని శాపాస్తంగమిత మహిముడై విరహార్తి పొందుచుండిన యక్షుని వర్ణన తోడను, భారవి "శ్రియఃకురూణాం" అనియు ప్రారంభించిన గ్రంథము లెంత మనోహరముగా నున్నవో వేరుగా చెప్పనవసరము లేదు.

## సారస్వతౌషధములు :

అప్పకవి కొన్ని ఔషధములు తయారు చేసియున్నాడు. మన దేశములో వైద్యము ఒక రహస్యశాస్త్రముగా నుండెడిది. సిద్ధుల వలనను, సన్యాసుల వలనను, యోగుల వలనను, హిమవత్పర్వత మూలికల నెరిగిన అనుభవజ్ఞుల వలనను ఎవరైనను ఒక చిటికలగానీ, ఘటికలోగానీ, చేయనేర్చుకొనిన దాని నతిగోప్యముగా నుంచికొని ఇతరులకు చెప్పకుండెడివారు. అట్టిచో "సూక్తులు ఘటించు, మందులను కర్షమాత్రంబు భక్షింపగలిగెనేని"- గడియకొక పద్యశతకంబు నుడువ జేయునట్టి మందును, నలువచెలువ 'నాలుకను కాపురంబుండు' నట్లు చేయు దివ్యఘుటికను నెరిగిన అప్పకవి ఏ మాత్రమును దాచక లోకోపకారార్థమై వెల్లడించి నందులకు కృతజ్ఞతాబద్ధులుగా నుండవలసినదే. కాని, ఎవరైన నిది నిజమనినమ్మి చూపించిన ప్రకారము మందుల సేవించిరో లేదో తెలియదు. శతఘంటము వారమని బిరుదుల నుంచుకొనిన వారికేమైన నీ రహస్యము తెలియునేమో !

## పోతనామాత్యుడు :

రేఫ ఱ కారముల మైత్రిని చేసెనని పోతనామాత్యుని తప్పుపట్టి ఈ అప్పకవి ఆ మహాకవిని ఉదాహరించుటయే మానుకొనెను. కాని, రేఫ ఱ కారమైత్రి

చేసిన ఇతర కవుల నెందరినో ఉదాహరించుటలోని మర్మమేమో ఊహింపజాలను. పోతన విషయమయి ఇట్లు సెలవిచ్చిరి.

బమ్మెర పోతరాజకృత భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహినేమిటిం గొదువ యెంతయు నారసిచూడగాను రే
ఫమ్ములు ఱాలునుం గలిసి ప్రాసములైన కతంబునంగదా
యిమ్ముల నాది లాక్షణికులెల్లను మాని రుదాహరింపగన్.

అయిన అప్పకవి తర్వాత వచ్చిన కూచిమంచి తిమ్మకవి సార్వభౌముడు తన సర్వలక్షణ సారసంగ్రహములో నిట్లు పోతనగారి నిజమయిన గొప్పదనమును నిరూపించి పుణ్యము కట్టుకొనెను. పోతన ప్రాశస్త్యమును ఇట్లు వర్ణించెను.

అఖిల వేదాంత విద్యారహస్యవిదుండు
సహజ పాండిత్య విశారదుండు
పటుతర కవితా విభాసిత ప్రతిభుండు
సకలాంధ్ర లక్షణ చక్రవర్తి
రఘుకులేశు నిదేశరచిత మహా
భాగవత పురాణుడు పుణ్యవర్ధ
నుండు.... .... .... .... .... .... .... ....
బుధజనహితుండు బమ్మెర పోత సుకవి
ఎన్న రేఫ ఱ కారంబు లెరుగడనుచు
నజ్ఞు లొక కొందరాడుదు రమ్మహాత్మ
కవిత కెందును లోపంబు గలుగదభవ.

పోతన భాగవతము కొంత శిథిలముకాగా దానిని పూరించిన కవుల పద్యము లందే ఈ సాంకర్యము కలదు. కాని పోతన కవితలో లేదని పద్యముల ననేకము లాయా కవులవి ఉదాహరించి తిమ్మకవి నిరూపించెను.

సంస్కృతాంధ్ర కవితా పటుత్వముచేత నొప్పి ఈ 300 సంవత్సరముల నుండి వెలసిన కవుల కందరకును భిక్షపెట్టిన అప్పకవిని తప్పుపట్టు నుద్దేశముతో ఈ వ్యాసమును వ్రాయలేదు. అట్టి మహాకవి కి లోపములు లేకుండిన బాగుగా నుండెడిదనియె నా అభిప్రాయము.

(ఈ వ్యాసం అప్పకవి గురించి వ్రాసిన రెండు వ్యాసాల సంక్షిప్త రూపం)

# సుమతి శతకము

కర్త యెవరు?

సుమతి శతకమును వ్రాసిన మహాకవి యెవ్వరో ఇంతవరకెవ్వరును నిశ్చయముగా తెలిపినవారు కారు ఈ శతకమున కుండినంత ప్రచారము మరే తెలుగు గ్రంథమునకు లేదు. క్రీ. శ. 1910 లో వనపర్తిలో శ్రీ మానవల్లి రామకృష్ణ కవి పాదులు భద్ర భూపాలుని నీతిశాస్త్ర ముక్తావళిని ముద్రించి దాని కొక యుత్తమ పీఠికను రచించి అందిట్లు వ్రాసిరి.

"ఇతడే భద్ర భూపాలుడు (బద్దెన) సుమతి శతకమును రచించెనని ప్రథమ పద్యము చూచిన దోచును. కాని యీ పద్యము నాకు లభించిన యైదు ప్రతులలో నొక్క దానిలో మాత్రమే యున్నది. రెండు ప్రతులలో ప్రారంభము లేదు. సుమతి శతకమునకును దీనికిని పాఠభేదము గానవచ్చుచున్నది. జాతీయ వాచకములలో భేదమగపడును. సుమతి శతకమును రచించిన వాడు భీమకవి యను లోక ప్రవాదమేకాక సుమతి శతకము తాళపత్రములలో ప్రథమ పద్యము భీమన పేరుతో నుండనేను జూచియున్నాడను. ఇతడు వేములవాడ భీమ కవియా? లేక చదలవాడ భీమ కవియా? నృసింహపురాణమును రచించినవాడు దాక్షారామ వేశ్యలను వర్ణించినందున వేములవాడ భీమకవియే యని తోచుచున్నది.... కావున సుమతి శతకమెవ్వరు రచించిరో గుర్తెరుగవలయును. నీతులు బద్దెన నీతులు వలెనున్నవి కాని శైలి మాత్రము భేదముగా నున్నది. ఇదియును పైయంశము వలెనే', యనిశ్చితము.

నీతిశాస్త్ర ముక్తావళిలో శ్రీ మానవల్లివారు ప్రకటించిన దానిలో మొదటి పద్యమిట్లున్నది.

"శ్రీవిభుడ, గర్వితారి<br>
క్ష్మాపర దళనోపలబ్ధ జయలక్ష్మీ సం<br>
భావితుడ, సుమతి శతకముఁ<br>
గావించిన ప్రౌఢ, గావ్య కమలాసనుడన్''

శ్రీ. మా. రామకృష్ణ కవిగారన్నట్లుగా సుమతిశతకము యొక్కయు నీతి శాస్త్రముక్తావళి యొక్కయు శైలిలో చాలా భేదము కలదు. అందుచేత సుమతి శతకమును ముందు రచించి తర్వాత నీతి శాస్త్రముక్తావళిని రచించి యుండిన సుమతి శతకములోని శైలీ సూచక పదజాలము కొంతయైనను రెండవ దానిలో పడవలసి యుండవలెను. అట్టి జాడలేవియు గానరావు.

భీమకవి వ్రాసెననుటకు తాళపత్రపద్యము లేవియు శ్రీకవిగారు దహరింప లేదు.మరియు వేములవాడ భీమకవియు చాలా ప్రాచీనుడు. నన్నయ తిక్కనల కాలపు శైలియేవేరు. సుమతిశతకములోని శైలి శ్రీనాథుని యనంతర శైలిగా కానవస్తున్నది. కాళిదాసుని గురించి మనకెంత తెలియునో తుదకు సుమతి శతక కర్తను గురించియు మనకంతే తెలిసినదనవలెను.

కవియెవ్వరో తెలియనప్పుడు కవి కాలమెట్లు తెలియును. అయినను శత కములోని శైలినిబట్టి కొంత యూహింపవచ్చును. భద్ర భూపాలుడు క్రీ. శ. 1150కి పూర్వమందే ఉండిన వాడనియు అతనిని అతని పద్యాలను నీతి సార ములో రుద్రదేవుడును సకల నీతి సమ్మతములో మడికి సింగనయు మరి కొంద రును నుదాహరించిరని ఆ కవిగారు తెలిపినారు. సింగనాదులు సుమతి శతకము నుండి పద్యాలనేల యుదహరింప లేదు. మడికి సింగన తర్వాతిదే ఈ సుమతి శతకమని చెప్పవచ్చును. నీతి శాస్త్రముక్తావళిలో తిక్కనయు నతనికి పూర్వులును వాడిన పదాలెక్కువగా కలవు. కెలసము, పొరచి, ఎత్తికోలు, పురులు, ఒరిమే, కురగట, మున్నగు బహు ప్రాచీన పదములతడు వాడినాడు. అయితే ఈ పదా లను తిక్కన తర్వాతివారును వాడిరని పరిశోధించి చూపించ వచ్చును. కాని అవి పరిశోధన శ్రమకు లోనైనవే యగును. శతకములో నిట్టి శబ్దాలు కానరావు.

## సుమతికి మూలములు

సుమతి శతక కారుడు విశేషముగా సంస్కృతములోని శ్లోకాల నుండి భావములను స్వీకరించెను. అదే పనిగా పరిశోధించు వారికి విశేషముగా మూల శ్లోకములు లభింపగలవు. స్థూలముగా నాకు తెలిసిన కొన్ని మూలములను తెలుపు కొందును.

అధరము కదలీ కదలక
మధురములను బాసలుడిగి మౌన వ్రతుడౌ
నధికార రోగ పూరిత
బధిరాంధక శవము జూడ బాపము సుమతీ.

శ్లో. బధిరయతి కర్ణ వివరం
వాచం మూకయతి నయన మంధయతి
వికృతయతి గాత్రయష్టిం
సంపద్రో గోయ మద్భుతోరాజన్

"ఉపమింప మొదలు తియ్యన
కపటంబెడ నెడను చెరకు కైవడినేవో."

అనునది. హితోపదేశ మందిట్టి భావముగల శ్లోకమును బోలినది.

"చెఱకు తుద వెన్ను బుట్టిన
జెఱకున దీపెల్ల జెరుచు సిద్ధము సుమతీ.

ఇట్టి భావమే తమిళ నీతి కారులు వాడినారు.

"కరుంబు [చెఱకు—క—చ ఆగును] పూవోల్"

[చెరకు పూవువోలె] అని తమిళ పద్య పంక్తి ఈ రెంటికిని సంస్కృత మూలముండి యుండును.

"తలనుండు విషము ఫణికిని
వెలయంగా తోకనుండు వృశ్చికమునకున్
తల తోక యనక నుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ."

దీనికి సరియగు శ్లోకము.

"వృశ్చికస్య విషం పుచ్ఛం మక్షికస్య విషం శిరః
తక్షకస్య విషం దంష్ట్రా సర్వాంగం దుర్జనే విషః
"తల దడిపి బాస చేసిన
వెలయాలిని నమ్మరాదు వినరా సుమతీ.

చేమకూర వేంకటపతి సారంగధరలో

"తల తడిపి బాస చేసిన
జలజాక్షుల నమ్మరాదు సారంగధరా.

అని వ్రాసెను. ఇందెవ్వ రెవ్వరికి ఋణ పడినట్లు? వెంకటపతియే తన చిన్న తనమందు సుమతి శతకము చదివి యుండెనా?

"పర సతుల గోష్టి నుండిన
పురుషుడు గాంగేయుడైన భువి నింద పడున్.

అన్న భావమునే చేమకూర తన సారంగధరలో

"నిజము భీష్మ నంతటి జితేంద్రియునకైన
నాశపుట్టు మదిని రాశపుట్ట దితరులనగ
నెంత ధనము పట్ల యువతి జనము పట్ల'

అని వ్రాసెను.

"పర నారీ సోదరుడై
పర ధనముల కాశపడక పరులకు హితుడై.

అన్నది.

"మాతృ వత్పర దారేషు, పరద్రవ్యేషు లోష్ఠవత్
ఆత్మ వత్సర్వ భూతేషు యః పశ్యతి సపండితః

అన్న దానిని బోలినది.

సిరిదా వచ్చిన వచ్చును
సరి పోల్చగ నారికేళ సలిలము భంగిన్
సిరిదా బోయిన బోవును
కరి మ్రింగిన వెలగపండు కరణిని సుమతీ.

అనుదానికి సంస్కృతము.

సమాయాతి యథాలక్ష్మీః
నారికేల ఫలాంబువత్
వినిర్యాతి యథాలక్ష్మీః
గజభుక్త కపిత్థవత్.

అయితే ఏనుగు వెలగపండును నమలక అమాంతముగా మ్రింగుటను మరునాడు లద్దితోపాటు ఆ పండులోని గుజ్జును కడుపులో పెట్టుకొని, పండు చిప్ప పగులకుండా లోపల యేమియు లేనట్లుగా చేసి బయట పడవేయుటను ఎవ్వరైనా పరీక్షించినారా? గతానుగతికముగా అందరనగా మనమును అప్రకారమేనా! క్రీ.శ. 1907 లో నిర్ణయసాగర ముద్రాలయము వారు ప్రచురించిన "సమయోచిత పద్యమాలికా" అను సంకలనములో పై శ్లోకమునకు పుట అడుగున "కపిత్థాంతర్గతః కీటోగజ ఇత్యభిధీయతే" అని యుదాహరించినారు. వెలగకాయలో పుట్టి దానిలోపలి భాగమును తిను కీటకము గజము అని దీని యభిప్రాయము. గజమున కీయర్థమే నిఘంటులోను కానరాదు. మరి ఏ నిఘంటు ప్రమాణమో వారును తెలుపలేదు.

"అప్పిచ్చువాడు వైద్యుఁడు
నెప్పుడు నెగ తెగక పారు వేరును ద్విజుఁడుం
జొప్పడిన యూరనుండుము
జొప్పడకున్నట్టి యూర జొరకుము సుమతీ"

అనుదానికి మూలము.

"ఋణదాతాచ వైద్యశ్చ శ్రోత్రియః సుజలానది
యత్ర హ్యేతే నవిద్యంతే నతత్ర దివసంవసేత్
కోమలి నిజమున్........తెల్లని కాకులును లేవు

అన్నదానికి మూలము.

''ఔదుంబరాణి పుష్పాణి, శ్వేత వర్ణంచ వాయసం
మత్స్యపాదం జలేపశ్యేన్న నారీ హృదయస్థితం
"తన వారు లేనిచోటను
చనవించుక లేనిచోట జగడము చోటన్
అనుమానమైన చోటను
మనుజునకును నిలువఁదగదు మహిలో సుమతీ"

యను దానికి మూలము.

"యస్మిన్ దేశేన సన్మానో నప్రీతిర్నచ బాంధవా;
నవిద్యా నాస్తిధనికో, నతత్ర దివసం వ్రజేత్"

ఒల్లని సతి నొల్లని పతి
నొల్లని చెలికాని..........

అనుదానికి మూలము.

"దుష్టా భార్యా, శఠోమిత్రః
భృత్యోఽహంకార సంయుతః

"పతి కడకు, దన్నుగూర్చిన
సతికడకున్ వేల్పు కడకు, సద్గురు కడకున్.
సుతుకడకు, రిత్త చేతుల
మతి మంతులు చనరు నీతిమార్గము సుమతీ"
[పతి - రాజు]

అనుదానికి మూలము.

"అగ్నిహోత్రం గృహం క్షేత్రం గర్భిణీ వృద్ధబాలకా
రిక్త హస్తేన నోపేయాత్ రాజానందైవతంగురుః

"పాలసునకైన యాపద
జాలింబడి తీర్పవలదు సర్వజ్ఞునకున్
తేలగ్నిబడగ బట్టిన మేలెరుగునె మీటుగాక మేదిని సుమతీ

అనుదానికి మూలచ్ఛాయ.

"ఉపకారేణ నీచానామపకారోహి జాయతే
పయః పానం భుజంగనాం కేవలం విషవర్ధనం"

"అడవిని తోడ రయక"
అనుదానికి పూర్వపు జాడ

"నైకః ప్రపద్యేతా ధ్వానం"
ఉదుముండదె నూరేండ్లును

అన్న దానికొక విధమగు ఛాయ.

కాకోపి జీవతి చిరంచ బలించ భుంక్తే

"పనిసేయు నెడల దాసియు
ననుభవమున రంభ, మంత్రి యాలోచనకున్"

అను పద్యమునకు సరియగు శ్లోకమిది.

"కార్యేషు మంత్రీ కరణేషు దాసీ
భోజ్యేషు మాతా శయనేషు రంభా
ధర్మేఽను కూలా క్షమయా ధరిత్రీ
భార్యాచ షాడ్గుణ్యవతీహ దుర్లభా"

గడనకల మగని జూచిన
అడుగడుగుకు మడుగులిడుదు రతివలు,

అనునది

"యావద్విత్తోపార్జనశక్తః
తావన్నిజపరి నారోరక్తః"

అన్న దానిని బోలినది.

బలవంతుడ నాకేమని
పలువురితో నిగ్రహించి పలుకుట మేలా ?
బలవంతమైన సర్పము
చలి చీమల చేత జిక్కి చావదె సుమతీ.

అనుదానికి మూలము

"బహుభిర్న విరోద్ధవ్యం దుర్జనైస్స్వజనైరపి
స్ఫురంత మపి నాగేంద్రం భక్షయంతిపిపీలికాః"

పరిశోధించు వారికెన్ని యిట్టివి లభించునో యేమో?

## సుమతినీతి

ప్రాచీన సంస్కృత కవులును నీతి శాస్త్రకారులును తెలిపిన భావములనే సుమతి శతకకారుడును వెల్లడించినాడు. అందుకొన్ని ఈనాటి నీతికోవిదులు

మెచ్చనట్టివియు కలవు. "గొల్లని సాహిత్యవిద్య, కోమలి నిజము........లేవు తెలియర సుమతీ" అనుట విచారకరము ఏమీ! గొల్లవారంతటి మూర్ఖులా? ఇతరుల స్వత్వమేనా సాహిత్య విద్య! "ఒల్లని సతినొల్లని పతి నొల్లని చెలికాని విడువనొల్లని వాడే గొల్లండు" ప్రాసకై గొల్లడే దొరికినాడే కవికి! కోమలికి నిజము కల్లయట. "లేదు సుమీ సతులవలపు" అని మరొకమారన్నాడు కవి. పురుషులె నిజాన్ని గుత్త గొన్నట్టి వారు కాబోలు! కోమలులే వ్రాసియుండిన వారేమని యుందురు. "మగవారీనిలా నమ్మరాదే చెలీ" అని యుందురు కదా! పులియే చిత్తరువు వ్రాసి యుండిన నెట్లుండును? (మానవుడు పులిని జంపి దానిపై కాలుంచినట్లు చిత్రించిన దానిని పులికి జూపగా, పులియే చిత్రించిన మరొక విధముగా నుండునులే అని పులి యన్నదట)" మేకల పాడియే యుత్కృష్టమని వైద్యుల యభిప్రాయము.

"కొక్కోకమెల్ల జదివిన
చిక్కదురా వారకాంత" అన్నాడు

వాత్స్యాయనుని శాస్త్రమునకు తెనుగు దేశములో ప్రచారము లేదయ్యెను. ఎవడో మళయాళియుడగు కొక్కోకుడు వ్రాసిన అనుత్తమ గ్రంథానికే ప్రచార మెక్కువయ్యెను. తెనుగులో ఎర్రన కవి యనునతడు క్రీ. శ. 1600 ప్రాంత ములో దానిని రచించెను. సుమతి కారుడు ఎర్రన కవి కొక్కోకముగా సంస్కృత రతి రహస్యముగా పేర్కొనినది. సంస్కృతములో కవి పేరు కొక్కోకుడు. తెలుగులో కృతి పేరే కొక్కోకముగా ప్రసిద్ధమయ్యెను.

"కరణము కరణము నమ్మిన మరణాంతక మౌను"
"ఒక యూరికి నొక కరణము"
"కరణముల ననుసరింపక, విరసంబున తిన్న తిండి వికటించు సుమీ"
"కరణము సాదై యున్నను లెక్క గొనరు గదరా సుమతీ"
"కరణము వైదికుడైనను మరణాంతక మౌను"
"ధరకాపు కొండెడైనను కరణాలకు బ్రతుకు లేదు".
అని ఆరుమారులు కరణాలను స్మరించినాడు సుమతి.

కాని ఆ స్మరణ కరణాలకు ప్రశంసా పాత్రము కాదు కరణా లొకరి నొకరు నమ్మరనియు, కరణాలు సాధువు లెన్నటికి కారనియు, వారు రైతులను బాధించెడి వారనియు, కరణాలు సాధారణముగా నియోగులేననియు, కవి యభిప్రాయము. రాయని భాస్కరుని కాలానికి పూర్వము కమసాలులు కరణాలై యుండిరనియు, భాస్కరుడు వారిని తొలగించి నియోగుల నేర్పాటుచేసెననియు(?) నొక కథకు ప్రచారము కలిగింది. అది నిజమగుచో సుమతి కవి క్రీ.శ. 1600 ప్రాంతము వాడగును.

''వెలయాలు సేయు బాసలు
వెలయగ నగపాలి పొందు వెలమ చెలిమియున్
కలలోన గన్న కలిమియు
విలసితముగ నమ్మరాదు వినరా సుమతీ''

కవికి గొల్లలన్న అసహ్యము. కరణాలన్న కోపము. వైదికుడు మరణాంతకుడు. వెలమలు నమ్మరాని వారు. ''నమ్మకు మగసాలవాని'', నమ్మకు మంగడి వానిని", అనుటకూడ అగసాలి వారుకూడా దుర్మార్గులు. అంగడి వాడన వ్యాపారి. బహుశ కోమటియని కవి దృష్టిలో నుండును. దుష్టరాజులను దొరలను, అధికారులను పలుమారు దూషించెను. కాపుల వృత్తియు నంత మెచ్చు వచ్చినట్లు కానరాదు.

అడిగిన జీతం బియ్యని
మిడి మేలపు దొరను గొలచి మిడుకుట కంటెన్
వడిగల రెండెద్దుల కట్టుక
మడి దున్నుక బ్రతక వచ్చు మహిలో సుమతీ.

అని నికృష్ట పక్షములో మేలు రకముగా తలచెను.

''మేలెంచని మాలిన్యుని
మాలను నగ సాల వాని మంగలి హితుగా
నేలిన నరపతి రాజ్యము
నేల గలసి పోవు గాని నెగడదు సుమతీ.

అని చెప్పుటచే మాల, మంగలివారు నీచులైరి. అగసాలిని వెలుమలను, కరణాలను, మాల, మంగలి వారిని నిరసించిన పద్యాలు కవి సొంత భావములై యుండును. కవి యే జాతివాడో పై నిరసనములను బట్టి ఊహించుట మరింత కష్టమైనది.

"కల కంఠ కంఠి కన్నీ రొలికిన
సిరి యింట నుండ నొల్లదు సుమతీ."
"అక్కరకు రాని చుట్టము
మ్రొక్కిన వర మీని వేల్పు...."
"అపకారికి నుపకారము
నెప మెన్నక సేయు వాడె నేర్పరి సుమతీ"
"ఎప్పుడు సంపద గలిగిన
పసి బాలల పొందు వాడు పశువుర సుమతీ"
"బలవంతుడ నా కేమని
పలువురతో నిగ్రహించి పల్కుటమేలా"
"సరసము విరసము కొరకే.........

ఇట్టి పద్యాలు ఉత్తమమై శతక వాఙ్మయములో మకుటాయమానమై యొప్పు చున్నవి.

## సుమతి శైలి

అన్ని శతకములోను సుమతి శతక శైలి విలక్షణమైనది. ఇతనికి అను ప్రాసములపై ప్రీతి యెక్కుడు. సులభముగా పద్యములను జ్ఞాపక ముంచుకొను విధమున వ్రాసినాడు. వేమన పద్యములైనను, సుమతి పద్యాలైనను తెలియని విద్యావంతులు తెలుగు వారిలో అరుదు. [ఈ కాలము తెనుగుతో డిగ్రీలు పొందిన వారిలో కొందరికివి రాకపోవచ్చును కాని జన సామాన్యములో సుమతికిని వేమనకును బాగా ఆదరము కలదు.]

ఇక ఈ కవి వాడిన పదాలను కొన్నిందిని విచారింతము. "ఎద్దుం గట్టుక", "మడి దున్నక" అని కవి ప్రయోగించినాడు. ఇవి భారత కవులలోను, వారి కాలపు కవులలోను ఉండిన ప్రయోగాలు కావని వైయాకరుణుల అభిప్రాయము. అట్లగుటచేత ఎర్రాప్రగడ శ్రీనాథుల తర్వాతి వాడని చెప్పవచ్చును.

"గుడి మణియము సేయరాదు" అని ముద్రిత ప్రతులలో కలదు. మణియము శబ్ద రత్నాకరము (శ. ర)లో లేదు. మణివము, మణిగము అను పదాలిచ్చినాడు. కాని వాటికి ప్రమాణములు తెలుపలేదు. మన్నెము, మన్యము, మాన్యము అను శబ్దాలకి మణియము సమానముగ నున్నందున ఇదియే సరియగు రూపమేమో? అధరము కదలీ కదలక అని కొన్ని ప్రతులలో కలదు. కొన్నిటిలో కదలియు కదలక అని ముద్రించినారు. ఏదిసరి? ''ప్రాకొన్న నూతి యుదకము, అనుచో ప్రాకొన్న అనగా ప్రాతబడి వాడుక లేకయున్న అని ఒకరి వ్యాఖ్య. ప్రాకు—కొను = ప్రాకొను పాచిపట్టు అని శ. ర. లో అర్థమిచ్చి దానికీ పంక్తినే యుదహరించినారు.

"వాదుకు దెచ్చునదె కీడు'' అనుటలో వాదునకు అనుటకు మారుగా వాదుకు అని కవి ప్రయోగించినది గమనింపదగినదె. "సర్పంబు పడగనీడను" ప్పకు నుర్పకు ప్రాస కలిపి ముద్రించినారు. కాని సర్పము తద్భవములో సప్ప మగును. ఆరూపమియ్యవచ్చును. శ. ర. ములో సప్పము అను పదమిచ్చి ఇదే పంక్తి నుదహరించినారు.

ఈకవి రేఫశకట రేఫల ప్రాసలను పాటించినాడు. కవి ప్రాచీనుడు కాదని తెలుపుటకిది ముఖ్యాధారము. శ్రీనాథునికి పూర్వమువారు [ప్రమాదోధీమతా మపి అనునది కాక] రేఫద్వయ సాంకర్యము చేసినవారుకారు. కరణము, మఱినమ్మక అనుచోటను పరునాత్మ మఱుమాట అనుచోటను, పరుల కష్టము ఎఱిగియు అను చోటను, పరులకు, పిఱికికి అనుచోటను ఇతడు ప్రాసలందు రేఫద్వయ మైత్రి ఘటించినాడు. ''పేరణము లేని లేమయు" అనుచో పేరణమునకు శ.ర.లో అంగీ యనియు వ్యాఖ్యాతలు రవికయనియు వ్రాసినారు. పేరణము ఎక్కువగా ఒక నాట్య భంగిమమునకే ప్రాచీనులు వాడినారు. నాట్యమెరుగని స్త్రీ అనియు, చెప్ప

వచ్చును. "వీరణములు లేని పెండ్లి" అనుచో, వీరణములకు, చర్మవాద్య విశేష మని శ.ర.లో వాద్యములు అని వ్యాఖ్యాతలును వ్రాసిరి. చర్మవాద్య విశేషమన నెట్టిది. ఈనాడును కొందరు గొల్లవారు తమ యిండ్లలోని వివాహములందు ఒక పెద్ద డోలు వాయింతురు. ఆ డోలు మంగలివారు వాయించు డోలుకు నాల్గింతలయి నను ఉండును. దానిని గొల్లవారు "వీరన్న డోలు" అందురు. ఎందుకాపేరు పెట్టినా రనిన, వీరభద్రుని సేవలో వాయించినది కాన వీరన్నడోలైనదందురు. సాధా రణముగా గొల్లలు వైష్ణవులే. కావున ఆ యర్థము సరికాదు. వీరణడోలు (వీరణము అను పేరుగల డోలు) అను పదమే వారి నోళ్ళలో నలిగి వీరన్నడోలు అయినది. అంతే!

"జగడము చోటగా" అనుచో జగడ శబ్దము ఝకటము అను సంస్కృత శబ్ద భవము. భారత కవులీ జగడ శబ్దమును అంత పెద్ద కలహాల గ్రంథములో వాడినట్లు నాకు గోచరింపలేదు. ఇదియు శ్రీనాథాంతర పదమనవలెను. (ఝకట శబ్దము నొక తాయన్న కవియే ఒక చోటనే వాడెను).

"తలమాసిన ఒలుమాసిన" అనుచో, ఒలు అనగా ఒడలు (శరీరము అని అర్థము చెప్పుకొనవలసి యుండును.) ఈ శబ్దము నిఘంటులలో లేదు. సుమతి శతకాన్ని ఉదాహరించిన శ. ర. లో ఒలు శబ్దము లేదు. ఇది ప్రాస భీతిచే సన్నగిలిన శబ్దమా లేక అట్టి ప్రయోగము వ్యవహారమందున్నదా? ఒడలు శబ్దము ఉత్తర సర్కారులోనే ఎక్కువగా వ్యవహారమున నున్నది. రాయలసీమ, తెలంగాణములలో పై, పయి, పెయి అని ఎక్కువగా వాడుదురు. ఈ పదాలు మై, మెయి అను భారత కవుల పదాల గ్రామ్య రూపాలే కాని అన్యము కావు. కాని సర్కారులలో ఒడలు, ఒళ్ళు కాక ఒలు అను రూపము కూడ కలదేమో తెలియదు.

"చీరే శృంగార మంత్రడు స్త్రీలకు సుమతీ" అనుటలో చీర అనగా స్త్రీలు కట్టుకొను కోక అని యర్థము కదా. ఈ పదము కూడ కవి యొక్క మధ్య కాలమును క్రీ. శ. 1500-1600 ప్రాంతమును సూచించును. భారత కవులును, ప్రాచీన కవులును, చీరను స్త్రీ వస్త్ర విశిష్టార్థమున కాక, వస్త్ర సామాన్యార్థమునకే వాడిరి. "తలఁజీర సుట్టియును" అని తిక్కన వ్రాసెను. (అను 3-177)

"సంగరమున పారిపోవు సరసుడవైనన్" అనునది కొన్ని ముద్రణములలో సరసుడవైతే అని యున్నది.

"చీటికి ప్రాణంబు ప్రాలు" అనుచో చీటి యనగా పత్ర ఖండమని శ.ర. లోను, జాబు, రసీదు అని వ్యాఖ్యానములలోను కలదు. చీటి పదము తెనుగు పదమేనా? అని సందేహము! హిందూస్థానీలో చిట్టీ అను పదమునుండి వచ్చెనేమో అని యూహింతును.

"పిరికికి దళవాయితనము పెట్టకు" అనుదానిలో దళవాయితనము అనగా సేనా నాయకత్వమని అర్థము. ఈ పదము కూడ భారత కవులది కానట్లు తలతును.

"మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ॥" అను పంక్తి ఒకముద్రణలో "మనుజాధి పుడతడు గొల్వ మహిలో సుమతీ" అని కలదు. "కాపు కొండెడయిన" అనుచో కొండీడు అనుటకు కవికొండెడు అని ప్రయోగించెను.

"ఖభముల నొందని చదువును" అను పద్యములో మూడవ పంక్తి "అభిలాష లేని కూటమి" అని కలదు. నేను చూచిన ఒక ప్రతిలో "గుభగుభలు" లేని కూటమి అని కలదు. (గుబగుబలని) కలదు కాని ప్రాసకై గుభగుభలు అని వ్రాస్తున్నాను.)

"కడు బలవంతుడైనను" అను పద్యములో తుది గీటులో "పడుపుగ నంగడికి దానె పంపుట సుమతీ" అని కలదు. కాని ఒక ప్రతిలో "బడువగ నంగడికి...." అని కలదు. బడువ అనగా నీచుడు అను నర్థములో వ్యావహారమందు కలదు.

"తలదడిపి బాస చేసిన" అని సుమతి "తల దడిపి బాస జేసిన" అని సారంగధర ఏదిసరి?

"తాననుభవింప నర్థము" తాను అనుభవింపని యర్థము అనుటకు తప్పు ప్రయోగము ఇదియు కవియొక్క అర్వాచీనత్వమునకు నిదర్శనము కాదగును.

"నీరే ప్రాణాధారము" అను పద్యములో "నీరే" అను దానికి సరిపోవు నట్లు—నోరే, నారే, చీరే, అనియొక ప్రతిలో ముద్రించినారు. కాని తక్కువ వాటిలో నారియె, చీరయె అని ముద్రించినారు. ఏవి కవి ప్రయోగాలో?

''పరసతుల గోష్ఠి నుండిన'' అను పద్యములో మూడవ పంక్తి ''గరిత సుశీలయె యైనను'' అని యొక ప్రతిలోను ''పరసతి సుశీల యైనను" అని ఒక ప్రతిలోను కలదు. ''పరునాత్మ దలచు సతివిడు" మఱుమాటలు పలుకు సుతుల మన్నింపకుమీ" అని ముద్రణ. ఒక ప్రతిలో "బరునాత్మ దలచు" అని కలదు. మరియు పద్య మిట్లుండెనా? పరునాత్మ తలచుసతి: విడుమర మాటలు పలుకు సుతుల మన్నింపకుమీ"

"మది నొకనివలసి పద్యములో "మానక తిరుగన్ అది చిలుక పిల్లి పట్టిన" అని కలదు. ఇది కవి హృదయము కానట్లున్నది. పద్యపునడక, అల్లిక, ఎల్లెట్లో ఉన్నది.

"సిరి దావచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలము భంగిన్."

అని కొన్ని ప్రతులలో ముద్రించి రలప్రాసము నుంచినారు. ఒక ప్రతిలో,

"సిరి దావచ్చిన వచ్చును
సరిపోల్పగ నారికేళ సలిలము భంగిన్"

అని కలదు. ఇది మంచి పాఠము కాదా?

ఈ విధముగా ఈ చిన్న శతకములో ఇన్ని పాఠభేదాలుండుట దీని ప్రచారాధిక్యమునే సూచించును. కావున పూర్వ తాళపత్ర ప్రతులను సేకరించి సరియగు పాఠములను నిర్ణయించుట అవసరమని అంటున్నాను. ఇంకను కొన్ని అప్రధానములగు పాఠభేదములను విషయగురుత్వశంకతో వదలినాను.

70 ఏండ్ల వృద్ధుడొకడు తన బాల్యములోని ఈ నీతిపద్యములు అచ్చులో లేదని విచారించి నాకిట్లు చదివి వినిపించెను.

"ఘన మెరుగనట్టి కోడలు,
వినయము లేనట్టి సుతుడు, వెరవని యనుజుం
డను కూలగాని భార్యయు
మనుజున కిది మందులేని మరణము సుమతీ."

ఒక ప్రతిలోని క్రింది యధిక పాఠము కలదు.

''వలరసము సతికి బుట్టక
బలిమిని దమకించి విటుడుపై కొనుచెల్లన్
మలయజము సానమీదను
జలముంచక తీసినట్టి చందము సుమతీ"

అయితే యీ పద్యము ఎఱ్ఱన కొక్కోక కళాశాస్త్ర మందిట్లున్నదని చెప్పిరి.

"వలరసము సతికి బుట్టక
బలిమిని దమకించి విటుడు పై కొనుచెల్లన్
జలముంచక సానపయిన్
మల యజమును తీయబూను మాదిరికాదె''

ఒక పూర్వ లక్షణ గ్రంథములో ఈ క్రింది పద్యమునుదాహరించినాను.

కాదన్న వాడె కరణము। వాదడచినవాడె
మేటి వసుధేశుకడన్।
లేదన్నవాడె చనవరి।
గాథలు పెక్కాడు వాడే
కావ్యుడు సుమతీ॥

వేమన పద్యాలలో పలువురి తమ పైత్యాన్ని పద్యాన్నిగా మార్చి దూర్చినట్లు, సుమతిలోను స్వమతిని అతికించిన వారుకూడ యుండిరేమో ?

ఇంత దూరము చేసిన చర్చనుబట్టి సుమతి శతకకారుడు క్రీ.శ. 1500-1600 ప్రాంతము వాడని అభిప్రాయ పడుదును.

ఈ శతకమునకు పీఠికనువ్రాసి చక్కని పాఠములను నిర్ణయించి పాఠాంతరములనిచ్చి ఆవసరమగు పదముల విశేషార్థములను వ్రాసి, మూల సంస్కృత శ్లోకాలను వెదకిచూపి ఆకర్షణీయముగా ముద్రించుట అత్యంతావశ్యకమని నిరూపించుటకే వ్యాసలేశము పనికివచ్చుగాక

# ఎఱ్ఱాప్రెగ్గడ

**సారస్వత పరిస్థితులు :-** కేవలము మతాభిమానముతో మత ప్రచారము నకై కావ్య రచన చేయు నాచారము తగ్గిపోయి కావ్య కళా దృష్టి తోడను సారస్వత స్పర్థతోడను కావ్య నిర్మాణము చేయు స్థితి ఎఱ్ఱన కవి కాలమునాటికి క్రమముగా వచ్చినది. కావుననే శివభక్తిచేత శంభు దాసుడైనను కవిత్వ రచనా విధానము చేత ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహ పురాణమును రచించి యహోబల నృసింహస్వామికి అంకిత మిచ్చెను.

ఎఱ్ఱాప్రెగ్గడ నియోగి బ్రాహ్మణుడు. శ్రీవత్స గోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. ఈ మహాకవిని గన్న తల్లిదండ్రులు-పోతాంబ సూరనలు ఎఱశంకర స్వామి పితామహుడు. గురువు.

**కవి కాలము :-** ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమును, హరివంశమును ప్రోలయ వేమారెడ్డి కంకితము చేసెను. ప్రోలయ వేమారెడ్డి క్రి. శ. 1324-53 వఱకు రాజ్యము చేసెను. కావున ఆ రాజాస్థానముననున్న ఈ కవి కూడ నీ కాలముననే యుండెననుట స్పష్టము.

**1. హరివంశము :-** ఇది భారతమున కనుబంధ గ్రంథము. ఎఱ్ఱాప్రెగ్గడ సంస్కృత హరివంశము నాంధ్రీకరించుటలో భారతాంధ్రీకరణ పద్ధతినే యనుసరించి సాధ్యమైనంతవరకు విషయములను సంగ్రహించి మూల కథాంశ ముల రచించెను. కాని యితడు మూలమందలి హంసడిభకోపాఖ్యానమును-వజ్రనాభ వధఘట్టమును వదలి వేసినాడు ఎఱ్ఱన ముఖ్యముగా ఔచిత్యము పాటించి మూలమును వదలక రసపోషణము చేయుచు తన రచనా పాటవముచే మూలమునకు గూడ మెఱుగు పెట్టినట్లున్నది. ఉషాపరిణయమున నీతడు వర్ణించిన నూతన వధూవరుల ముగ్ధ శృంగార ప్రణయ భావములు - చిత్రలేఖ పాత్రపోషణము లిట్టివి. శ్రీకృష్ణుని శైవ క్రీడోత్సవము. యశోదా దేవకీదేవుల

మాతృభావము స్వభావసిద్ధముగా చిత్రింపబడి పోతనార్యుని భాగవత రచనకు వరవడియైనది.

ఉదా॥ ఎక్కడి కేనియు బోయెద
మీ కష్టవు పాటు పడగనే మోర్వము నీ
చొక్కపు కొడుకును నీవును
నొక్కతలము నొక్కమూరి నుండుడు నెమ్మిన్ (హం)

దీనికి సరియగు పోతన పద్యమిది.

ఓ యమ్మ నీ కుమారుడు
మా యిండ్లను పాలు పెఱుగు మన నీడమ్మా
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన మంజుల వాణీ-(భాగ)

ఈ విధముగా యెఱ్ఱన రచన మలతి యలతి తెలుగు పదముల బింకముతో నొప్పుచున్నది. ఎఱ్ఱన హరివంశమునందు పోతన భాగవతమునందును గూడ సత్యభామా యుద్ధము - రుక్మిణీ పరిణయము - కాళీయ మర్దనము, కృష్ణలీలలు, వామనావతారము మొదలైన సమాన ఘట్టములు గలవు. ఇందు పోతనకంటె ఎఱ్ఱన రచన మేలుబంతియైనది. అట్లయ్యును ఎఱ్ఱన రచనమును పోతన కవిత మించి పోయెననియే చెప్పవలయును.

**1. నృసింహ పురాణము :-** ఇది యష్టాదశ పురాణములలో నొకటి కాదు. ఇందలి కథ బ్రహ్మాండాది పురాణాంతర్గత మైనది భాగవతమున కూడ నీ కథ గలదు. కవి కొంత కల్పించెను. విష్ణు పురాణమున నృసింహావతార కథ గలదు. అందు నృసింహుడేల హిరణ్య కశిపుని జంపెనో చెప్పబడలేదు. దాని యందు నృసింహుడు స్తంభము బ్రద్దలు చేసుకొని వచ్చుటయు లేదు. సంస్కృత నృసింహ పురాణమునకు దీనికి పోలికయే లేదు. ఇందలి వర్ణనలు కవి స్వకపోల కల్పితములై ప్రబంధమునందు వలె ఋతు-చంద్రోదయాది వర్ణనలతో ప్రధాన కథకు భంగము కల్గింపక కథా సౌష్ఠవముతో చేయబడినవి.

ఈ కథకు సనక సనందాదుల శాపము బీజమును హిరణ్యా కశిపుని వధ కార్యమునై యున్నది. హిరణ్యా కశిపుని పాత్ర పోషణము విష్ణు సాయుజ్యము పొందు వానిగా చిత్రింపబడక యహంభావ పూరితుడైన విష్ణు ద్వేషిగా పరిణ మించెను. నిధన సమయమందు కూడ హిరణ్యాకశిపుడు జయుడను భావము పాఠకులకు జ్ఞప్తి కలుగదు..

ప్రబంధ కాలమునకు చెందక పోయినను ఆంధ్ర భాషయందు కుమార సంభవము తర్వాత పురాణ కథను ప్రబంధమువలె ప్రౌఢముగా రచించిన వాడగుటచే ఎఱ్ఱనకు ప్రబంధ పరమేశ్వరుడను బిరుదు దగి యున్నది. నృసింహ పురాణ మందలి కథ ప్రహ్లాద చరిత్ర. కావున యిందు కూడ పోతన రచనము నకు సాదృశ్యము కలదు. రసాతిశయమున పోతనది పై చేయియైనను ఔచిత్య పోషణమున నెఱ్ఱన మేటియయ్యెను. భారత భాగవతాది పురాణములవలె నృసింహ పురాణము సంస్కృతమునుండి యాంధ్రీకరింపబడినదికాదు. ఇందలి కథ ఎఱ్ఱనా మాత్యుడు బ్రహ్మాండాద్యనేక పురాణములనుండి గ్రహించి ఔచిత్య పోషణకొఱకు యొక ప్రబంధముగా మార్చినాడు. కావ్యమున ఔచిత్యము ప్రాణప్రదము కాన భాగవత కథ నుండి కవి చేసిన మార్పులను గమనింపవలసియున్నది.

**ఔచిత్యములు :-** శ్రీ విష్ణుద్వార పాలకులైన జయ విజయులు - సనక సనందనాదుల నడ్డగించ నామహర్షులు వారిని అసురయోని జనింపుడని శపించిరి. పిమ్మట విష్ణువు అచటికి వచ్చి వారిననతి కాలములో తన యంతికము చేరునట్లను గ్రహించుటకును వేడుట మూలకథ. విజయులకు వైకుంఠ మొసగు అధికారము విష్ణువునకుండగా ఆ మహర్షుల యాచింపనేల? ఈ సంఘటన సర్వాంతర్యామికి తెలియకుండ జరుగుటెట్లు? అల్ప దోషమునకే యింత ఘోర శాపమా? ఈ అనౌ చిత్యముల పరిహరించుటకై ఎఱ్ఱన సనకసనందాదులతో విష్ణువు" జయ విజయు లొనర్చిన దోషము తనదేననియు - అనతి కాలములో ద్వార పాలకులు తనలో నైక్యమగుదురనియు ఈ సంఘటనలన్నియు తన మాయా బలముచే వారి శ్రేయస్సుకై కల్పింపబడినవని" మార్చి మూల కథకు ఔచిత్యము గూర్చినాడు.

2. హిరణ్యకశిపుడు తన సోదరుని జంపినందులకై హరిని తదనుచరు లగు దేవతలను ద్వేషించి దేవలోకముపై దండెత్తిపోయినట్లుగ భాగవతమున

కలదు. ఇందు వ్యక్తిగతమగు కలహము ప్రతిపాదింపబడినది. ముఖ్యముగా నీతడు పోరాడినది తన యహంకారమువలననే. దానికొక బంధు వినాశనము అను సాధారణ కారణము కంటె ఎఱ్ఱన మఱియొక ఉచిత కారణ మూహించెను. దేవతలు రాక్షసులు సవతుల సంతానము కాన నందులో రాక్షస మాతయగు దితి కశ్యప ప్రజాపతికి జ్యేష్ఠ భార్య యగుటచే త్రిలోక రాజ్యమునకు దైత్యులకెక్కువ యధికారముండెననియు నా హక్కును సాధించుకొనుటకై హిరణ్యకశిపుడు స్వర్గముపై దండెత్తెననియు యీ కవి కల్పన.

3. భాగవతమందలి హిరణ్యకశిపుడు చేసిన బ్రహ్మ స్తుతి అతని యసురత్వమునకు విరుద్ధముగా వేదాంతమయమైయున్నది. దీని నెఱ్ఱన ఔచిత్యము గోరి "సముచితార్థ మధుర బహువిధ స్తోత్ర సమర్థ రచనమున్న నతడిట్లని విన్నవించె"నని మాత్రము రచించెను.

4. హిరణ్యకశిపుడు తపము చేయుచుండగా అతని భార్య గర్భిణియగు లీలావతిని దేవేంద్రుడు చెఱపట్టెనను ఘోర విషయమును లీలావతి శత సంవత్సర గర్భ వృత్తాంతమును హిరణ్యకశిపుని శత దివ్య సంవత్సర లోపమును భాగవతమున కలవు. ఔచిత్య పోషణ కొఱకు ఎఱ్ఱన మహాకవి నృసింహ పురాణమున వీనిని సంహరించెను.

5. హరి నృసింహ రూపమున నొక స్తంభమున నావిర్భవించుటకు గల కారణముగా నెఱ్ఱనచే నృసింహ పురాణమున నొక చక్కని సందర్భముగూర్పబడినది. నృసింహావతార సన్నివేశము హిరణ్యకశిపుని "సమంచిత కాంచన రత్న ఖచిత మహా స్తంభ శత సంఖ్యాతమగు సభా మండపమున" జరిగినట్లు వర్ణింపబడినది. అందుచే నా సభయందలి ఒకానొక స్తంభమునందు హరిని జూపుమని హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని నడుగుటయు నంత హరి దాని నుండి యుద్భవించుటయు సక్రమముగా పరిణమించినది.

ఈ విధముగా నెఱ్ఱన మూలమునకు ఔచిత్యముచేత మెఱుగుపెట్టినాడనియే భావింపవలె.

పోతనపై యెఱ్ఱన ప్రభావము :- ఎఱ్ఱన యొక్క రచన పోతనామాత్యునకు అనేక విధముల మార్గదర్శకమైనదనుటలో సందేహము లేదు. ఎఱ్ఱన వ్యాకరణ ఛందోఽలంకార లక్షణ యుక్తముగా వ్రాసినాడు. పోతనా మాత్యునకు ఎఱ్ఱన కున్నంత పాండిత్యము లేకపోయినను పోతన కవిత్వమున గల మృదు మధుర రచన మాత్రము ఎఱ్ఱన కబ్బలేదనిన విమర్శకు లంగీకరింతురని యనుకొందును. అవాఙ్మానసగోచరమగు నొక విధమైన విష్ణు భక్త్యామృత రసము పోతనార్యుని కవిత్వములోన నపాయముగావచ్చి భక్తిరసాబ్ధిలో నోలలాడించును. ఎఱ్ఱనార్యుని పోతనామాత్యుడనుకరించిన పద్యములనేకము గలవు.

1. కలడు మేదిని యందుగలడు దకంబుల
గలడు వాయుపు నందు గలడు వహ్ని—(నృసిం)

2. కలడంభోధి గలండుగాలిగల దాకాశంబునన్ గుంభినింగలదగ్నిన్ ....

3. ఇందు గల డందు లేడని.....(భాగ)

అనుకరించిన పద్యములో మెఱుగుబెట్టి పైగా మించి మంచి పద్యము వ్రాసినాడు.

"వాసుదేవుని పాదవనరుహంబుల భక్తి
తగదను తండ్రియు దండ్రిగాడు (నృసింహ)
"శౌరి పదాంబుజ స్మృతి రసంబున దేలెడు నా మనంబు........
"........అంబుజోదర దివ్య పాదారవింద...........(భాగ)

ఈ రసవత్ఖండ సృష్టికి పై పద్యము మూల మనుటకు సందేహమేమియును లేదు.

అరణ్య పర్వ పూరణము :- ఎఱ్ఱనమీద ఏ మాత్రము గౌరవ భావము లేని కొందరు విమర్శకులు భారతారణ్య పర్వ శేషమును పూరించ లేదనియు, నన్నయ భారతమున మూడు పర్వములను పూర్తిగా వ్రాసినాడనియు - అక్కడక్కడ క్రిమిదష్టమైన అక్షరములను ఎఱ్ఱన సర్దెనను వాదములు చేసిరి

అరణ్య పర్వాంతమున —
........ఎఱ్ఱనార్యుండు సకల లోకైక విదితుడు —
....................

కం. ధీర విచారుడు తత్కవి
తా రీతియు కొంతదోప దద్రచనయకా
నారణ్య పర్వ శేషము
పూరించె కర్ణపుట పేయముగాన్—"

అని యుండుటచే నే డాంధ్రలోకము ఎఱ్ఱనామాత్యుఁడు అరణ్య పర్వ శేషమును పూరించెనని నమ్ముచున్నది. మరియు

ఉ. శారదరాత్రులు జ్వల లసత్తరతారక హార పంక్తులం
జారు తరంబులయ్యె, వికసన్నవకైరవ గంధ బంధురో
దార సమీరసౌరభము దాల్చి సుధాంశువి కీర్యమాణక
ర్పూర పరాగ పాండు రుచి పూరము లంబర పూరితంబులై"

అరణ్య పర్వము లోనిది నన్నయ చివరి పద్యముగా మరి ఈ క్రింది పద్యము నుండి ఎఱ్ఱన కవిత్వము.

చ. "స్ఫుర దరుణాంశు రాగరుచి బొంపిరి వోయి, నిర స్తనీరదా
వరణములై దశత్క్రమల వైభవ జృంభణముల్లసిల్ల ను
ద్ధుతర హంస సారసమధు వ్రత నిస్వనముల్ సెలంగగా
కరము వెలింగె వాసర ముఖంబులు శారద వేళ జూడగన్"

దీనిని ఒట్టి అరణ్య పర్వమున గల మొత్తము 2,900 గద్య పద్యములందు నన్నయ 1300 లును, ఎఱ్ఱన 1600 లును రచించెగాన సగముకంటే నధికముగ ఎఱ్ఱనయే రచించె ననుట స్పష్టము.

**రామాయణము :-** ఎఱ్ఱన రామాయణ మిప్పు డెచ్చటను కానరాదు. దీని నుండి కొన్ని పద్యములను కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణ సార సంగ్రహమున నుదాహరించెను. ఒక సంకలన గ్రంథములో గూర్పబడిన యెఱ్ఱాప్రెగ్గడ రామాయణములోని కొన్ని పద్యములను వేటూరి ప్రభాకర శాస్త్రి గారు సేకరించి నారు.

# ఆంధ్ర వాఙ్మయమున యెఱ్ఱనకు గల స్థానము

ఆంధ్రమున కవిత్రయము వారి ప్రయోగములు ప్రామాణికము లనియు తద్భిన్నములగు కార్యములు కావని లాక్షణికులు తలంతురు. వీరు కావ్య రచనకు మార్గదర్శకు లనియు గురువు లనియు కూడ నంగీకరించి తర్వాతి కవులు వీరిని కావ్యారంభముల స్తుతింప జొచ్చిరి. నన్నయ వాగనుశాసనుడుగను, తిక్కనకవి బ్రహ్మగాన నీతడు ప్రబంధ పరమేశ్వరుడనబడి రాబోవు ప్రబంధ యుగమునకు మార్గదర్శకు డయ్యెను. అరణ్య పర్వమును పూరించుటయేగాక భారతానుబంధ గ్రంథమగు హరివంశమునుగూడ రచించి భారతమును పరిపూర్ణముగా రచించిన వాడని ఖ్యాతి పొందెను.

నిజానికి భారతారణ్య పర్వ పూరణలో నొక పెద్ద సంకటము గలదు. నన్నయది సంస్కృత భూయిష్ఠ శైలి. తిక్కన శైలి దేశీయ పదమయము. అరణ్య పర్వ పూరణ మీ రెంటికిని వంతెనవలె నుండవలెను. లేనిచో అతుకుల బొంత వలె తయారగును. ఎఱ్ఱన కుభయ భాషలయందు కావ్య రచనా సామర్థ్య ముండుటచే నీయసిధారా వ్రతమును బహు చాకచక్యముతో నిర్వహించి యాంధ్ర సారస్వతలోకము మెప్పును, కృతజ్ఞతను బడసిన వాడయ్యెను. అందుచే నీతనికి నన్నయ, తిక్కనలతో సమాన గౌరవ ప్రతిపత్తులు దక్కినవి. ఇదియే ఎఱ్ఱన కాంధ్ర వాఙ్మయ మందలి గల స్థానము.

**ఆంధ్రీకరణ విధానము :-** నన్నయ భట్టు మార్గముననే కథా ప్రధాన ముగ మూలము ననుసరించవలసినచో వర్ణనలు కొన్ని కలిపియు, కొన్ని విడిచియు కొన్ని మార్చియు స్వతంత్రముగా రచించెను.

**కవిత్వ శైలి :-** నన్నయ వలె నతి సంస్కృతముగాక, తిక్కన వలె నతి దేశీయముగాక రెండును సమపాళ్లు గల్గి ఈతని కవితా శైలి రసవత్తరమై కావ్యమై యుచిత గుణాలంకార శోభితమై హృదయరంజకముగానున్నది. నన్నయ తిక్కనలవలె శ్రీవర్ణ నలసతి సభ్యముగాజేసెను.

ఉ. నీలపయోద మండలము నిచ్చల లీల వెలుంగ జేయుచుం
గ్రాలెడు వ్రాలు గ్రొమ్మెఱుగుకైవడి దద్వ నభూమి యంతయున్

లాలిత దేహకాంతి పటలంబుల జేసి వెలుంగ జేయు న
బ్జాల వినీలకుంతల విభాసిని జూచి సవిస్మయాత్ముడై"

## తర్వాతి కవులపై నెఱ్ఱన ప్రభావము

ఈతడు నన్నయ తిక్కనల కవితలో గల మేలును గ్రహించి - తన ప్రతిభచే తన కవితకు కొంత నూతన మార్గము దీసి రాబోవు ప్రబంధ కవులకు మార్గదర్శకుడైనాడు. ఈతని కవితా చాయల పోతన భాగవతము నెంతవరకు గల్గెనో సమాన ఘట్టముల పరికించి చూచితిమి. నృసింహ పురాణములో క్షీర సముద్ర - వైకుంఠ - విష్ణు - వసంత - పానగోష్ఠి మొదలగు వర్ణనములు కొంత దీర్ఘములై కథకు అడ్డుతగిలి చమత్కార కల్పనలతో నలంకారభూయిష్టముగ రచియింపబడి ప్రబంధ కవుల యష్టాదశ వర్ణనాలకు దారి చూపినది.

శ్రీనాథుడు కాశీ ఖండములో-

"పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని దేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్కమాట"

అని చెప్పుకొనెను.

నంది తిమ్మన :- దేవేంద్రుడు తనకు విష్ణ్వాదుల బలముగలదని పొంగుచున్నాడని హిరణ్యకశిపుడు పల్కినపుడు ఎఱ్ఱన నృసింహ పురాణములో ఈ క్రింది పద్యము వ్రాసెను.

"హరి తనకుంగలం డని పురాంతకుదాముద వైరిసేత లె
ప్పరుసున మాన్పడల్లనని పద్మభవుండుమనాత్మలోన ని
ర్జరులకు మేలు గోరునని సంయమికోటి తలంపులన్ని జ
స్ఫురణమయావహించునని పొంగుడు నుండు మహేంద్రుడెప్పుడున్"

నంది తిమ్మన పారిజాతాపహరణములో సత్యభామా గర్వమును గూర్చి నారదునిచే పల్కించిన పద్యము ఎఱ్ఱనపై పద్య రచనానుకరణము గోచరించును.

"చక్కని దాననంచు నెల జవ్వనినంచు జగంబులోన జే
రెక్కిన దాననంచు బతియెంతయు నాకనురక్తుడంచుదా"

ఎఱ్ఱన నృసింహ పురాణములో వన విహారము చేయు స్త్రీల వర్ణనల పద్యమునకు మెఱుగుపెట్టి యనంతామాత్యుడు భోజరాజీయమున నిట్లనుకరించెను.

"మునికాళ్ళ మోపి నిక్కిన పదచ్ఛవి నేల
యను పల్లవించిన యొప్పుమెఱయ
వలులేది నతనాభి బలసి యొక్కింత సా
గినమధ్య యెంతయు ఘనతయు.

.... .... .... .... .... .... .... .... ....

నొయ్యడాకేల దవ్వుల నున్న తీగ
దివిచిన నఖ దీప్తులంతంత వీటుకొనగ
లీపపెఱకేల నచ్చరలేమ యొర్తు
గోసె బువ్వులు ప్రమద వికాస మెసగ" (నృ. పు)

"తరుణీ రత్నము పువ్వు తీగె నొకచేతన్వంచి పాదాగ్రమున్
ధరణిన్ మోపి యొకింత నిక్కితను మధ్యంబొప్పగఁక్ష ద్వయ
స్ఫురణంబార కుచంబులుబ్బిన యనంబుల్వ్రిచ్చి లీలన్మహాం
బురు హంబెత్తి యొకర్తు గోసెనెలమిన్ బుష్పంబు లత్తోటలోన్- (భోజరా)

"సత్ప్రబంధ మహేశ్వరు శంభుదాసు - నధికతర యుక్తి నాదరించి"
అని కాశీఖండములో శ్రీనాథుడే ఆదరించెను గదా —

# ద్విపద రామాయణము

కళ మాసపత్రిక
మద్రాసు, 1922.

## కవిత్వ విషయము

"ద్విపద కావ్యంబు, ముదిలంజ దిడ్డి కంత" యన్నియు నమమని వేణు గోపాలుఁడు పడఁదిట్టిన వాక్యము గొందఱి సమ్మతమున సమంజసమై యుండును. కాని యీ రామయణము వంటి కావ్యములఁ జదివిన తర్వాత నిట్టి యభిప్రాయము తప్పని తోచక పోదు. ద్విపద కావ్యములన్నింటిలో ద్విపద రామాయణము గౌరన హరిశ్చంద్రయు శ్రేష్ఠము లైనవి. పాల్కురికి సోమనాథుని హరవిలాసము గూడ వీనికిఁ దీసి పోయినది కాదు. భారతమును ప్రథమమున నాంధ్రీకరించిన కీర్తి నన్నయ భట్టుది. రామాయణమును మొదటి తెనిగించినది కోన బుద్ధుఁడు. భాగవతము బమ్మెర పోతన ఖ్యాతి నిల్పినది. కోన బుద్ధుని పిమ్మట భాస్కరుడు, మొల్ల, రఘునాథరాయులును వేర్వేరు గ్రంథముల వ్రాసిరి. పిమ్మట కాణాదము పెద్దన గద్వాలయందు రామాయణమును వ్రాసెను. అతని గ్రంథ ముత్కృష్టమైన దయ్యును గద్వాల రాజుగారిచేఁ గొందఱి పండితులకే బహుమతిగా నివ్వబడుటచే నా గ్రంథము కన్యాకుమారి నాసిక యందలి సర్పమణి వోలె రాజాగారి భాండాగారమందే ప్రకాశించుచున్నది. పెద్దన తర్వాత గోపీనాథము వేంకట కవియు, నిటీవల శ్రీవావిలి కొలను సుబ్బారావుగారును దీనిని నాంధ్రీకరించిరి.

కోన బుద్ధుని శైలి నాతికఠినమై లలిత పద గుంభితమై, యుచితస్థలముల వర్ణనములు కలదై, పండితులకును పామరులకును నాదరణీయమై యున్నది. ఇతని గ్రంథము సగము కన్న నెక్కుడు సంస్కృత పదములు గలిగి యున్నను, క్లిష్ట దీర్ఘ సమాసములతో నిండినది కాదు. అప్ప కవిగారి మహాప్రబంధ లక్షణములన్నియు నిందులేవు. అయోధ్యాపురము గ్రంథాంతమందు శ్రీరాముడు సీతకు విమానమందా యా స్థలముల జూపుచో గొద్దిగా వర్ణింపబడి యున్నది. కుమార సంభవములో నన్నెచోడుఁడు జగదీశ్వరుని రహః క్రీడను

హేయముగా వర్ణించెను. ఈ కవి గ్రంథ మందెచ్చటను నాజోలికే పోయిన వాఁడు కాడు. ఇక్కవి వర్ణనములందు మూలమునే యనుసరించినందున చిత్ర విచిత్ర గల్పనల మాట యెత్తుకొనలేదు విశ్వామిత్రు నాశ్రయంబున రాత్రి వర్ణనము చాల రమణీయముగా నున్నది.

''చలియింప కున్నవి సకల వృక్షములు
మెలఁగవు వన భూమి మృగ సమూహములు
నెఱి విహంగములు నీడముల్ చేరి,
మఱచియున్నవి తను మంజుల ధ్వనులు,
దీఁటుగ చీకటి దెసలు నాకసము,
కాటుక బూసిన కరణి నున్నదియు
నీలాంబరంబున నిండు ముత్తెములు
గీలించి బ్రహ్మండ గేహ గోళమున
గడునొప్పగా మేలుకట్టి త్తినట్లు
యుడు గణంబులతోడ నున్నది నింగి (పు-35)

సీత యౌవనమునొందు విషయమును వేరుకవు లలంకారశాస్త్రము నంతయు భోధించి యుందురు కాని ఈ కవి :—

''ఇంతయై, యంతయై యెలజవ్వనమున
వింతయై, యీ యింతి పెలయుట జూచి''

యంతటితో విడిచెను, రామలక్ష్మణాదుల భార్యల నలువురి కన్యకల నిట్లు వర్ణించెను.

శారద పూర్ణిమా చంద్రుని కళలో
చారు వాసంత వాసన పుష్పలతలో
సాన దీరిన మంచి జాతిరత్నములో
శ్రీ నిండఁబట్టి నార్చి కుందనంపుఁ
గమ్మలో కఱిఁబులు గడిగిన ముత్తి
యమ్ములో నెఱతావి నలరు గంధంపుఁ
గొమ్మలోయన బెండ్లికూఁతులొప్పారి; (పు. 75)

రని వర్ణించు భాగము కాళిదాసుని "అనాఘ్రాతం పుష్పం" అను శ్లోకమును జ్ఞప్తికిఁదెచ్చును. జీవనస్థితికినై చేసుదున్న త్రిజటాఖ్య విప్రుడెందాకరాయి రువ్వునో యందాకయుండు గోవులనిచ్చెదనని రాముఁడు పల్కఁగా నతఁడు, కరమున పాషాణ కలితుఁడై.

అఱచి ధోవతి మొల నంట బిగించి,
కుఱుచైన శిఖముడి గొనియాడుఁ గఱచి,
నరముల ప్రాణముల్ నరినంటఁబట్టి;
బిరబిర తన ముష్టి బెట్టుగాఁ ద్రిప్పి,
యురమున జందెము నుఱ్ఱూతలూగ
సరయువుదాట విచ్చలవిడి నేసె; (పు. 108)

అరణ్య కాండ మందు హేమంతము

దిశలెల్లఁ జలికి భీతిలి వెలిపట్టు,
ముసుకు పెట్టిన యట్లు ముంచెహిమంబు;
వెఱపున వణఁకెడు విరహిణులనగఁ,
దెఱగొప్పఁ గదలు పూఁదీఁగె వీక్షింపు. (పు. 153)

ఈ వర్ణన మందలి ప్రతి పఙ్క్తిని జదివి యానందింప వలయును. అచ్చ తెనుగు పదముల యల్లిక యందంద కాననగును. చుప్పనాతి తన కొడుకు తుంటలై పడియుండటం జూచి మునులపై కెగసిన గతిని చిత్తగింపుఁడు

తలను మోపెడు జడల్ ధరియించి బూది,
యలఁది జన్నంబున నందఱుఁగూడి
తొలఁగక మేకపోతుల మెడల్ విఱచి,
పొలుపార నుడికించి పొట్టలనిండ,
నెట్టన నమలి యెండిన గ్రాసములు,
గట్టి యేమియు నెఱుంగ నియట్లయుండి,
క్రొవ్వి నాశిశువును గుమతులై పట్టి
యెవ్విధి జంపితిరి.? (పు. 157)

బజాజీ బంతు లిటులనే కదా యుండవలయును! అను ప్రాసములీకవి కిష్టము వచ్చినవి. విభీషణుఁడు శ్రీరాములను,

నిత్యసత్యత్రాణ, నిత్యకళ్యాణ
నిత్య జగత్త్రాణ నిత్యగీర్వాణ. (పు. 301)

యని స్తుతించెను. ఇంద్రజిత్తు భార్య సులోచన యిదే యంత్యప్రాసములతో

రవి కులాంబుధి సోమ, రామాభిరామ,
ప్రవిమల గుణధామ, పరరాజ భీమ,
జలద సన్నిభ గాత్ర, సారస నేత్ర,
విలసిత చారిత్ర, వితత పవిత్ర. (పు. 471)

యనియు నుతించెను. ఈ పద్ధతిని బమ్మెర పోతనరాజనేక స్థలముల ననుసరించెను.

మహా పురాణ మగుటచే నీ ప్రబంధ మందతిశయోక్తులుత్ప్రేక్ష లక్కడక్కడ ముఖ్యముగా యుద్ధకాండ యందుఁ జేర్పబడి యున్నవి. శ్రీరాములు సముద్రునిపై బ్రహ్మాస్త్రము పయోగించినపుడు.

బ్రహ్మయు నింద్రుండు భ్రమఁగానరైరి,
బ్రహ్మాండ మెల్లను బగిలి నట్లయ్యెః
భువనంబు లెల్లను బొగిలి నట్లయ్యె. (పు. 309)

ఇత్యాదులు, కుంభకర్ణుఁడు యుద్ధభూమికి వచ్చినపుడు సహిత మిదే యవస్థమనము సాధారణముగా 'పైల్వానుల కుస్తీ' చూచునపుడు కరతాళ ధ్వనులు చేయుదుము ఇది రామ రావణయుద్ధము. దేవతలు విమాన ములందుఁ గూర్చుని కనుఱెప్ప వేయక చూచుచున్నారు. ప్రతి రాక్షస వీరుడు గూలినపుడు నరులపై వానరులపై పుష్ప వర్షమును గురిపించుచున్నారు.

''ట్రాయి'' యుద్ధమందు దేవతలు గూడ పోరాడుచుండిరి. ఇక్కడ మన దేవతలు చూపరులే. కాని యుభయ లోకములకును ''రాయిటరు'' అయిన నారదుఁడు మాత్ర మొకతూరి రామ దర్శనమునకై వచ్చెను. రెండవ తూరి యింద్రుడు తన విమానమును బంపెను. ఇమ్మహా కవి యనేక స్థలముల కథా సందర్భములను బ్రకృతి భావములను గలిపి వర్ణించినదీ క్రింది పంక్తుల వలన దెలియును.

దారుణ స్ఫుట రోష దైత్య గర్వాంధ
కారంబుతో నంధ కారంబు విఱిసె
నతి మీఱి వానరా నన సరో జాత
ములతో సరో జాతములు వికసించె; (పు. 510)

ఈ పద్ధతినే గౌరన తన హరిశ్చంద్ర యందనుసరించెను.

విశ్వా మిత్రుఁడు రామ లక్ష్మణులతో,
జెలఁగు సార సగణ సేవ్యమై, పుణ్య
సలిలమై, యుత్ఫుల్ల జలజమై మిగుల
ఫేనమై, నిత్య గంభీరమై, చారు
మీనమై, యతి పుణ్య మిళితమై, యమరు
గంగా తటంబున ఘన లతా సంఘ
సంగతంబగు సమ స్థలమున నిలిచి, (పు. 35)

మాధ్యాహ్నికంబు లొనర్చెను ఘట్టమున నితని శైలి గంగా ప్రవాహము వలెనే ''నిత్య గంభీరమై'' యున్నది.

ఇట్టి యుత్కృష్ట గ్రంథమందుఁ గొన్ని ఛందో వ్యాకరణ దోషములు గాన వచ్చుచున్నవి. అవన్నియు నటులుండ నే నిందు రేఫ ద్వయ మైత్రి విషయమును, క్త్వార్థ కే కార సంధిని గుఱించియుఁ జర్చించెదను. అప్ప కవి రేఫములను జాలను ''క్రమ మెఱుఁగక రెండు నుంగు కవి గూర్చు కృతిన్'' అని రేఫద్వయ మైత్రిఁ జేయు వారికి శాప మిచ్చెను. మఱియు భాగవతమున

'రేఫమ్ములు డాలునుం గలిసి ప్రాసములైన కతంబునం గదా! యిమ్ముల నాది లాక్షణికు లెల్లను మాని రుదాహరింపఁగన్'' అనియు వ్రాసిరి. ఈ ద్విపద రామాయణమునఁ బెక్కు తావుల రేఫద్వయ మైత్రి యున్నను నీ గ్రంథమును లాక్షణికులంగీకరించి యున్నారు. ఒక కోన బుద్ధుడే కాడు, గౌరన, పిన వీఱన, కూచిమంచి తిమ్మకవి, మున్నగు వార నేకు లీమైత్రిని బాటించి యున్నారు. వీరిని గూడ లాక్షిణికు లుదహరించినారు. కాని బమ్మెర పోతన మాత్రమే తర్వాతి వారికి వెఱ బొమ్మయై యున్నాడు. సమాన ధ్వని గల ''ళశ'' లకు మైత్రి కలదు గాని యట్టి రఱలకు లేకుండుట యే నియమము? ధ్వని భేదము కలిగిన ''పుంపులకును'' ముకారమునకును బుకారే కారములకును, మైత్రి కలదు కాని ''ర ఱ''లకు లేదట. ఈ కవి తిక్కన సోమయాజికిఁ బూర్వుడు. ఇట్టి కవుల ప్రయోగము వలన అప్ప కవికిఁ పూర్వమే రేఫద్వయ మైత్రి దుష్టముగా నుండినది కాదనియుఁ దానిం బాటించిన వారు కు కవులు కారనియు విదితమగును ఏమి చిత్రమో మైత్రి కూడదని గట్టిగాఁ బల్కిన యప్ప కవియే 'ర ఱ' లను యతి ప్రాస స్థలముల నుపయోగించినాడు. దీనివలన నతఁడు తమాషా సూత్రము వ్రాసెనని తెలియును.

క్త్వార్థకేకారముపై సంధి యీ కవి కొన్నిచోట్లఁజేసినాడు. జైమినీ భారతమందంతటను నీ సంధి కనఁబడును. నన్నయ సహితము "అందిమ్ము" అని ప్రయోగించినాడు. ఇట్టి యభ్యాసమున కేవో కొన్ని ప్రబల కారణము లుండును. "కొను" నకు "కా" దేశము సహిత మీ గ్రంథమందు సాధారణ ముగాఁ గలదు తర్వాతి కవులును వ్రాసి యున్నారు యతి భంగములున్న స్థలములు కథా భాగమందు సందర్భరహితార్థముల నిచ్చుటచే లేఖకుల దోషము లని తోచెడి.

ఇట్టి దోషములున్న నీ గ్రంథ ప్రశస్తి యావంతయైనను దగ్గినది కాదు. కాని గ్రంథ కర్తృత్వ సందేహమును లోపమొక్కటి యందఱను బాధించు చున్నది. సంస్కృతాంధ్ర భాషాచరిత్రముల మన పూర్వులు వ్రాయ నందున నిట్టి లోపములు గలిగెను. ఈ విషయముల నింకను విశేషముగాఁ బ్రజ్ఞావంతు లందఱును శోధించి యథార్థముల బయలు పఱతురుగాక యని నా విజ్ఞాపన.

## కర్తృత్వ విషయము

"తోరణాల చొక్క దొంగ కుక్క'' యని కొన్ని సంవత్సరములకు బూర్వము చంద్రికా పరిణయకర్త కొల్లాపురము మాధవరాయలు కారనియుఁ దద్గ్రంథకర్త యాస్థానకవియైయుండిన తోరణాల చొక్కయ్య యను నాతఁడే యనియు మహాపండితులు కొందఱుభయ పక్షముల విమర్శనలు సేయసాగిరి. ఆంధ్రభాషయందిట్టి చొక్కయలెందఱో యూహలచేఁ గల్పింపఁబడుచున్నారు. వల్లభరాయల క్రీడాభిరామమును శ్రీనాథుఁడు వ్రాసెనని యందురు. కృష్ణదేవ రాయల యాముక్తమాల్యదను పెద్దన వ్రాసెనందురు. భారతమును నన్నయ సహితము వ్రాయలేదందురు నందితిమ్మన రామరాజభూషణునికి "ముక్కు" అమ్ముకొనెనట! ఇవన్నియు నెంత సత్యములో తెలిసినవి కావు. కాని చిత్రకవి సింగరార్యుఁడు మాత్రము బిల్హణీయమును వ్రాసెనని మనకిప్పుడాశ్వా సాంత పద్యమందలి రహస్యమువలన నిశ్చయముగాఁ దెలిసినది.

ప్రకృతము రంగనాథ రామాయణమను సుప్రసిద్ధమైన ద్విపద కావ్యమును రంగనాథుఁడను కవి వ్రాసెనని ఇంతవఱకును గొందఱి పండితుల యభిప్రాయమైయున్నది.

ఇటీవల రెడ్లు జాత్యభిమానముచేఁ గాఁబోలు! నీ గ్రంథము కోన బుద్ధారెడ్డిదే యని తీర్మానించికొనినారట. ఇట్టి తఱి గ్రంథ కర్తృత్వ నిశ్చయ స్థితి గనుఁగొనుట యావశ్యకము. ఈ కార్యమునకుఁ బూనుకొనుట యందు శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి వంటి మహాపండితుల యభిప్రాయముల విమర్శింపవలయునను భీతి యొకప్రక్క, జాతిపక్షపాతముచే సత్యమును గనుఁగొనఁ జాలనేమో యను శంక యొకప్రక్క నన్ను బాధించుచున్నవి. అయినను నా తోచిన రీతి నిందు విశదీకరించెదను

1. రంగనాథుడు 'రామాయణమును దెనిఁగించినట్లు గ్రంథమున నెచ్చటను జెప్పుకొనలేదు.' కాని కోన బుద్ధభూపాలుఁడు గ్రంథమంతటను దన పేరే తగిలించినాడు.

2. అయితే గ్రంథ నామములు కవులనుబట్టి పెట్టఁబడుచుండును. ఇది రంగనాథుని పక్షమునఁ బ్రబలమైన యాధారము. ఆంధ్రమందు మొల్ల రామాయణము, గోపీనాథ రామాయణము మున్నగు గ్రంథములే కాక, ఇతర భాషలందు కంబ రామాయణము, తులసీదాసు రామాయణము అని జగద్విఖ్యాతములై యున్నవి. అయితే మన రంగనాథ రామాయణము రంగనాథునిదేయని చెప్పుటకన్ని విధముల యాధారములు లేవు. బుద్ధభూపాలుఁడు తన తండ్రియగు విఠ్ఠలనాథుని పేర నీ కావ్యమును రచించెనని గ్రంథమువలనఁ దెలియును. ఆంధ్రమందు నెవరి పేరిట గ్రంథము నంకితము సేయుదురో వారి పేరిట గ్రంథనామ ముండినటుల నరసభూపాలీయము, మల్లభూపాలీయమును సాక్ష్యమిచ్చుచున్నవి. అట్టిచో నిది విఠ్ఠల రామాయణమని యుండిన సందేహమే యుండదు కదా. 'రంగనాథ' యని యేల పేర్కొనఁబడియున్నది? దీనికి శ్రీ వంగూరి సుబ్బారావు గారిచ్చిన సమాధానము సరియైయుండునా? విఠ్ఠలదేవుఁడు హిందూలోకమునఁ పాండురంగవిఠ్ఠలుఁడనియు, విఠ్ఠలరంగనాథుఁడనియు సుప్రసిద్ధుఁడు. ఈ బుద్ధ భూపాలుని తండ్రి విఠ్ఠలనాథ యని గ్రంథమందుఁ జెప్పఁబడినాడు. కావున నీ విఠ్ఠలునే రంగనాథునిగాఁ బేర్కొనియుందురా యని సందేహము కలుగుచున్నది.

3. కోనబుద్ధుఁ డాశ్వాసాంతములందుఁ దాను భాషాధీశ విభుఁడనియు, వినుత కావ్యాగమ విమల మానసుఁడనియు, పాలితాచారుఁడనియు, అపారధీశరధి యనియు నింకయు నేమేమొ, యాత్మస్తుతిని జేసికొనినాడు

"విద్వాంసులాత్మస్తుతిని జేసికొను వారు కారు." అని శ్రీ శేషాద్రి శర్మగారు సెలవిచ్చిరి. కాని వారే, కోలాచల మల్లినాథ సూరి, కాళిదాసు, నన్నయ భట్టు, అల్లసాని పెద్దన మున్నగు వారాత్మ స్తుతులఁ జెప్పుకొనినారని సూచించిరి. మహారాజుల నాశ్రయించి నిర్గర్వులై యుండిన బ్రాహ్మణోత్తములే తమ బిరుదుల కంచు ఢక్కలపై మ్రోయించినపుడు, "రాజ సర్వజ్ఞుండు రాజ సింహుండు" అయిన విఠలనాథుని పుత్రుఁడు, సర్వజ్ఞుఁడనఘుండు, చతురవర్తకుఁడు, సర్వ పురాణ విచార తత్పరుఁడని" విబుధులచే స్తుతిగన్నవాఁడు, బుద్ధభూపాలుఁడు, పరిపాలనా స్థానమందుండి యాత్మ స్తుతిని జేసికొనుట యందే చిత్రము కలదు?

4. నిశ్చయముగాఁ గోన బుద్ధుడే వ్రాసి యుండిన గ్రంథమందుఁ 'దన తండ్రి విఠల ధరణీశుఁబేర' యనుటకు మారుగాఁ "దమ తండ్రి" యని పరులు వ్రాసినట్లేల వ్రాసెను. అని నాలవయాక్షేపణ. సాధారణముగా నా తండ్రి యనుటకు మారుగా మా తండ్రి యని చెప్పికొనుట, పెద్దలయందు గౌరవాతిశయము, తనయణకువ, లోకాచారమునునై యున్నది. ఇంతియే కాక బుద్ధభూపాలుఁ డొకఁడే కాడు విఠ్ఠల సుతుఁడు. విఠ్ఠల నాథుఁడు "సుతులు" రాజులు, బహుశ్రుతులును గొల్వం" గొలువున దీపించెనని గ్రంథారంభముననే యున్నది. మఱియు, నాతతకృతిపేర, నతి పుణ్యపేర, ''మా తండ్రి విఠ్ఠలక్ష్మానాథు పేర'' శ్రీరామ చరిత మొప్పఁ జెప్పెదనని బుద్ధరాజు వ్రాసియున్నాడు.

5. రంగనాథుఁడు బుద్ధుని యాస్థాన కవి యైనందులకు భాస్కరుని కథ యొకటి ప్రబల నిదర్శనమని చెప్పుదురు. రంగనాథుఁడును, భాస్కరుఁడును వేర్వేర రామాయణముల వ్రాసి, యొకే తూరి రాజుగారి దగ్గఱకు వచ్చిన రంగనాథుని గ్రంథమును గుడిచేతను, భాస్కరుని రామాయణము నెడమచేతను గహించిన భాస్కరుఁడు కుపితుఁడై రాజుగారి గుఱ్ఱపు రౌతునకు, సాహిణిమారునికిఁ దన గ్రంథ మంకితముగా నిచ్చెనట. ఇట్టి కథ నిజమై యుండినఁగదా మనము నమ్మవలసినది. దీనిని నమ్మిచోఁ దెనాలిరామలింగని కథలన్నింటి నేల నమ్మరాదు? కృష్ణరాయల యాస్థామందష్టదిగ్గజముల రీతిఁ గవులుండిరను గాథలను గూడ నమ్మవచ్చును. కాని చరిత్ర యిట్టివి నబద్ధములని బోధించుచున్నది ''కథకు గాళ్ళు లేవు''

6. రంగనాథుఁడు రామాయణమును వ్రాసిన యనంతరము ఉత్తర రామాయణమును గూడ వ్రాసి బుద్ధరాజ కుమారులైన కాచవిభుడు, విఠ్ఠలుఁడు, రచించినట్లు ప్రకటించెనని కొందఱి దీర్ఘాలోచన. ఇవి యూహలలోని స్వప్నము. రంగనాథుఁడొక చౌర్యము చేసినదే కాక రెండవ దానికిఁ గూడ యంగీకరించెనా? మొదటి గ్రంథమందుఁదన విషయము బహిరంగముగాఁ గాక పోయిన యేదోఒక గూఢ విధమునైన, సూంతయైనను దెలుపుకొనని వాఁడైనను, నీరెండవ గ్రంథ మందైనఁదెలుపు కొనినాడా?

మొదటి గ్రంథము నొక్కని పేరనే రచించెనట. కాని రెండవదాని నిద్దఱి పేరట ప్రకటించిన నెక్కువ లాభమని చేసెనా? బుద్ధభూపాలుని కుమారులు

వంశపరంపరగాఁ బండితులై, రామాయణమును వ్రాయుటచే ప్రథమరామాయణ మును బుద్ధ రాజేయని విన్నవించిన సాహసమా?

ఆంధ్ర మండలి యిట్టి ప్రథమ రామాయణమునకు గర్తయై బలవంతముగా వచ్చి కూర్చునినట్టి రంగనాథుఁడెవరు? ఏ కులము?, ఏ దేశము? ఏ కాలము వాడు ఇంటి పేరేమి ? వంశమెయ్యది ? అతఁడింకేమైన ప్రబంధముల వ్రాసెనా ? ఈ ప్రశ్నలకు సమాధానమిచ్చు వారెవరు ? ఇతర కావ్యముల కర్తృత్వ మెవ్వరి కారోపంపబడినదో యట్టి కవుల స్థితిగతులు కొంచమైనను మనకుఁ దెలిసి యున్నవి. కాని యీ రంగనాథుని పేరు మాత్రమే చాటఁబడు చున్నది. స్వవిష యము నేమియు వ్రాసికొనక పోవుటచే నతఁడంతటి నిష్కామ కర్ముఁడా ? ధన లోభముచే సత్యము నడఁచువాడు కర్మఫల త్యాగియైయుండునా? చిత్రకవి సింగ రార్యునివలె నెదోయొక రీతి నితఁడు తన సంగతిని సూచించి యున్నాఁడాయని యతిసూక్ష్మముగా గ్రంథమంతటను వెదకితిని. ఎచ్చటను గనఁబడలేదు. శ్రీరామ చంద్రుఁడు యుద్ధమందు మూర్ఛ నొందినపుడు లక్ష్మణుఁడు విలపించుచు,

అర్థంబె విద్యయు, నర్థంబె నేర్పు;
పాయక మంగళ పాఠకానీక
గాయక కులములు గలవారిఁ బొగడు;
లేమియె సకల మాలిన్యంబు దలప;

అను వాక్యములందు రంగనాథుఁడు దన దారిద్ర్యమును నిందించుకొనె నాయని సంశయించితిని. కుంభకర్ణుఁడు, రావణునకు రాజనీతిఁ జెప్పుచు,

పతి దేశకాల విభాగంబు, లెఱిఁగి,
చతురంగ నద్రవ్య సంపద గలిగి;
కార్యంబు మీఁదగు కార్యమూహించి,
కార్య విఘ్న ప్రతీకారంబు సేసి,
ఫలసిద్ధి గైకొని బహు రాజ్యభోగ,
ముల నిత్యుడై యుర్వి మోదింపవలయు;

నను వాక్యముల రాజ్య భారము వహించు గోనబుద్ధుని యభిప్రాయమై యుండదా యనియు నూహించితిని. కాని యీ రెండుదాహరణములు అసమంజసములని నిశ్చయించితిని. పై యంశముల నన్నింటిని బట్టి చూడఁ గోన బుద్ధుఁడే దీనిని రచించి యుండనోపునని నాయల్ప విషయామతికిఁ దోచుచున్నది. అయిన నీ యంశములను బ్రజల పఱచుట కుత్తర రామాయణమందేమైన యాధారములు దొఱకునో చూడవలయును. విఠ్ఠలాదుల చరిత్రములను, మున్నగు విషయములను సహితము శోధింపవలయును. రంగనాథుడే దీనిని రచెంచెనని నిస్సందేహాధారములు మనకు లభించినచోఁ గోనబుద్ధుని ద్రోసి వేయ వలయును. రంగనాథుని గురించిన విశేషములేమియు లేని యీ పక్షమున గ్రంథకర్త గోనబుద్ధ భూపాలుడే యని చెప్ప నొప్పు.

# గౌరన హరిశ్చంద్ర

ఉత్తమ ద్విపద కావ్యములలో నిదియొకటి. మొదట గౌరన కవి దేశ కాలములను గుఱించి తెలుసుకొందము. గౌరన నిజాం రాష్ట్ర కవి, తన హరిశ్చంద్రలో స్వవిషయ మిట్లు వ్రాసికొనినాడు.

సింగన మాధన క్షితి పాలమణికి
మంగళ మూర్తికి మంత్రియై జగతిఁ
బొగడొందు పెద్దన పోతరాజునకు
దగిన తమ్ముడు యశోధనుడెల్లమంత్రి
చెట్ట బట్టంగ నోచిన భాగ్యవతికిఁ
జుట్టాల సురభికి సుందరీ మణికి
ఘనుడు వల్లభ మంత్రి గంగాంబ కోరి
కనిన పోచాంబకు గారాబుసుతుఁడ
భూతనాయక పాద పూజాభిరతుడ
గౌతమ గోత్రుండ గౌరనా హ్వయుడ.

## గ్రంథాంతమందు :

"మతి మంతుడయ్యలమంత్రి పుంగవుని
సుతుడు గౌరన మంత్రి సుకవి శేఖరుఁడు."

అని వ్రాసికొన్నాడు. వల్లభ మంత్రికే అయ్యల మంత్రి పర్యాయ పద మేమో! పై నుదహరించిన సింగయ ఆను రాజు రేచర్ల భూపాలుడు. అతని కుమారుడే మాధవ రాయలు. ఇతడు నల్లగొండ జిల్లాలోని రాచకొండను రాజధానిగా చేసికొని పాలించిన వెలమరాజు. అతడు క్రీ. శ. 1500 ప్రాంతములోని వాడు కావున మన గౌరనయు ఆ కాలమువాడే.

ఈ విషయమునకు అంతగా సంబంధించ కుండినను భైరవ కవి గురించి కూడ రెండు మాటలు వ్రాయుదును. ఈ భైరవుడు శ్రీరంగ మాహాత్మ్యమును రచించెను. ఇతడు గౌరన కుమారుడే. తన శ్రీరంగ మాహాత్మ్యములో నిట్లు వ్రాసికొనినాడు.

"కృత విద్యా ఖురళీ పరిశ్రమ కళా కేళీ విలాసున్ జన
స్తుత చారిత్రుని గౌత మాన్వయ పవిత్రున్ గౌరనా మాత్య స
త్సుతు గల్యాణ కవిత్వ లక్షణ స మర్థున్ సూక్తి ముక్తా ఫలా
తత కాంతి స్ఫుట చంద్రి కోల్ల సిత విద్వత్కై రవున్ భైరవున్"

గౌరన, ద్విపద హరిశ్చంద్రనే కాక నవనాథ చరిత్రమను ద్విపద కావ్యమును, సంస్కృతములో లక్షణ దీపిక యను గ్రంథమును రచించెను. నవనాథ చరిత్రము గత సంవత్సరమే ముద్రితమయ్యెను.

గౌరన కవి ఉభయ భాషలలో మంచి ప్రావీణ్యము కలవాడు.
"సరస సాహిత్య లక్షణ విచక్షణుడ"

అన ఆదిలోనే తెలుపుకొనినాడు. హరిశ్చంద్ర గ్రంథాంత మందును ఇట్లు వ్రాసి కొనినాడు.

"భ్రమరా ప్రసాద సంప్రాప్త కవిత్వ
సుమహీ త సామ్రాజ్య సుఖ పరాయణుడు
చతుర సాహిత్య లక్షణ చక్రవర్తి
ప్రతి వాది మదగజ పంచాన నుండు"

అనియు వర్ణించుకొనినాడు.

మధ్యకాల కవులలో ద్విపద కావ్యముపై కొంత అసహ్యము గలిగినట్లు కనబడుచున్నది. కాని నిజమైన తెనుగుదనము ద్విపదలలోనే ఇమిడి యున్నది. ద్విపదల నెన్నియో విధములుగా గానము జేయుదురు స్త్రీల పాటలు, తందాన కథలు, దశరా పద్యాలు, పల్లెటూరి పాటలు, కోలన్న పాటలు మున్నగునవన్నియు ద్విపద భేదములే. ద్విపద కావ్యాలలో పేరెన్నిక గన్నవారు తాళ్ళపాక చిన్నన్న

యును (తిరువేంగళనాథుడు) పాల్కురికి సోమనాథ కవియు, గోన బుద్ధుడును మన గౌరనయును నై యున్నారు.

ద్విపద గాన యుక్తముగా ఆయా రసములకు తగినట్లుగా రాగములను మార్చి పాడుకొనదగినట్టిది. అప్పుడే దాని రమ్యత వ్యక్తమగును. అట్లు గానము చేయజాలని వారికి కూడ ఈ గౌరన కవిత చదువుటకును వినుటకును మనోహరముగ నుండును. అనేక సందర్భములలో సంస్కృత దీర్ఘ సమాసములను అందముగా నిమిడ్చి యున్నాడు.

"మందార మంజరీ మంజుమరంద
నందదిందిందిర నందనా రామ
కమనీయ వికసిత కనకారవింద
కమలినీ తట లతాగార లతాంత
రచిత శయ్యాతల రతిరయ గళిత
కచభర మరపుర గణికా కపోల
కలిత ఘర్మోదక కణగణ మిళిత
మలయ సమీర కోమల కంపితాగ
మహిత చిత్రధ్వజమాలా సహస్ర
సహిత చింతామణీ సౌధ పాళికల"

ఇట్టి సమాసములు చాల గలవు.

కాని ఇది యొక విశేషము కాదు. తెనుగు నుడికారముపై ఈ కవికి మంచి ప్రావీణ్యము కలదు. సహజ వర్ణనలకే ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చినాడు. అపూర్వ వర్ణనలను గావించినాడు. ఆ వర్ణనలు ఆనందదాయకములు. అచ్చ తెనుగులో దిట్టమగు శక్తి చూపినాడు. ఇవియే యీతని కవితలోని విశిష్టతలు. ఈ యంశములనే నిరూపించు కొన్ని వర్ణనలు మాత్రమే యుదహరింతును.

## రాత్రి వర్ణనము

''భవచండ తాండవ భ్రమణ వేగమున
దివినుండి పడిన యందియయును బోలె
గిరణ జాలంబులు కెంపు సొంపెసగ
అరుణ బింబము పశ్చిమాంబుధి గ్రుంకె''

## వేటకాండ్రు

"చోఅమీసములు, జుంజుఱుగొప్ప బిరుసు
వాఱెడు మేనులు, బరడు బిక్కలును,
చేవవిండ్లును, నెఱ్ఱసెరల కన్నులును
జేవురు బొట్లును జిల్లకోలలును
మొలనీలి కాసెలు, మోటొత్తులును
దలముళ్ళు బదనిక దండకడెంబు
గలిగి భయంకర కాలకింకరుల
పొలువున గర్జిందు పొలవర్లు . . .

## కాలకౌశికుడు

"తోలు నస్తులు జిక్కి తూగాడు మేను
పేలు రాలెడు సిగ, పెడతల గణితి
పిల్లి కన్నులు, గురుపీచు మీసములు,
నుల్లి గడ్డంబు, నత్యుగ్ర దృష్టియును,
దళమైన పట్టె వర్ధనములు, వ్రేళ్ల
నులిచిన దర్భలు, నుదిటిపై బొరుసు,
నొఱగు నోరును, వెలికుఱికిన పండ్లు,
అఱువు ధోవతియును, పంచాంగంబు, ముష్టి
బరగిన కరతిత్తి, పత్రాల సంచి,
మొరగిన గొడుగును, నుసిరాలు కోల.

## వీరబాహుడు హరిశ్చంద్రుని దూరుట

"ధనరాశి యచ్చోట దరలక యిత్తు
ఒక విచారము మాకు నొదవె - ఈరాజు
సుకవాసి, పనిపంద, చూపు గుఱ్ఱంబు
మామిడి క్రింది సోమరి మేదకుండు
బూమె తుంటరి, యెనుపోతుపై వాన.

మొండరి, చల్ల చప్పుడు, గోడ చేర్పు
చండి పోతను నట్టి జూడ నున్నాడు
చెప్పిన పని జాగు చేసిన వేళ
ముప్పిరి గొను కోపమున మొఱవెట్ట.
దుడ్డున వీపు కంతులు కట్టి మోది
జడ్డు వాసిన, గొల్వు జాలు నా కనుచు
దక్కిపోయిన, వెంట దగుల నా వశమే
ఉక్కున బెనచినట్లున్నాడు వీడు
గొలుసు తప్పిన యట్టి కోతి చందమున
కల ధన మీవు రొక్కము కొని పోదు."

పైరెంటిలో హాస్యరసముకూడ వ్యక్తమగుచున్నది. ఈ కవి సామెతలను విరివిగా వాడినాడు. అందు కొన్నింటి నుదహరింతును.

"ఈ రత్న భూషా దులేటికి మాకు
నీరు పట్టారునే నెయి ద్రావి కొనిన''
''అందని ఫలముల కఱ్ఱులు సాపి''
నిప్పును చెదలంట నేర్చునే"
''పులిమెడ గొఱియ దెంపున గట్టినట్లు"
''తీపారుచక్కెర దిన్నయా నోర
వేపాకు మేసిన విధమున...."
''పల్లెత్తి యెలుకల బట్ట నోపినను
పిల్లి శాస్త్రమెమంటి పిల్లియే చాలు''

పూర్వ ప్రబంధములందు విశేషముగా రోకటి పాటగా వర్ణించబడిన అష్టాదశ వర్ణనల పద్ధతి యిందు లేనేలేదు. పచ్చి శృంగారము మచ్చునకైన కానరాదు. అపాదమస్తక వర్ణనలు, విరహతాపాలు చిలుకలతో మొదలు పెట్టి చంద్రలోక పర్యంతము కావించినట్టి ఉపాలంభనలు, శ్లేషలు, యమకాలు, నానార్థాలు. ఇట్టి ఘోరాలేమియు నీ కవిత్వములో లేవు. పాఠకులు రక్షింపబడినారు. పైగా ఏవర్ణనమును చదివినను అందు నవ్యత, శ్రావ్యత వ్యక్తమై పాఠకులకు ఆనందము కలుగుచుండును. ప్రాచీనాంధ్ర సారస్వతములో నా కత్యంత ప్రియమైన గ్రంథములలో నిదొక్కటి.

# చేమకూర వేంకటపతి సారంగధర చరిత్ర

చేమకూర వేంకట కవి కవితా ప్రాశస్త్యమును గురించి మన యాధునిక పండితరాయలిచ్చిన ఈ క్రింది యభిప్రాయము చాల సమంజసముగా నున్నది. ఈ చేమకూర వేంకటకవి చక్కెర మడిలో అమృతము పొలించి పెంచినదిగాని మట్టిలో నీరు పొలించి పెంచినది కాదు. ఇందు పూ మొగ్గలు వోలె తామే విడుశ్లేష లును, ద్రాక్షా పాకంబున నోరూర రస మొల్కు రచనలును. సదాచారాభి మానముంబురి కొల్పు ధర్మ్య నిబంధన నైపుణియు, విసిగింపని వర్ణనలును, బరువులు నెరువులుంగాని కబ్బంపు. దొడవులును, ఈ ప్రబంధమును భారతీ భాండాగారమందు కడునుచ్చ స్థానమందు నెలకొల్పుచున్నది.

మొట్టమొదట శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆంధ్ర ప్రబంధ ములోని తత్త్వములను వివర్శించిరి. ప్రతి ప్రబంధమందును నొక విధమగు కథా పద్ధతి యుండునని చూపించిరి. మన చేమకూర సారంగధరలో నట్టి పద్ధతి కానరాదు. ఇందలివియే వేరుగా నున్నది. కావున పద్ధతియే వేరు. ఇందలి కథానాయకుల పాత్ర పోషణమును గుఱించి చర్చించుటకు బూర్వము యొక యంశమును విశదపఱుప వలెను. క్రీ. శే. ధర్మవరము కృష్ణమాచార్యుల్ సారంగధరనే యాధారము చేసుకొని తమ నాటకమును రచించిరి. అందు చిత్రాంగి రాజరాజ నరేంద్రుని చిన్న భార్యగా నిరూపింపబడినది. కాని చేమకూర కవి యిట్లు చిత్రింపలేదు. చిత్రాంగి రాజనరేంద్రుని యుంపుడు క త్తియగానే యితడు వర్ణించి యున్నాడు. ప్రారంభముననే యిట్లు వర్ణించినాడు.

క. కలరా యిల రాయనికిం,
గుల సతి రత్నాంగి; భోగకుటిల శిరోజా,
తిలకము చిత్రాంగియు; నన
నెల జవ్వను లిరువురంబు జేందుని భాస్యల్.

ఈ "భోగ కుటిల శిరోజా తిలక" మను చిత్రాంగికిని "కులసతి"యను రత్నాంగికిని చాల భేదమున్నదని "అంబుజేందుని భాస్యల్" అను పదమునసనే సూచించి యున్నాడు. అంబుజమునకును, చంద్రుని కిని (ఇందు) సరిపడదని కవులెన్నడో నిర్ణయించి యుండిరి. సుబుద్ధి యను మంత్రి కుమారుడు సారంగధరునితో చిత్రాంగివలనిభయము సూచించుచు "వార కాంతల కెందైన వావి కలదె?" అని పలికెను. అంతయేల చిత్రాంగియే సారంగధరుడు తనను "తల్లీ" యని మాటి మాటికి సంబోధించుట నోర్వక.

శా. ఆ నీలాలక లేఁతనవ్వొలయ నిట్లన్
　　　　గ్రమ్మఱన్ నిన్ జగం
　　బౌనౌ మేలన నీవె తెల్పుకొన
　　　　నేలా నీ గుణంబుల్, సతీ
　　సూనుగ్రామణి వౌదు నీ హృదయ
　　　　మిచ్చోఁగంటి నే దేవతం
　　గానే నీ పిన తల్లిగాను,
　　　　విభు భోగ శ్రీసి భావింపగన్.

అని తెలుపుకొనినది. అంతటితో పోలేదు. వీరి వాదము.

　　సారం— "సంగడమున కెల్ల సొడ్డు" అనిన
　　చిత్రాం— "కాదటు, నేనల చిన్నవాడ నేర్పడితి" అని
పలికినది.

ఇక ప్రకృతమునకు గడంగెదను. సారంగధరుడు రత్నాంగి కుమారుడు. ఇతడు బహు తపః ఫలితముగా రాజనరేంద్రునికిఁ గలిగెను. బాల్యముననే శాస్త్రములందు, శస్త్రములందును మంచి పాండిత్యమును గడించెను. అంతియేకాదు, గుణములందు ప్రహ్లాదుని వంటివాడే!

క. మాడెత్తు మాట యెవ్వరి
　　నాడడు, సత్యంబు వీడనాడడు ఖలులం
　　గూడడు, పరకామినులం
　　జూడడు, సారంగధరుఁడు సుతమాత్రుండే;

ఈ సారంగధరుడు తిన్నగా యవ్వనుడయ్యెను తండ్రి యీతనికి "మంజువాణి" యను ఘూర్జర దేశపుఁ గన్యను దెచ్చి పెండ్లిచేసెను. ఈ వివాహమును గూర్చి, మంజువాణిం గూర్చి మూడే పద్యములున్నవి. ఈ పద్యము లీ గ్రంథమందు లేకుండిన మేలుగా నుండెడిది. ఏలన నీ మంజువాణి మఱల గ్రంథమందెచ్చటను గానుపింపదు. సారంగధరుడు కాళ్ళు చేతుల కోతచే గాయపడినప్పుడు గాని తదనంతరముగాని యీమె జాడయేలేదు. కవి పూర్తిగా నీమెను మఱచియే పోయెనో లేక చిత్రాంగిని కథా నాయికనుగా జేయనెంచి నందున నీమెను మూలకుఁ ద్రోసి వేసెనో! ఎటులైనను నీమెకథ నింతటితో వదలుదము.

రాజరాజు వేటకై దండకారణ్యమునకుఁ బోవునప్పుడు కాని, సారంగధరుని బాల్యమందుగాని యెచ్చటను తత్పూర్వము చిత్రాంగి ప్రస్తావనయేలేదు. సారంగధరుడు రాజు వేట కరిగిన యనంతరము ఉబుసుపోవక పావురాల పందెమునకై నగరు బయటకే తెంచి వినోదంబులందుండగా నతని పావురము చిత్రాంగి మేడపై వ్రాలెను. ఆ సందర్భముననే చిత్రాంగియొక్క ప్రథమ దర్శనము పాఠకులకును గలుగు చున్నది. వ్రాలిన పిట్టను జేతబట్టి చిత్రాంగి ......"ఇంక దీనిచే; గలుగు నిజంబుగా దనకుగాంక్షలు దీఱ సుఖంబు చెందఁగన్." అని చింతింపఁదొడఁగె.

చిత్రాంగి రాజుచే నెప్పుడు పరిగ్రహింపఁ బడెనో, యాయమ యెప్పటి నుండి సారంగధరునిపై మనసు గలిగియుండెనో యింతవరకు కవి తెలుపలేదు. కాని సారంగధరుడు పావురమునకై వచ్చినప్పుడతనితో చిత్రాంగి తన మనసులో రగులుచుండినట్టి ప్రేమను యిట్లు వెల్లడించెను.

ఉ. నీ సుగుణత్వమున్, జెలువు, నేర్పును,
 నెచ్చెలు లెల్ల జెప్పగా
వీనరవోని మోహమున నీ
 నుల విందుగ విందు నవ్వరే,
ఖానుమ కాంత! నేను పొడగంటిని!
 గన్నుల పండువయ్యె, నేఁ
జేసిన భాగ్యమెవ్వరును జేయర
 యారె! ఫలించెఁ గోరికల్.

అంతియకాదు! అనేకా గామిని హల్లకబాణుని "దర్శన మాత్ర చేతనే" తొల్లి మనంబులో గలుగు తుండుడు కెల్లను బాసె...."

క. "నను జూడరాడదేమో
యనినిను దూరుకొనుచుంద ననయము; నాపై,
నెనరు గలందుకు గుఱుతిదె
కనిపించెను; మనము వేడుకలు కనఁగల్గెన్."

అనియు సారంగ ధరునితోఁ జెప్పినది.

ఆంధ్ర ప్రబంధములందొకటి రెండు చోటులనే యిట్టి కథా సందర్భములు చిత్రింపఁబడినవి. మనుచరిత్ర మందు ప్రవరుని వరూధిని ప్రేమించి, ప్రార్థించి నను ఫలము గానక పోవుటయు సారంగధరలో చిత్రాంగి సారంగధరుని ప్రేమించి విఫలమనోరథ యగుటయు నీ రెండు స్థలములందే యిట్టి ఘట్టములుండి నట్లు తోచుచున్నది. అచ్చటికన్న నిచ్చట విశేషము. అచ్చట వరూధిని నిరాశ పరవశురాలై కృశించెను. ఇచ్చట చిత్రాంగి పగచాటెను. ఈయమ చమత్కార ముగా తన మనస్సును సారంగ ధరునికి ప్రకటింప జూచెను. కావుననే రవి శశిరశ్మికిన్ జొరగరాని భయానకమైన" తన మేడలో.

ఉ. ఏఁకడఁ జూచినన్ రతులకేఁ
కటి దీరఁగ వ్రాసినట్టి కొ
క్కోక కళా రహస్యములు
గోప్యములౌ చవుసీతి బంధముల్
నాకపురీ విలాస కలనా
గణికామణి కాము కాది నా
నాకృతులున్ విచిత్రగతు
లచ్చట నచ్చపలాక్షి చూపుచున్.

సారంగధరునికి తన మనంబు వెలిబుచ్చ నెంచెను. కాని సారంగధరుని మనసు ఏఱుగకపోయెను. చిత్రాంగి మఱొక విధ మాచరింప దొడఁగెను.

"ఓయి నెఱజాణ, తలకొన
జేయుము విరులిపె జవాది చెయిబట్టుము
వాలాయమెద జేర్పు కలపము
కో ... ... ... ... ... ... ..." యని పలికెను.

ఇందు సర్మోక్తిగా తనను, "తలకొన జేయుము, చెయి బట్టుము, యెద జేర్చుము." అనియు పలికెను. కాని సారంగధరుడు గ్రహించకపోయెను. చిత్రాంగి యింక తాళలేదు. సముఖంబున నేటికి రాయబార ముల్."

మ. అని యూహించుచు లజ్జబో
విడిచి యేకాంతంబుగా నల్దెస
ల్గనుచున్ బైట తొలంగ,నీ
వివదలన్, గామాంధ కారంబు నె
మ్మనమున్ గప్పిన, గన్నుగా
నకపుడా మత్తేభ గంభీర గా
మిని యత్యంత నిరంకుశో
ద్ధతిని బల్మిన్ బట్టగా జూచినన్.

ఇంత వఱకు వచ్చినప్పుడు సారంగధరుడు గడగడ వడకుచు "తల్లీ తడవాయెను వచ్చి; పోయెదను నేను" అనెను.

ఇప్పుడు చిత్రాంగి బలవంతమునకు తోడుగా బతిమాలుకొనజొచ్చెను. కాని సారంగధరుడు తనకుఁ దెలిసిన నీతులన్నియు బోధింపఁ దొడఁగెను. ఎవరి పాట వారికే! చిత్రాంగి కివన్నియు బోధపడవు.

ఉ. ఎన్నడు నేర్చినాడవుర!
యీ మటు మాయపు మాటలీవు; నా
కిన్ని దలంప నేమిటికి ?
నిప్పుడు దోసము పెద్దచేసి యా

దున్న వయాళి కాని గడు
      దొడ్డగఁ జెప్పి: భయంబుసూపి చ
క్కన్నను దుద్దువెట్టి, యిఱు
      కంగఁ దలంచెదు; మాను మీవగల్.

"మొనసి యూరకే రతిరంగమునకు రాని
సుద్దులివి యేల చాలింపు? సుగుణివౌదు!''

అని యనినది. అయితే సారంగధరునికి నీతులు నచ్చిన నీమెయు దనకు దగిన నీతులు నేర్చి నట్టిది. శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు, చంద్రుడు వీరందరు వ్యభిచారులు కారా? యని ప్రశ్నించి.

''వారి కంటెను హెచ్చైన వాడవౌర!
నీకు గల బుద్ధి వారికి లేకపోయె
నీవు నాటికి లేక పోయితివిగాక;
చేరివారల యోజలు చెఱుపలేవె?

అక్కడికిని సారంగధరుడు ఱాయి వలె కరగక పోయెను "ఆడుది యుసురుమన్న కొఱగాదు సుమీ" అని బెదిరింప మొదలిడెను. బుజ్జగింపులకు, ప్రార్థనలకు, బలవంతమునకు లొంగని వాడిప్పు డీ బెదరింపులకు వెఱచునా? సారంగధరుని వస్త్రము చేబట్టుకొని పెనుగులాడ, నతడు వస్త్రము నామె చేతనే వదలి వెడలి పోయెను.

"అంత చిత్రాంగి మదన బాణాగ్ని వేగి
హస్తగతమైన సొమ్ము పోనాడు కొన్న
కరణి బరి తాపమొందిఁ యే సరణి నైనఁ
జెఱుతు సారంగధరు నింక సిద్ధమనుచు"

రాజు రాకకై వేచి యుండును.

రాజు అరణ్యములో జిత్రాంఁగిని తలచికొని "అక్కట యేమి సేయుదు.... చక్కని ముద్దుగుమ్మ! నా చక్కెర బొమ్మ! జూడ కిటు సైపగఁజాల వియోగ

వేదనన్" అని విరహతాప మొందుచున్నాడు. "చక్కెర బొమ్మ !" ఇట్టి తియ్యటి మాటను ఆంధ్ర వాఙ్మయ మందెవ్వరును ప్రయోగింప లేదు ! ఇట్లు చిత్రాంగి లతాంగి దిదృక్షా సదృక్షాతి జాగరూక రూక్షాక్షుండై" విరహ వ్యథ నోర్వక వెంటనే యింటి కేతెంచి యామెను దుఃఖితగా నెఱిఁగి పరి పరి విధములఁ ప్రార్థించియుఁ బ్రత్యుత్తరము గానక యిట్లు వెఱ్ఱియై ప్రలాపించెను.

శా. ఏమే ! పల్కవు మోహనాంగి,
యిటు లేలే యల్క చిత్రాంగి ని
న్నే మంటిం గలకంఠి, నావలన
దప్పేమే యొయారీ, యయో
నా మీదన్ దయ లేదటే చెలి,
నను న్మన్నింపవే కోమలీ
నీ మాటల్ జవదాఁట కుందుఁ
గదనే నీరేజ పత్రేక్షణా.

ఇట్లు నమ్రుడైన పతిని మఱింతఁ బ్రేరేపించి తిన్నగా సారంగధరుఁడు బలిమిపై గవిసె నని చిత్రాంగి వర్ణించి, వర్ణించి రాజు తల కెక్కునట్లుగా నిక్కువముగా నగపడునట్లుగా నిరూపించెను. అంతియగాదు తటాలున రాజుచేత ఖడ్గము నొఱనుండి లాగి తన గొంతుకపైన బెట్టి యాత్మహత్య చేసుకొనఁ బోవు నట్లు నటించెను. రాజు మాటలు విని, సారంగధరుని పట్టు పుట్టము చూచి, చిత్రాంగియొక్క పరితాపమును జూచి భరింపలేకపోయెను. కొడుకు మీది ప్రేమ యంతయు మఱచెను. నేరము విచారించుటకు సభను బిలిపించెను. (నిరంకుశాధి కారులవలె కాక యీ కామాంధుడు యింతయైన చేయుట విశేషమే.)

అంత సభ్యులును నుభయ పక్షముల విచారించి సారంగధరుని నేరస్థునిగా నెంచి, విజ్ఞానేశ్వరమును జూచి కాళ్ళు సేతులు కోయుటయే దీనికిఁ దగిన శిక్ష యని విధించిరి. (రాజనరేంద్రుని కాలములో విజ్ఞానేశ్వరమే ముఖ్యమగు న్యాయ గ్రంథముగా నుండెనేమో) రత్నాంగి యీ సంగతి విని చాల శోకించెను. చిత్రాంగితోఁ గొంత వాదులాడెను. రాజు కఠినుడై యే మాత్రమును క్షమింపడు. రత్నాంగి తన కొడుకు నుండి యథార్థము తెలిసికొని కుమారుడు నిర్దోషుడైనను

నిట్టి యాపదలకు లోనయ్యెనని పరితాపము పొందెను. సారంగధరుడన్యాయముగా శిక్షితుఁడైనను కించిత్తు కూడ రాజునుగాని, చిత్రాంగిని గానీ దూరడు. మీదు మిక్కిలి తల్లితో నిట్లు విన్నవించు కొనెను.

చ. అడలకు వమ్మ నీవు, కలనైనను
రాజును దూరకమ్మ యే
యెడల సపత్నితో జెలిమి
యించుక తప్పకు మమ్మనాదు సం
గడిఁ జరియించు నాదు చెలి
కాంద్రను నావలె జూడవమ్మ యిం
పడరగ నన్నిక న్మఱవవమ్మ
విచారము మాని మానినీ.

సారంగధరుఁడు తాను కాళ్ళు సేతులు గోలుపోయి యత్యంతము బాధపడి విలపించు నపుడైనను చిత్రాంగినిగాని, తండ్రినిగాని యొకతూరి యైనను దూరడు.

చిత్రాంగి యిట్లు కాదు. ఆయమ్మ శీలమును సచివులు సంశయించి యదార్థము దెలుపుమని యడుగ.

"తొయ్యలి యూఁచక యూఁచక
పయ్యెద గొంగును బటాన బయలుగఁ జేసెన్"

తుదకాకాశవాణి యడవిలో బల్కిన పల్కులను తలారులు రాజుతో విన్న వింప, రాజామెను నిజము చెప్పుమని బెదరించి యడగ, నించుకయైననుఁ జలియించక యా గట్టువాయి యిట్లని పలికె.

చ. తెలిసితి హా ! యిదంతయును
దేవర పట్టపు దేవికైతవం
బలసుతు పాడిఁ దప్పినను
నాజ్ఞ యొనర్పగ లంచమిచ్చివే

పిలిచి తలార్లచేత నని
పించిన దిట్టుల నీకు వాళ్ళ ము
ల్దెలియక వెఱ్ఱి రాజ ! యిది
లెస్స నిజంబని నమ్మినాడవే !

చిత్రాంగి తుదకు నిందితయై గోతిలో త్రోయబడియె. సారంగధరుడొక సిద్ధుని యౌషధ క్రియచే "గుణము" పొంది సర్వసంగ పరిత్యాగియైన సన్యాసి యయ్యెను.

ఇది చిత్రాంగీ సారంగధరుల మానసిక తత్త్వ భేదము. మొదటినుండియు నొకరిది కేవల యాది భౌతిక బుద్ధిగను, మఱియొకరిది యాధ్యాత్మికముగను నిరూపింపబడినది. వీరి కథ చరిత్ర యందెచ్చటను లేదని స్పష్టముగా జెప్ప వచ్చును. అట్టి తఱి యిది కేవలము చేమకూరవాని కల్పన తప్ప యింకొక్కరిది కాదు. ఇతఁడే యీ కథను మొదట వ్రాసినవాడు. ఎలకూచి బాల సరస్వతియు అప్పకవియు తర్వాత విన్నారు. మఱియు కూచిమంచి తిమ్మకవి పూర్తిగా మన చేమకూర వేంకట కవిని దన ద్విపద కావ్యములో ననుకరించియున్నాడు. బాణాల శంభుదాసు కూడ తర్వాతివాడు. తన ద్విపద సారంగధరలో.

"భువిలోన సారంగ భూవరు చరిత
కవితా మహత్త్వంబుగల చేమకూర
అప్పన్న చెప్పిన యా ప్రకారమున
జెప్పితి బాణాల శంభుదాసుడను."

జెప్పి వ్రాక్రుచ్చినాడు. చేమకూర వేంకటపతిని చేమకూర వేంకటప్ప యని కూడ పిలుచుచుండినట్లే చేమకూర అప్పన్న అను పదము నుండి వెల్లడి యగును. ఆధునిక కాలములో శ్రీ. శే. ధర్మవరము కృష్ణమాచార్యులీ కథను విషాదాంతముతో ముగించుట తప్ప తక్కిన యంశములలో - శైలిలోగూడ - నీ చేమకూర కవినే యనుకరించెను.

"ఈ వేంకటకవి శూద్రుఁడనియు తంజావూరి రఘునాథ నృపుని సభలో క్రీ. శ. 1630 సం. ల యప్పుడు విలసిల్లు చుండెననియు చరిత్ర శోధనల వలన

నెఱుక పడుచున్నది.'' అని వేంకటరాయశాస్త్రిగారు వ్రాసిరి. ఏ చరిత్ర శోధన వలన నీతడు శూద్రుఁడని వెల్లడియయ్యెనో తెలుపలేదు. వేంకట కవి యాశ్వాసాంతమందు తనను "లక్ష్మణా మాత్య తనూభవ" యని సంబోధించుకొనినాడు. ఆమాత్య శబ్దముచే నీతడు నియోగిగా నుండనోపు అని అనుమానము.

ఈ కవి యాంధ్ర వాఙ్మయ క్షీణకాలములో నుండినవాడు. పౌరాణికుల కాలము దాటి యుండెను. తర్జుమాలు తక్కువయ్యెను. మహాసామ్రాజ్యము అంత రించి యుండెను మహమ్మదీయ పరిపాలనము సంపూర్ణ వికాసమందుండెను. చిన్న చిన్న రాజులు విశేషముగా భోగైకలాలసులై యుండిరి. ప్రబంధములే విశేషముగా రచింపబడుచుండెను అవియు శృంగార ప్రధానముగా నుండెను. వాని శైలి విశేషముగా శబ్దాలంకారములతో నుండెను. భావ విలసనము తక్కువ. శబ్దాడంబర మెక్కువ. అట్టి కాలమందు జీవించిన మన కవియు నాకాలపు సాంప్రదాయమువలలో గొంతవఱకు జిక్కియుండెను. శృంగారమును నితరులతోఁ బాటిగా నిందు ప్రధానముగా నుంచుకొని వ్రాసెను.

కాని వారివలె పిచ్చిగా వ్రాయలేదు." విజయ విలాస" మందు కొంచెము కళ్లెమును జాఱవిడిచెను. గాని, "సారంగ ధర"లో మాత్రము నిగ్రహించి యుండెను. ఇందు పుర వర్ణనయే లేదు. రాజ నరేంద్రుడాంధ్రుడేనో కాదో? ఇతడు 'మాళవపతి' అడవిలో చిత్రాంగిని దలఁచుకొని.

అక్కట నేమి సేయుదు ర
యంబున నిప్పుడె బోదు నంటినా
మిక్కిలి దూర దేశము, స
మీ పమే? మాళవభూమి మండలం
బెక్కడ? దండకావనమి
దెక్కడ"

అని విలపించినాడు.

కావున నితని ముఖ్య పట్టణము రాజమహేంద్రవరము అని నిశ్చయింప లేము. కావున నీ కథ కేవలం కల్పితమగునేమో. సారంగధరలో నితర కవుల రీతి సంభోగ వర్ణన శ్రవణము నుండి పాఠకులను రక్షించినాఁడు. ఇందు నాయికా వర్ణన మితర కవులు చేసినట్లు తల మొదలుగ పద నఖ పర్యంతముగా

వర్ణింపబడలేదు. చిత్రాంగి యొక్క వర్ణన రాజరాజు ప్రార్థించినప్పుడు, చిత్రాంగి సారంగధరుఁడు దన కిట్లిట్లు వర్ణించి గవిసెనని చెప్పునప్పుడును సందర్భాను సారముగ గనుపించును గాని నా వర్ణనను బట్టి యీమె యిట్టిదై యుండి యుండు నని భావింప శక్యము కాదు. అటుగాక సారంగధరుఁడు చక్కగా చిత్రింప బడి యున్నాడు. ఇతడు మోహనా కౌలుడు, చక్కని ముక్కుగలవాడు, నగుమోము కలవాడు ఎగుభుజాలవాడు ఇంతియగాదు.

ఉ. తీరుగ మల్చివేసిన గతిన్ తొడ
లున్నవి; బొమ్మలోని వి
స్తారము చెప్పరాదు బలుద
ల్పు, నదల్పును బాలుగాలు నౌ
రౌర, మొగమ్ము చక్కదన మ
న్ని యటుండనిమ్ము వీని యొ
య్యారమె లక్షసేయు నహహా
యనుచున్ దలయూచు సారెకున్,

ఇది చిత్రాంగి దోచిన రూపము

ఇక రత్నాంగికి వర్ణన బొత్తిగా తేనేలేదు. సారంగధరుని భార్య నాకే పద్యమున వర్ణించి కవియామెను బ్రక్కకుఁ ద్రోసి పుచ్చెను. ఇక రాజనరేంద్రు డెట్టి వాడో, వృద్ధుడో, కాడో, యేజాడయుఁ దెలియదు.

ఇక మన కవి శైలి యెట్టిదో కనుఁగొందము. ఇతని శైలి మృదు మధురమై పటుత్వముతో గూడినట్టిది. పద్యములు నడక ధారాళముగా జదువుట కింపుగా నున్నది. కవియే దేశమువాడో మనకుఁదెలియదు. తంజాపూరి వాఁడనుటకు వీలు లేదు. ఒక్కొక మండలమున నొక విధమగు భాషయుండును. కవి యెట్టి వాడై నను దన మండలములోని పదములఁదప్పక ప్రయోగించుట ప్రతి వానికి సహజము. ఈ కవి వాడిన కొన్ని పదములు గమనింపఁదగినవి. తట కాపడి తట్టుకపడి - (గ్రామ్యము) కస్తి (కష్టము) యెదవడు (భయపడు) జుఙుగు (నుసులు) కమతీలు (కమతగాండ్రు, జీతగాండ్రు;) కువాళము (కువ్వాదము గ్రామ్యము); బెదరించు (భయపెట్టు) : ఎలుగుగొడ్లు (ఎలుగుబంట్లు) మున్నగు

నీ పదములు విశేషముగా కర్నూలు, కడప మండలములలో నేటికిని సామాన్యంగా వాడుకలోనున్నవి. గావున నీ కవియు నీ మండలములవాడై జీవనార్థము తంజాపూరు రాజు నాశ్రయించి యుండి యుండునని యూహించు చున్నాను.

ఇక్కవి భావములు చాల సుందరమైనవి. సారంగధరలో గొన్ని యుపమానము లెవ్వరును బ్రయోగింపనట్టివై యున్నవి. రెండుదహరించెద.

"ఉమ్మెత్త పూవంటి యొఱపైన కుచ్చెళ్ల
చెఱగు మట్టెల మీద చిందుదొక్క''

"మంగలంబునం బెటిలిన పేలగింజవలె మిక్కిలి పుత్ర
వియోగ బాధ నట్టిటుపడి.''

పావురము నాకసమున నెగురవైచి యది వియత్తల మందు విహరించుట నిట్లు వర్ణించి యున్నాడు.

సౌధ కేతన పటాంచల వాతదూత ని
ర్గత గాంగ డిండీర ఖండమనగ
సితమౌని పూర్వావసిత ధూపునద్ది దృ
ఢాగ తేంద్రాగ లతాంత మనగ
నవహార సంఘట్ట నగ్రస్త పతయాళు
గగన లక్ష్మీమౌక్తికం బనంగ
మధ్యంది నానంత మణిలూన మందేహ
సంత్యక్త బిరుదైక శంఖమనఁగ

గీ. పంకరుహ సంభవ కళత్ర పత్త్రి పుత్త్రి
సురకుల ధురీణ కంఖాణ కరి కృపాణ
రమ్య ధావళ్య జైత్ర పారావతంబు
రాఁ దొడఁగెఁ జుక్క దెగిపడ్డ క్రమముదోప.

ఇది యీ కవి వతంసుని సంస్కృత భాషా ప్రవీణతయు జాటు చున్నది.

ఇక్కవికి శ్లేషలు యమకాలంకారములు, అను ప్రాసలు చాల యిష్ట ముండినట్లు తోచుచున్నది. రమ్యముగా వర్ణించుచు వర్ణించుచు నేదైన నొక పదము నాధారము చేసికొని దాని ధ్వనియందే మగ్నుడై తప్పుడు దారిని బోదొడగును. శబ్దాలంకారము లితని కిష్టమని చూపుట కొక్క యుదాహణ మిచ్చెదను.

అ. ఔర! వీని మోహనాకార రేఖ వే
మాఱు మారు హరికుమారు మారు
వెలిదమ్మితొగల వీని కందోయి తీరు
రేపు మాపు బాపు రేపు మాపు.

ఈ గ్రంథ మందు ముఖ్యముగా జూడదగిన వర్ణనలివి. రాజనరేంద్రుని సంతానచింత, సారంగ ధరుని బాల్యము, పావురములాట, చిత్రాంగీ రత్నాంగి సంవాదము మున్నగునవి.

ఈ చరిత్రమునకు నాయికా నాయకులగు చిత్రాంగీ సారంగధరుల గుణ శీలముల పోషణౌచిత్యము కొనియాడ దగినట్టిది. ముఖ్యముగా సాత్విక శక్తిచే, పవిత్ర జీవితముచే, సత్యనిష్ఠచే నెల్లర మనంబులు రంజిల్లునట్లుగా సారంగధర పాత్రమును సృష్టించిన చేమకూర వేంకటకవి యొక్క కవిత్వ మహత్త్వము వే విధముల శ్లాఘ్యమైనది.

# అనర్ఘరాఘవము

శ్రీ శేషాద్రి రమణ కవులు అనర్ఘ రాఘవమను తెనుగు ప్రబంధమును అష్టభాష గోపాలరాయల మేనల్లుడును ప్రాగటూరు దొరయు, సుమారు 200 ఏండ్ల నాడుండిన వాడునునగు తిమ్మారెడ్డి యను తిమ్మ భూపాలుడు ఆంధ్రీకరించిన పద్య కావ్యమని వ్రాసినారు. మరియు నా గ్రంథమిటీవల కర్నూలులో నచ్చైనదని యొక మిత్రుడు నాకా ప్రతి జూపించెను. ఆ గ్రంథమందు గ్రంథ ముఖ పత్రమే ముద్రించలేదు, ఇది సహేతుకమో యేమోకాని ప్రత్యాశ్వాసాంత మందు తిమ్మభూపాల ప్రణీతమని పెద్ద గద్యమును బ్రకటించినారు.

అట్టిచో నీ కవి నిజముగా నీ గ్రంథము రచించెనా? లేక వేరొక భాగస్వామి కలడా ఆ భాగస్వామియే దీనిని పూర్తిగా రచించెనా? లేక యిద్దరును కలిసి రచించిరా? యను ప్రశ్నలు నాలో బయలుదేరెను. పాపమా భాగస్వామి యెంత నిష్కామ కర్మియేమో! తిమ్మారెడ్డి ఈ యనర్ఘ రాఘవమందేమి సాక్ష్యము స్వయముగా నిచ్చుచున్నాడో చూడుడు.

మ. కమనీయ స్థితి జెంగటన్ ధవళ శంఖస్ఫూర్తి రాణింప దీ
ప్తమరీచిన్ బవడంపు గెంపు బవలున్ బంజుల్ వెలుంగొందని
స్సమ సారస్వత నిర్మలామృత ఝరీ జాగ్రత్త రంగాబ్ది పే
ర మహా సత్కవి తేజరిల్లె విబుధ ప్రస్తూయమానోద్ధతిన్.

(యీ పద్యములో "జాగ్రత్త రంగాబ్ధి" అనుటకు జాగ్రత్త రంగాబ్ధి అని సరిపోవునని ముందు చూపెదను)

చ. అతనికి బౌత్రుడై యసదృశాఖల విద్యల బ్రౌఢిగన్న యా
యతమతి కృష్ణ సత్కవి సహాయ కవిత్వమునన్ సమాజసం
తత భజనాదరుండనగు నాకున శేష విశేష వైదుషీ
ప్రతిభకర స్థలామలక భాస్వరమై తనరారుటబ్రమే.

ఈ పద్యమును జదివిన బోధ్యమగునదేమన - పేరయ్య అను గొప్ప పండితుడుండెనట. అతని మనుమడు కృష్ణ కవి అనేవారు. వీరి సహాయముండిన తరువాత ''నేను కవిత్వము వ్రాసేదొక విచిత్రమా'' అని తిమ్మారెడ్డి చెప్పుకొనినాడు.

ఇప్పుడింత వరకు తెలిసిన సారాంశమున కృష్ణకవియను నతడు ఈ కవిత్వములో భాగస్వామియనియు, యతనిదే పైచేయిగా నుండినట్లెన్ను తిమ్మారెడ్డి అక్కడక్కడ కామాలు, వత్తులు, గుణ్కు, కొమ్ములు, సవరించి యుండవచ్చును అని విశదమగుచున్నది.

కాని యిదికూడ నిజముకాదేమో నామిత్రుని యొక్కనివద్ద తాళపత్రములో నిట్లుండుట జూచి వ్రాసికొంటిని.

మ. "అవనిన్ రంగసముద్ర కృష్ణకవి చంద్రాపాదితానర్ఘరా
ఘన కావ్యంబనురక్తి తోడుతను శ్రీ కానాల కృష్ణ ప్రధా
ననరాగ్రేసరుచేత వ్రాయబడి యెన్నన్ సత్కవిశ్రేణికిన్
జవమైవన్నియ కెక్కు నిద్ధరణి నాచంద్రార్క సంస్థాయియై"

గద్య "ఉప్పల లక్ష్మీనృసింహాచార్యులవారి కుమారుడు రామానుజాచార్యులవారు బిజ్జల చిన్నమ్మ దేశాయిగారికి అనర్ఘరాఘవము వ్రాసిన పుస్తకము"

అని గ్రంథాంతమందు తాటాకుపై గంటముతోనే వ్రాసిన భాగము కలదు. ఈ పద్యగద్యము లవలన తేలునదియేమన అనర్ఘరాఘవమును రంగసముద్రము కృష్ణకవియే వ్రాసినాడని అట్టి గ్రంథమును కానాల కృష్ణప్ప తాటాకులపై వేరు ప్రతి వ్రాసి యిచ్చెనని పద్యములవలన తెలియును.

గద్యమువలన తెలియున దేమగా ఆ తర్వాత తిమ్మారెడ్డి మనుమరాలో యేమో బిజ్జుల చిన్నమ్మ దేశాయికి ఉప్పలరామానుజాచార్యులు పూర్వప్రతి శిథిలంబైనందున నేమో వేరుప్రతి వ్రాసి యిచ్చినాడు. నకల్నవీసులకు అఖ్కల్ లేనట్లు యీ రెండవవారు గ్రంథాంతమందలి కానాల కృష్ణప్ప వ్రాసిన యగత్యపు బద్యమునుగూడ నకలుచేసినాడు. తర్వాత తిమ్మారెడ్డి వంశములో కవులు

లేనందున (తిమ్మారెడ్డికవియైతేగద యుండునది) వారును నీ తాళపత్త్రప్రతిని నంద రికి చూపుకొనినట్లున్నది. దాని కారణమిప్పుడే తెల్పుదును.

మొదలు "జాగ్రత్కవిరంగాబ్ధి'' యని యుండవలె నంటినికదా. ఎందుకన కానాలవారి పద్యములో రంగసముద్రము కృషకవియని పేర్కొనబడినది. కావున ''రంగాబ్ధి'' కప్పుడన్వయము సరిపోవును. లేకుండిన తరంగాబ్ధి అనిన నిరర్థక మగును.

ఇంతవరకు నిశ్చయమగునదేమన రంగసముద్రము కృష్ణకవి యను వారే యా గ్రంథమును పూర్తిగా వ్రాసెననియు తిమ్మారెడ్డి బహుశా అతని పోషకపు దొరయైయుండెననియు, తర్వాత మందః కవియశఃప్రార్థీ అన్నట్లు తిమ్మారెడ్డియపర పండిత పెద్ద కృష్ణప్పవలె కృష్ణకవిని లోబరుచుకొని, తన పేరెక్కించు కొనెననియు, అక్కడికి కవి తన శ్రమ వ్యర్థమగునేయని ఆశ్వా సాదిలోనొక పద్యము సగముసగమర్థ మిచ్చునది, అపరచిత్రకవి సింగనార్యుని వలె వ్రాసెననియు కానాలవారు ఇంచుమించు సమకాలికులో లేక తర్వాత తరము వారో యగుటచే తన పెద్దలవలన నిజమెరిగినందునను తానున్ను కాస్తాకూస్తా కవి యగుటచేత తాను నకలుచేసిన తరువాత తాళ్ళపాకవారి కవిత్వము కొంత నా పైత్యం కొంత అన్నట్లు తన పద్యమొకటి మెల్లగా నిరికించి కవికుపకారము చేసె ననియు నూహింప వీలుకలదు.

ఇంతేకాదు. ఈ తాళపత్త్ర సంపుటి 20-30 ఏండ్లనాడు పెద్ద పెద్ద పండితుల చేతులలో బడిబడి తుదకు అపర దుర్వాసులను ఖ్యాతిగాంచిన ఆలంపూరీ శ్రీ ప్రౌఢ సరస్వతీ కుమార స్వాములవారి చేత బడినది. ఆయతులును నీ గ్రంథ మును జూచి హేతుగర్భితమగు నీ పద్యముల తాళపత్త్రముల తుది స్వహస్తముతో మసితో వ్రాసినవి నా మిత్రుడు చూపగా వ్రాసికొని నీ పద్యములివిగో జూడుడు.

శా. ఈ గ్రంథంబు ప్రశస్తమైనది యటంచే నెంచి చూడం గనెం!
తే గ్రాహ్యేతర దుష్ప్రయోగములు సంధి ప్రక్రియాదోషణ!
వ్యగ్రాలేఖక సంగతంబులిట నాహో పెక్కులై తోచెధీ!
ప్రాగ్ర్యుల్ దిద్దగ లారటంచు శ్రమియింప న్మానితిన్ నే సుడీ.

ఉ. ఏమి వచింతు నక్కట ధనేచ్ఛను దుచ్ఛనృశంస సన్నిభో
ద్దామవదాన్య మాన్యుల వృథానుతి సేయుచు నిట్లు సత్కవి
గ్రామణులేచెలంగిరిలఁ గ్రచ్ఛరకేవల రామునిన్ మదిం
గ్రామిత చిత్తవృత్తి పొసగన్ భజియించిన మోక్షమబ్బదే.

— శ్రీ. కు.
శుభ కృత్కార్తిక కృ 5 లు
అని శ్రీ శాస్త్రులవారి వ్రాలు కలదు.

దీనివలన శ్రీ కుమారశాస్త్రిగారును గ్రంథ కర్తృత్వమును సంశయించి రెండవ పద్యములో ధనేచ్ఛచేకవి యిట్టి తుచ్ఛ కార్యము చేసేనే కేవల రామభజన గావించిన మోక్షమబ్బ యుండునుగదా అని సూచించినారు.

ఇన్ని ప్రమాణములు మనకు దొరుకుచుండ పాపమూ రంగసముద్ర కృష్ణ కవి పేరును మాపి తిమ్మారెడ్డిని పొగడుట పొసగ నేరదు. ఇంకా ఈ కృష్ణకవి యెవరను విషయము నాకు తెలియదు. పరిశోధకులు తెలిపిన తెలుపుదురు కాక.

# వేదము వేంకటరాయ శాస్త్రిగారు

వేదము వేంకటరాయ శాస్త్రిగారు దివంగతులైరను వార్త విని చాలా ఖేద మొందని యాంధ్రుఁడుండఁడు. శ్రీ శాస్త్రిగారి కీర్తి యక్షరాస్యులగు సకలాంధ్రు లందఱిలో వ్యాపించి నందున గించిజ్ఞుఁడను గూడ కాని నేను వారిని గురించి వ్రాయుట హాస్యాస్పదమేఐనను వారి పరిచయము నాకుఁ గొంత యుండి నందున వారి పాండిత్యమును నే నెల్లప్పుడు స్తుతించు స్వభావము కలవాఁడనై నందున వారి యందు నా కపారమగు భక్తి యుండినందున వారి విషయమై రెండు మాటలు వ్రాయ సహసించి నందులకు పాఠకులు మన్నింతురు గాక !

శాస్త్రులవారికి "పండితరాయ" యను బిరుదము చాల సార్థకమని నా మతము. ఏలన వీరిని బోలు పండితులు వింధ్యకు దక్షిణమున లేరనియే నేను విశ్వసించు వాఁడను. వీరి వైదుష్యము వీరు వ్రాసిన సంస్కృతాంధ్ర గ్రంథ ముల వ్యాఖ్యానములే చాటుచున్నవి. శృంగార నైషధ గ్రంథ వ్యాఖ్యానమందుఁ బలు తావుల తమ గురువులగు సీతారామాచార్యులనే తప్పు బట్టి వారిచే రచితమగు "శబ్ద రత్నాకరము" లోని యర్థము లనేకములు దప్పు అని నిరూపించిరి. మఱియు నాముక్త మాల్యదలోని పద్యము లనేకములు పూర్వ వ్యాఖ్యాతలను సరిగా మనసునకు రాక తప్పని నిర్ణయించియుండ శాస్త్రులవారు తమ వ్యాఖ్యాన మందలి సరియని నిరూపించి, సవరించి చూపించిన పాండితీ మహిమ కడుంగడు శ్లాఘ్యాపాత్రము.

వీరు కేవల వ్యాఖ్యాన కర్తలే గాక విమర్శక శిఖామణులునునై యుండిరి. సుమారు 15 సంవత్సరముల క్రిందట గ్రామ్యవాదము బయలు దేరెను. ఆ వాద మునకు కొక్కొండ వెంకటరత్నము పండితులు వంటివారు సీస పద్యమునకు వెండి బంగారు పద్యములను విశ్వామిత్ర సృష్టి నొకదానిని కల్పించి సహాయపడిరి. ఆ సందర్భమున శాస్త్రులవారు గ్రామ్యాదేశ నిరసనమను నొక లఘు పుస్తక మును వ్రాసి తీవ్రముగా ఖండించిరి. మఱియు వేంకటరత్నము పంతులు

సామాన్యులుకారు మహామహోపాధ్యాయ బిరుదాంకితులు. అప్పటికి మన శాస్త్రిల వారికే బిరుదమును లేదు. మహోపాధ్యాయులగు వెంకటరత్నము పంతులు గారు వ్రాసిన ఆంధ్రీకృత "ప్రసన్నరాఘవ నాటకముపై శాస్త్రిలవారొక వివర్శనము వ్రాసిరి. నాటకముకన్న రెండంతలు హెచ్చుగా వివర్శన యున్నది. ఆ గ్రంథ మందు పంతులు గారి గ్రంథమును ఖండ ఖండములుగా చించి చెండాడి భీభత్స ముగా విమర్శించి పంతుల వారికి తలవంపులగునట్లును, పాండిత్యము సంపాదించు కొనువారికి మార్గదర్శిగా నుండునట్లును నా విమర్శనమును ప్రకటించిరి. కాని యీ గ్రంథము పునర్ముద్రణముగాక ఖపలకాల మయ్యెను.

శాస్త్రిల వారుపన్యాసములలో మంచి ధోరణి కలవారు. వీరి యుపన్యాసమే యన నేల, వీరి సంభాషణ మెల్లకాలములందును హాస్య రసపూరితమై యుండెడిది. వీరుపన్యసించునప్పుడు సభ్యులను దన హాస్య కథనముచే నవ్వింతురు. కాని తాము మాత్రము నవ్వుట లేదు. ఆంగ్ల పండితులు హాస్యమెన్నియో విధముల నుండునని నిరూపించుచు నీ విధమగు హాస్యము చాల ప్రశంసనీయమైనదని వ్రాసి యున్నారు. స్విఫ్ట్ ఆడిసన్ మున్నగు పండితులిట్టి హాస్యమునే చిప్పిలఁ జేయుచుండెడివారట !

శాస్త్రిలవారాధునికులగు కవులన నేల మెచ్చకుండెడివారు. వారు స్వభా వముచే మొగమాటము లేనివారు. అనేకులు వారి దగ్గఱకు వచ్చి తమ నూతన కల్పనా విశేషములతోఁ గూడిన గ్రంథములకుఁ దొలి పలుకుల వ్రాయుమని ప్రార్థించెడివారట. కాని శాస్త్రిలవారు వారి గ్రంథములను మెచ్చక వారి యెదుటనే తీవ్రముగా విమర్శింప వారు శాస్త్రిలవారి పునర్దర్శనమునకుఁ బోవు వారు కారట. నిరంతరము రాత్రింబవళ్ళును మృతించు వఱకు కృషి చేసి విద్యార్థివలెఁ జదువుచు సంస్కృతాంధ్ర గ్రంథముల నించుమించు నన్నింటిని జదువుటయే యనేకులకుఁ దొఱకని గ్రంథములను గూడ శోధించి సంస్కృ తాంధ్ర భాషలందు నిరుపమాన పాండిత్యమును గడించిన శాస్త్రిలవారి కితర పండితులు మెచ్చఁదగినవారు గాకుండుటలో నాశ్చర్యమేమి? శాస్త్రిలవారి యీ యభిప్రాయము కేవల సంభాషణ యందేకాక వీరి గ్రంథములందు ప్రకటితమై యున్నది.

శృంగార నైషధ వ్యాఖ్యానమును వ్రాసినప్పుడు దాని నిట్లు సెలవిచ్చి యున్నారు.

ఉ. వ్రాసితి మున్ ప్రతాప కథ
పండిత మానుల గుండె నీరుగా
వ్రాసితి వెన్క నయ్యుష వివాహము
సిద్ధ సుధా ప్రవాహమున్
వేసర కిప్డు నైషధము విప్పి నిఖల్
నెఱ చూఱ లిచ్చితిన్
జేసెద నింక తత్పరత సేవను చూడి
కుడుత్త దేవికిన్.

వీరు వ్రాసిన ప్రతాప రుద్రీయ నాటకమందు మూడు స్థలములందు వీరు తమ గొప్పతనమును జాటుకొని యున్నారు. నాటక ప్రస్తావనలో నిట్లు వ్రాసికొనిరి.

ఉ. అంకెకు దార్చె నే రసికు
నంగల భారతి ప్రౌఢనీతి నా
కింకరి నాంధ్ర ద్రావిడియుఁ
గేరుచు దైవియుఁ గూడి రెవ్వరిన్
జంకు కళంకు లేని కవి చంద్రుడు
తోషిత కోధ రేంద్రుఁడా
వేంకటరాయశాస్త్రి కృతివెంగలి
మూక కెఱుఁగ శక్యమే.

శాస్త్రిలవారి రచనలన్నింటిలోఁ గవిత్వమందేమి, హాస్యోచిత సంభాషణమునదేమి, కథాచమత్కారమందేమి, ప్రతాపరుద్రీయ నాటకము శ్రేష్ఠమని నాకుఁ దోచినది. వీరి రచనములందేకాక యాంధ్ర నాటకములందిది యద్వితీయ మన వచ్చును ఈ కథ యందంతటను నాంధ్రదేశము పై శాస్త్రిలవారికెట్టి గాఢాభిమానమున్నదో వెల్లడియగుచున్నది. పేరిగాడు రోగి ప్రతాపరుద్రుడై కవిగోష్ఠిలో

నుండి కవిత్వమును గుఱించి కొంత ముచ్చటించును. కవి పేరిగాని నాశీర్వదించు నప్పుడుత్ప్రేక్షాతిశయోక్తులతో లావు లావు మాటలతో సంబోధింప వాని కవి రుచింపక యిట్లనును. యిదేంక యిత్తం యిది సీత్ కయిత్తమంటె యీలాగా! ప్రతి మనిషికీ తెలియాలి. సాకలోడికి మంగలోడికి తెలియాలి అని యనగా కవి.

"సరి ! యిక ధౌర్త్యము చేసెదను'' అని యిట్లు పేరిగాని దీవించును.

క. సలవ మడతలకి మలనే
యెలి బూడిద సౌడుసున్న మెల్లల మలేనీ
కలునీలమలె, మడేల,
యెలిగేనీయ సమునేల కెలికోకౌరా.

**పెరిగాడు :** "తెఱచిన నోరు మూయక తలయూచి యూచి
విని-నవ్వా నవ్వా భలే భలే బాపనయ్యా.
అచ్చరనచ్చలు....కయీస్సిరుడా యీలాం
టిక యిత్తం యింకెవరైనా శెప్పగల్తురా''

"కయీస్సర్లా శెప్పవయ్యా యీలాంటి కయిత్తం శెప్పేవోళ్ళు యింక మీదయినా వుంటారా, వుండరా?" అని ప్రశ్నింప భావగర్భితమైన యీ క్రింది ప్రశ్నోత్తరముల గమనింపుడు.

కవి : ఇట్టి కవులింక పుట్టఁగలరు.

పేరి : "యప్పుడు! యక్కడ? నాకిట్టాంటి కవులే గావాల యివరంగా శెప్పు"

కవి : ఇంక ఆఱు నూరేండ్లకు వేరు దొరతనములో కొన్ని తావుల మీబోటి రసజ్ఞలే బహుళమగుదురు. వారికై మీబోటి రసికులే కవనములు సేయుదురు. మీవలనే వారుభయులు చదువుకున్న వారికన్న తామే మేలనిఁ తలచువారే.

పేరి : అయ్యా-కయిస్సరయ్యా-మేము సదువు కున్నోళ్ల కంటె మెచ్చని మా కులం గుట్టు నీకేలాగ తెల్సిందయ్యా?

కవి: వరప్రసాదము మఱి ప్రకృతము. ఆ కవులు మీకుఁదగిన కవనము చేయుదురు· అది అతి నీరసముగా నుండును అందులకా రసజ్ఞులు, ఇందు లకు మీరెట్లో అట్లే. ఆనంద సాగరములో మునిగి ఊపిరి తిరగక ఉక్కిరి బిక్కిరియై డొంక తప్పిడింక కొట్టుదురు.

ఈ సంభాషణములోని విశేషమేమని నీ ప్రతాపుని కథ 610 సంవత్సర ముల క్రిందటి జరిగినది. కావున ఇంక యాఱు నూరేండ్ల కనుటలో నేటి కాలము సూచింపబడినది. మఱియు వేరు దొరతనములో ననగా నిప్పటి యాంగ్లేయ దొర తనములోనని అర్థము. మీబోటి రసజ్ఞులే యన చాకలి పేరిగాని వంటి వారట! కవిత్వము చేయువారును చాకలి వానివంటి వారేయట. మరియీా కవిత్వము అతీ నీరసమట. యిట్టి దానికే నేటి రసజ్ఞులు యానందమందు మునిగి డొంకతప్పి డింక కొట్టుదురట. నేటి కాలపు గ్రామ్యవాదులను గొంచెము చదివి మరింత వ్రాయు వారిని మనసులో నుంచుకొని పైఅభిప్రాయమును శాస్త్రులవారు పేరిగాని నోటను చెకుముకి నోటను బలికించుచున్నారు.

ఈ ప్రతాపరుద్రీయ నాటకమందు యుగంధరుఁడు వెఱ్ఱివానివలె ఢిల్లీ వీధు లందు దిరిగి తన పిచ్చిని బ్రదర్శించునపుడా కుహనోన్మత్త మహామహునిచే నిట్లు పలికించుచున్నారు. మన శాస్త్రులవారు-వెఱ్ఱి-నా ప్రతిభముందర ఇతరుల నీతి ప్రయోగ మేపాటిదో వర్ణించెద - లోగుట్టెఱుంగని వారు కవులను దూషించి తినని తలంతురు గాక- ప్రకాశముగా- పూర్వ జన్మములో నేను కవీశ్వరుణ్ణి. అప్పుడు నా కవిత్వాన్ని నేనే వర్ణించినాడ - పాడండి-

"మొద్దు మొద్దూల కవుల
బొద్దు బుఱ్ఱల మీద
గుద్దునా ముద్దు పాట"

"జబ్బు జబ్బూ కవుల
గబ్బు పాటల మీద
దెబ్బన లిబ్బి పాట"

"పుచ్చు పుచ్చూ కవుల
చచ్చు పాటల మీద
చిచ్చు నా మెచ్చు పాట"

ఈ ప్రకారముగా నింకను చాల మట్టుకు ఆ పెట్టి వానిచేఁ బాడించినాడు. ఇందుఁగూడ శ్రీ శాస్త్రిలవారు తమ ప్రతిభను నితర కవులకన్న మిన్నగా లెక్కించినట్లు ధ్వని వచ్చుచున్నది.

శాస్త్రిలవారు రచించిన అమర శతక వ్యాఖ్యయు భర్తృ హరి శతక వ్యాఖ్యయుఁ జూచినందున వారుదాహరించిన గ్రంథాలెన్నియో యనేకులెన్నడును విననట్టివి కలవు. శృంగారమును నిరూపించు తావుల ననేక కామశాస్త్రములనుదాహరించియున్నారు. నీతులనుదాహరించుచో యనేక నీతి గ్రంథముల సూచించియున్నారు- అటులే "శృంగార నైషధము"ను, ఆముక్తమాల్యదను వివరించు నప్పుడనేక ప్రమాణ గ్రంథముల నుదాహరించియున్నారు.

శ్రీ శాస్త్రిల వారికి ప్రతాప రుద్రీయముపై యభిమానము మెండు. వారు కర్నూలులో నొక వారము దినములుండిరి. అప్పుడు నన్ను జూచి నపుడెల్లను నిట్లనువారు. "నిన్ను జూచినపుడెల్లను నా ప్రతాపరుద్రుడు జ్ఞాపకము వచ్చును" అని. శాస్త్రిలవారితో నొక తూరి వారు వ్రాసిన ప్రతాపరుద్రీయ విషయమై ముచ్చటించుచు యందలి ముస్మలాన్ పాత్రములను మాట్లాడించుచో వారి ''తురక'', ''తెనుఁగు''ను గురించి విచారించితిని. శాస్త్రిలవారికేమైన ఉర్దూ కూడఁ తెలియునేమోయని తలంచియుంటిని. దానికి వారు తమ కుర్దూ యేమియుఁ దెలియదనియు, నది కేవలమూ హోజనితమే యనియు సెలవిచ్చిరి. బోయవారు పాడిన పాటలు తమ దేశమందేమైన బ్రచారమందున్నవా యని యడిగితిని. తమ దేశమందు బోయలు తెడ్డువేయునపుడు చాల బూతుపాటలు పాడుదురనియుఁ వానిని సంస్కరించి మంచి పాటలు పాడుటకుఁ జాల వీలు కలదని చూపుటకై యిట్లు వ్రాసితినని చెప్పిరి.

శాస్త్రిలవారు వ్రాసిన వ్యాఖ్యానము లన్నింటిలో వారికి 'ఆముక్త మాల్యద' పై యభిమానము మెండు. అముక్తమాల్యద'ను శ్రీకృష్ణదేవరాయలు వ్రాయలేదనియు నది పెద్దన్నయే వ్రాసెననిచెప్పు జనవాక్యముపై వారి యభిప్రాయ మేమని శాస్త్రిల వారి నడుగ వారిట్లనిరి. "రాజులు తాము వ్రాసిన కృతులను దమ యాస్థాన కవులను సరిఁజూడ నియోగించుట వింతకాదు. కావున శ్రీ కృష్ణ దేవరాయలు చేసినారు. పెద్దన్న దానిని చూసినారు.'' అని రెండే మాటలలో జవాబు చెప్పిరి. "ఆముక్త మాల్యద'' వ్యాఖ్యను ముద్రించుటకై సహాయము

కావలెనని శాస్త్రుల వారు గద్వాల రాజుల నాశ్రయించ దలచి కర్నూలొక పర్యాయము వచ్చియుండిరి. కర్నూలులో నొక సభ చేసి యందు, నా ముక్త మాల్యదను గుఱించి యుపన్యసించి యుండిరి. అచ్చట చందా కూడఁ గొంత ప్రోగయ్యెను. పిమ్మట వారు గద్వాల కేగిరి. అచ్చట శ్రీ. శే. గద్వాల ప్రభువు లుంగారు వారిని నలుబది దినములుండ నిచ్చి నాలుగు వందల రూప్యము లిచ్చి పంపిరి. శాస్త్రుల వారు కర్నూలునకుఁ దిరుగా వచ్చి గద్వాల విశేషములును దమ సహజ హాస్యంపు ధోరణిలోఁ జెప్పుచుండిరి. ఆ యంశ మిప్పుడప్రస్తుత మని సూచించితిని గాని వివరింపలేదు. శాస్త్రుల వారు గద్వాల కేగిన తర్వాత వారి హితులలో నొకరు శ్రీ శే. వనపర్తి ప్రభులగు రాజా కృష్ణదేవరావు గారితో 'నాముక్త మాల్యద' వ్యాఖ్యానమును బ్రశంసించి కృష్ణదేవరాయలు ప్రపంచ మందు వెలయించవలెను.'' చెప్ప వారు చమత్కారమునకు సంతసించి దాని ముద్రణమున కగు వ్యయమును 4000 రూపాయల నిచ్చునట్లొప్పుకొనిరి కాని శాస్త్రుల వారు కర్నూలుకు 400 రూపాయలతో వచ్చువఱకు శ్రీ కష్ణదేవరాయలు దివంగతులైరి. ఇది నా యెఱిగిన యంశముగానే వ్రాసితిని. శాస్త్రుల వారు పూదూరు, ద్రావిడులు. వారి యింటిలో వారి తల్లితో వారు అరవములో మాట్లాడుటను నేను వినినాడను. ఇట్లు ద్రావిడులైనను వీరాంధ్ర భాషకుఁ జేసిన సేవ యద్వితీయము. వీరి వలన నింకను ననేక కార్యములు కావలసియుండెను. ఒక మారు నేను మద్రాసులో కళాశాల విద్యార్థిఁగా నుండినప్పుడు శ్రీ శాస్త్రుల వారిని దర్శించుకొని యుంటిని అప్పుడు సంభాషణములో శాస్త్రుల వారు తమకేమియు నవకాశము లేదనియు దాము ఆంధ్ర వ్యాకరణము నొకదానిని సమగ్రముగా వ్రాయఁబూని నాననియు సెలవిచ్చి యుండిరి. కాని మన దౌర్భాగ్య ఫలితముగా వీరిచే నా పని కాకపోయెను. ఇంకోమారు వారిని గలిసి యుండినప్పుడు వారు సూర్యరాయాంధ్ర నిఘంటువునకై పడిన శ్రమను వర్ణించి తుదకది కొందఱి యసహనమున వ్యర్థమగుటయుఁ దానా పనిని వదలుకొనవలసి వచ్చుటయుఁ జెప్పి చింతించిరి. నిశ్చయముగా వారిచే నా నిఘంటువు కాదగినట్టిది. ఆంగ్ల వాఙ్మయమునకు జాన్‌సన్ ఎట్టివాడో మన యాంధ్రమునకు వీరట్టి వారనుటలో నేమియు సందేహము లేదు డిక్షనరీ జాన్‌సన్ అని యతఁడెట్లు పేరొందెనో యటులే వీరిని గూడ నిఘంటు శాస్త్రిగారినిగా భావి పండిత సంతతి ప్రశంసించి యుండును.

మన వాఙ్మయ మందుఁ బ్రాచీన మహాకవుల జీవితములన్నియుఁ దెనాలి రామకృష్ణుని కథల వంటివై పోయినవి. ఆధునికుల చరిత్రములు గూడ వ్రాయఁ బడలేదు. మన శాస్త్రుల వారి జీవిత చరిత్రములు గూడఁ బ్రకటించుట చాల మంచిది. ఆధునికులలో గణన కెక్కిన సర్వపండితుల చేతను సంపూజ్యులై సర్వతంత్ర మహా మహోపాధ్యాయ, పండిత రాయ, ఇత్యాది బిరుదములనేకముల సంపాదించి కవులకును, సగము పండితులకు, భయంకరుడై నిర్దుష్టమైన కవిత్వము ను వ్రాసి పండిత సభలందెల్లడలను నగ్రపూజ నొందిన శ్రీవేదము వేంకట రాయ శాస్త్రిగారి కీర్తి యాచంద్ర తారకమై వెలయు గాత. వారి యాత్మకు శాంతికలుగు గాక! ఆంధ్ర లోకము వారి ప్రతిభకు దగినట్టుగా వారిని గౌర వింతురు గాక!